# ఎఱ్ఱన అరణ్యపర్వ శేషము

1984 జులైలో
ఉస్మానియా విశ్వవిద్యాలయము వారి
డాక్టరేట్ పట్టమును పొందిన "పిహెచ్. డి."
సిద్ధాంత గ్రంథము



**డాక్టర్ ఓగేటి అచ్యుతరామశాస్త్రి**
ఎం. ఏ., పిహెచ్.డి.

ERRANA'S ARANYAPARVA SESHAMU

A Doctoral Thesis

By Dr. OGETI ACHYUTARAMA SASTRY, Rastrakavi



1000 Copies

First Edition April 6, 1989

Sukla – Ugadi



*Published by :*

SAHITYA SABHA

Hyderabad – 500 482

*Copies Available at :*

Dr. Ogeti Achyuta Rama Sastry, M.A., Ph.D.

H. No 8-2-46, Srinagar Colony Road,

Pratap Nagar, Panjagutta,

Hyderabad – 500 482.

**Price : Rs. 80/-**

*Printed at :*

Sri Laxmi Venkateswara Power Press

Narayanaguda, Hyderabad.

తెలుగు విశ్వవిద్యాలయమువారి రూ. 5000/-

ఆర్థిక సహాయముతో ముద్రింపబడినది - వారికి కృతజ్ఞతలు

# నమస్సుమాంజలి

ఉస్మానియా విశ్వవిద్యాలయము నుండి 1984 జులైలో నాకు డాక్టరేట్ డిగ్రీ వచ్చినప్పుడు "సంస్కృత భారతి" పత్రికలో ఆ పత్రికా సంపాదక మండలి పక్షమున ఆచార్య డా॥ దివాకర్ల వేంకటావధాని గారు నన్ను గూర్చి ఒక చిన్న - కాని విషయ గరిమతో నొప్పు కళాఖండ మనదగిన - అభినందన వ్యాసమును వ్రాసిరి. అందుండి ఒకే ఒక వాక్యమును, ఒకే ఒక శ్లోకమును ఉట్టంకించుచున్నాను ;

"........ఇంతకు పూర్వము ఎవ్వరు స్పృశించని "ఎఱ్ఱన అరణ్య పర్వ శేషము" అను విషయముపై పరిశోధన సాగించి ఇటీవలనే పిహెచ్ డి. పొంది యుండిరని విని సంతోషించుచు హృదయపూర్వకముగ వారికభినందనల నందిం చు చున్నాము ..."

"ఓగేటి వంశవార్ధీందుః డాక్టర్ పట్టాభి శోభితః
అచ్యుతరామాభిఖ్యో దీర్ఘాయు ర్జయతాచ్చిరమ్"
సంస్కృత భారతి - ఏప్రిల్ - జులై 1984

దరిమిలా ఉదార చరితులు శ్రీ జి. పుల్లారెడ్డిగారు తమ ఇంటిలో జరిగిన విద్వత్సభలో నన్ను సన్మానించిరి అప్పుడు శ్రీ అవధానిగారు ఇష్టాగోష్ఠి సంభా షణలో - నన్నయ తిక్కనలకు పిమ్మట వచ్చిన ఎఱ్ఱన అరణ్యపర్వ శేషమును పూరించి భారత రచనకు సమగ్రతను సమకూర్చెను; అట్లే నన్నయ తిక్కనల భారత భాగములపై ఇప్పటికి ఎన్నియో కొన్ని పిహెచ్.డి. లు వచ్చిన తరువాత ఇన్నాళ్ళకు శ్రీ ఓగేటి అచ్యుతరామశాస్త్రిగారు అరణ్య పర్వశేషముపై పిహెచ్.డి. చేసి భారతమునకు సంబంధించిన పరిశోధనకు సంపూర్ణతను సంతరించిపెట్టుట ముదావహము, అని చమత్కరించుట నాయదృష్టము ! అట - శ్రీ పుల్లారెడ్డిగారికి మంగళాశాసనము చేయుచు ఇటు-ఇప్పుడు కీ॥ శే॥ అవధానిగారికి భక్త్యంజలి సమర్పించుచున్నాను.

అదే వరుసలో నగరమునందలి సాధనా సాహితీ స్రవంతి వారు నన్ను సన్మానించుటకు ఒక సభను ఏర్పాటుచేసిరి. సభాధ్యక్షులు డా॥ ఇరివెంటి కృష్ణ మూర్తిగారు - ఎఱ్ఱన కృతులన్నింటిని కలిపిగాని, విడివిడిగా అతని యితర కృతులపై గాని ఇప్పటికి కొంత పరిశోధన జరిగిన మాటనిజమే. అసలు అరణ్య

పర్యేశేష రచనవల్లనే ఎఱ్ఱన కవిత్రయములో నొకడైనాడు. అట్టియెడ ప్రత్యేకించి దానిపై ఇంతవఱకు పిహెచ్.డి. రాకపోవుట పెద్ద లోపమే. ఆ లోపమును తీర్చిన ప్రజ్ఞాధురీణులు డా॥ ఓగేటివారు- అని సెలవిచ్చుట నా భాగ్యము ! అటు- సాధనా సాహితీ స్రవంతి వారికి సాధు వాదములు పలుకుచు ఇటు- ఇప్పుడు కీ॥శే॥ ఇరివెంటి వారికి శ్రద్ధాంజలి ఘటించుచున్నాను.

ఇట్లు నా పాలి దైవము నాకీ యరణ్య పర్వశేషమును ప్రసాదించుట నాయదృష్టము. దీనిపై పరిశోధించుటకును, సిద్ధాంత వ్యాసమును ముద్రించు కొనుటకును అనుమతిని ప్రసాదించిన ఉ.వి.వి అధిపతులకు కృతజ్ఞతలు తెలుపు చున్నాను.

ఈ విషయముపై పరిశోధించుటకు నవకాశము కల్పించి, నిపుణముగ పర్యవేక్షించి, అమూల్యములైన అనేక సూచనలనొసగి యీ సిద్ధాంతవ్యాసమునకు వన్నె ఘటించిన ఉ. వి. వి. ఆనాటి ఆంధ్ర శాఖాధ్యక్షులు ఆచార్య డా॥ బి. రామరాజుగారికి -

తొలిదశలో అనగా ప్రీ - పిహెచ్.డి. పరీక్షలో ఉత్తీర్ణుడనైనదాక నాకు పర్యవేక్షకులుగ నుండి చక్కని మార్గమును నిర్దేశించిన ఆచార్య డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం గారికి -

నా పరిశోధనలో జరుగుచున్న కృషిని గూర్చియు, ప్రగతిని గూర్చియు అడిగి తెలిసికొనుచు అడుగడుగునా ప్రోత్సహించుచూ వచ్చిన ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డిగారికి, ఆచార్య డా॥ యం. కులశేఖరరావు గారికి -

నాయీ సిద్ధాంత వ్యాసమునకు పరీక్షకులుగ వ్యవహరించి నన్ను కృతార్థుని చేసిన ఆచార్య డా॥ కేతవరపు రామకోటిశాస్త్రిగారికి, ఆచార్య డా॥ యమ్. సుబ్బారెడ్డి గారికి -

నా శ్రేయోభిలాషులు సంస్కృతాంధ్ర మహాకవి మా అన్న పండిట్ శ్రీ ఓగేటి పరీక్షిత్‌శర్మ గారికి

ఈ మహనీయులందరికీ నమస్సుమాంజలులు సమర్పించుచున్నాను.

ఈ గ్రంథ ముద్రణ కార్యమున సహకరించిన శ్రీ బి. రామాచార్యులు యమ్. ఫిల్. గారికి, గ్రంథమును సకాలములో ఇట్లు అందముగా ముద్రించి యిచ్చిన శ్రీ లక్ష్మీ వేంకటేశ్వర పవర్ ప్రెస్ సిబ్బందికి ధన్యవాదములు సమర్పించుచున్నాను.

హైదరాబాదు
6-4-1989

ఓగేటి అచ్యుతరామశాస్త్రి

భాషాప్రవీణ

## డా॥ ఓగేటి అచ్యుతరామశాస్త్రి,

ఎం. ఏ., పిహెచ్.డి.



జననం : 2 ఆగస్టు 1932

1942 క్విట్ ఇండియా ఉద్యమంలోను, 1947, 48 లో హైదరాబాదు విమోచనోద్యమంలోను పాల్గొని, సరిహద్దు క్యాంపుల్లో పనిచేసి శ్రీకృష్ణ జన్మ స్థానమునకు వెళ్ళి వచ్చిన దేశభక్తుడు.

తెలుగు - సంస్కృత - హిందీ - ఆంగ్ల భాషల్లో సమ్యక్ పరిచయం.

వక్త-కవి - రచయిత - పరిశోధకుడు - గ్రంథకర్త.

7-4-1970లో "సంస్కృత థియేటర్-హైదరాబాదు" అను సంస్కృత నాటక ప్రయోగ సంస్థ స్థాపకులు, అధ్యక్షులు. నాటకప్రయోక్తలు దర్శకులు, నటులు, గాయకులు.

రంగస్థలం మీద ప్రదర్శించిన, ఆకాశవాణి హైదరాబాదు కేంద్రం నుండి ప్రసారం చేసిన అనేక సంస్కృతాంధ్ర మహానాటకాల్లో నాయక ఉపనాయక పాత్రధారులు.

హైదరాబాదులో 1974లో ప్రారంభింపబడిన తొలి సంస్కృత పత్రిక "సంస్కృత భారతీ" సంస్థాపక వ్యవస్థాపక సంపాదకులు.

హైదరాబాదులో పంజగుట్టకు దాపులోనున్న కేశవనగర్ కాలనీలో 1975 నుండి నెలకొనియున్న హైస్కూలు స్థాపకులలో, దాని యభివృద్ధికి కారకులలో నొకరు. విద్యాప్రచారకులుగా సామాజిక కార్యకర్తగా మన్ననలు పొందినవారు.

1978లో రాష్ట్ర ప్రభుత్వంచేత ఉత్తమ ఉపాధ్యాయులుగా గుర్తింపబడి "స్టేట్ అవార్డు"ను పొంది అప్పటి ఆం ప్ర. గవర్నర్ గౌ॥ కె. సి. అబ్రహాం గారిచే సన్మానింపబడినవారు,

సంస్కృత నాటక ప్రయోగోద్ధారక-నటరాజనందన-ఆశ్చర్యకుశలవక్త-మహోపాధ్యాయి - రాష్ట్రకవి - ఇత్యాది బిరుద లక్షణాభిధేయులు.

లెక్చరర్, తెలుగు & ఇండియన్ హెరిటేజ్ అండ్ కల్చర్, విజయనగర్ కాలేజి ఆఫ్ కామర్సు, విజయనగర్ కాలనీ, హైదరాబాదు-500 457.

వీరి సాహిత్య రచనలను గూర్చిన వివరములకు ఈ గ్రంథములోని 225, 226, 227, 228 పుటలను చూడగలరు.

# జననీజనకుల దివ్యస్మృతికి....

ఎల్జిన అరణ్యపర్వశేషము- అను ఈ నా సిద్ధాంత గ్రంథమును మా తల్లిదండ్రులు కీ. శే. ఓగేటి కౌసల్యాదేవీ సాంబమూర్తుల దివ్యస్మృతికి అంకిత ముగ సమర్పించుచున్నాను. తల్లి 1942 డిసెంబరులోను, తండ్రి 1975 మార్చి లోను దివంగతులైరి. తల్లి ఫొటో అసలు లేనేలేదు; లభించిన తండ్రి ఫొటో మాత్రమే యిట పొందుపఱుపబడినదని మనవి చేయటమైనది.

తల్లి సంస్కృతాంధ్ర భాషా పరిజ్ఞానము గలిగిన విదుషీమణి. రామాయణ భారత భాగవతాది గ్రంథస్థ విషయము లామెకు కరతలామలకములు. ఆమె మాకు ఉగ్గుపాలతో రంగరించి పోసిన, గోర్ముద్దలు తినిపించుటతోబాటు వినిపిం చిన ఆ మహాగ్రంథముల యందలి సంస్కృతి ధర్మముల సారమే మా జీవన సంస్కృతికి పునాది. ఆమె దివంగతురాలైన పిమ్మట 33 సంవత్సరములు మమ్ము కనిపెట్టుకొని యుండి మా యదృష్టమును పండించుటకు- పండించు కొనుటకు ఘంటాపథమును నిర్మించిన మహాత్ముడు తండ్రి !

తండ్రి వృత్తిచేత ఉపాధ్యాయులు; ప్రవృత్తిచేత ఆర్షధర్మ సంస్కృతీ ప్రచారకులు. సంస్కృతాంధ్రాంగ్ల భాషలలో దిట్ట, మహావక్త, గ్రంథకర్త. వారు వ్రాసిన "హిందూ మతము" అన్న పుస్తకము మిక్కిలి ప్రశస్తికెక్కినది. "ఆర్షధర్మ పాఠశాల"ను స్థాపించి బాలబాలికలకు మన ప్రాచీన సంస్కృతీ ధర్మములను బోధించి మంచి కార్యకర్తలుగా దిద్దితీర్చిన మహనీయుడు ! స్వంత ధనముతో భగవద్గీతను ప్రచురించి జిజ్ఞాసువులకు ఉచితముగ పంచిపెట్టి, మన తత్త్వయోగమును ప్రచారము చేసిన కర్మయోగి ! శుద్ధికార్యమును చేపట్టి కొన్ని వెందలమంది హైందవేతరులను మఱల హిందూ ధర్మమునకు తెచ్చిన కార్య శూరుడు ! ఎట్టి భోగభాగ్యములను కోరక, యదృచ్ఛాలాభ సంతుష్టుడై నిరాడం బర జీవితమును గడపి ఇహలోక యాత్రను చాలించిన యోగిపుంగవుడు !

"జీవితమును నిస్స్వార్థ బుద్ధితో, త్యాగభావముతో సమాజసేవకై సమ ర్పింపుడు. సామాన్య మానవ కల్యాణమునకై ప్రత్యేకించి కృషి చేయుడు" అని మా తండ్రి మాకిచ్చిన సందేశము, నిర్దేశము ! అట్టి ఆదర్శ జననీజనకుల దివ్యస్మృతికి ఈ గ్రంథము సమర్పితమైనది.

హైదరాబాదు
6-4-1989
శుక్ల - ఉగాది

ఓగేటి అచ్యుతరామశాస్త్రి

## అంకితము

కీ. శే. మా జననీజనకులు

ఓగేటి కౌసల్యాదేవీ సాంబమూర్తి గార్ల

దివ్య స్మృతికి



కర్మయోగి

శ్రీ ఓగేటి సాంబమూర్తిగారు

# విషయానుక్రమణిక

# అనుక్రమణిక

# ప్రవేశము

భారతీయ సనాతనధర్మమునకు మూలస్రోతస్సులు వేదములు. మానవ కళ్యాణకారకములయిన అట్టి వేదముల సారమును రామాయణ, మహాభారతముల ద్వారా లోకమునకు ప్రసాదించిన వారు వాల్మీకి, వ్యాస మహర్షులు. ఈ రెండు గ్రంథములును ఈ జాతి జీవనమున నెంతటి నిత్యనూతన చైతన్య లీలా విలాసములను నింపుచున్నవో చెప్పతరముగాదు ! ఈ జాతి ఆ మహర్షుల ఋణమును ఎన్నటికిని తీర్చుకొనజాలదు. వాల్మీకి యవతారమగు రామాయణము వేదసారమట ! వ్యాసుని యవతారమగు భారతము వేదమేయట ! "భారతం పంచమో వేదః" అని గదా ప్రసిద్ధి. ఇందులేనిది మరేగ్రంథములోను ఉండదు !

ఈ విశ్వవిజ్ఞాన మహాకోశమును గూర్చి కవిత్రయమువారు సెలవిచ్చిన మహావాక్యములను దిఙ్మాత్రముగ స్మరించుట మంగళకరము. ఆంధ్రభాషకు నాదికవియేగాక నాదర్శకవియునైన నన్నయ తన భారతావతారికలో ఉల్లేఖాలంకారమునకు మహాలక్ష్యమనదగిన, ఋక్కువలె ఋతంభరమైన "ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని యధ్యాత్మవిదులు వేదాంతమనియు" అను పద్యములో వేదవ్యాసుడు "విశ్వజనీనమై పరగుచుండఁజేసె భారతంబు" అని సెలవిచ్చెను.

తిక్కన మనీషి తన విరాట పర్వావతారికలో "వేదములకు నఖిలస్మృతివాదములకు బహుపురాణ వర్గంబులకున్ వాదైనచోటులను దామూదల ధర్మార్థకామమోక్షస్థితికిన్" అని యానతిచ్చెను. ఇందు "మూదల" అనగా **Reference Book** అని యర్థమట. ఇక ఎఱ్ఱన ప్రశంసించిన విధమిది:

చం॥ భారత పుస్తకప్రతతి వ్రాయక యే సుకృతాత్మునింట నో
ప్పారుచు నిత్యపూజనల నందుచు నుండుఁ దదీయ వాసముం
జేరి తలిర్చు నిష్ట జయసిద్ధి నిజంబు పురాణపూరుషా
ధారకథా మయంబగుటఁ దత్సదృశంబులె యొండు గ్రంథముల్

—హరివంశము - ఉత్తరభాగము - ఆ. 10-३३9.

ఇట్లు కృష్ణద్వైపాయన మునికృత మహాభారతమున పదునెన్మిది ప్రధాన పర్వములున్నవి. తదంతర్గతముగ నూఱు ఉప పర్వములున్నవి. లక్ష శ్లోకము లున్నవి. నన్నయ అష్టాదశ పర్వ విభాగమును పాటించి, ఉపపర్వ విభాగమును విడనాడి, ఆశ్వాస విభజన విధానమును ప్రవేశపెట్టెను. మక్కికి మక్కి యనువాద మును గాక, కృష్ణద్వైపాయన ముని వృషభాభిహిత మహాభారత బద్ధనిరూపితార్థ మేర్పడునట్లు అధిక ధీయుక్తితో తెనుగున మహాకావ్యముగ సంతరించెను. ఈమార్గ మునే పిమ్మట తిక్కన ఎఱ్ఱనలు అనుసరించిరి. సంస్కృతమునందలి లక్ష శ్లోక ములను కవిత్రయమువారు మొత్తము 21507 గద్యపద్యములలో సాంధ్రీక రించిరి. ఇది తెలుగుల ఆదికావ్యము,

బ్రహ్మ విష్ణు మహేశ్వరుల మూర్తిత్రయమున్నది. వాల్మీకి వ్యాస కాళి దాసుల సంస్కృత కవిత్రయమున్నది. నన్నయ తిక్కన ఎఱ్ఱనల తెలుగు కవి త్రయమున్నది. ఋషివంటి నన్నయ్య రెండవ వాల్మీకి ! తిక్కన నవీన పరాశర సూనుడు ! ఎఱ్ఱన కాళిదాసు ! ఇదీ వరుస ! "నన్నయను పోలినవాడు సృష్టిలో మరొకడుండడు ! తిక్కన లేనిచో తెలుగు కవిత్వము లేదు" అని కీ. శే. విశ్వ నాథ సత్యనారాయణగారి నిష్కర్ష ![1] ఆ మహితాత్ముల ఇర్వురియంశతో అవత రించిన మహనీయుడు ఎఱ్ఱనార్యుడు. నన్నయ దొక మార్గము ! తిక్కనదొక మార్గము ! ఈ రెండును దేని స్రోవనది పోనీయక కలిపి ముడి బిగించిన ఘనుడు ఎఱ్ఱన ! అందువలన ఈ భాషకొక సంస్కృతి యేర్పడినది ! ఒక క్షుణ్ణమైన మార్గమేర్పడినది !

అటు నన్నయను గూర్చియు, ఇటు తిక్కనను గూర్చియు ఎందరెందరో మహనీయులు పరిశోధనలు సలిపి సిద్ధాంత వ్యాసములను సమర్పించి యుండిరి. ఎఱ్ఱన్నను గూర్చియు నాతని యితరప్రబంధములపై పరిశోధనలు చేసిన మహ నీయులున్నారు. నాపాలి దైవము నాకీ "యరణ్యపర్వ శేషమును" ప్రసాదించుట నా యదృష్టము ! నా సాహిత్య జీవితము కన్నులు విచ్చినది మొదలు పొరిపొరి మిరుమిట్లు గొన్నది "స్ఫురదరుణాంశు రాగరుచులకే" ! ఆ యాంధ్ర సాహిత్య నభోమణికి, అతని ప్రతిభా ప్రభానివ్యందమగు అరణ్యపర్వ శేషమునకు నమస్క రించి పిమ్మటి ప్రకరణమును ప్రారంభింతముగాక !

---

1. "పూర్వాంధ్ర సాహిత్యము" - వ్యాసము, "ఆంధ్రప్రదేశ్" ప్రభుత్వ తెలుగు మాసపత్రిక, నవంబరు 1976.

# ఇక్కడ నుండి యెఱ్ఱాప్రెగడ కవిత్వము

స్ఫురదరుణాంశురాగరుచిఁ బొంపిరివోయి నిరస్తనీరదా
వరణములై దళత్కమల వైభవ జృంభణ ముల్లసిల్లను
ద్ధురతర హంస సారస మధువ్రత నిస్వనముల్ సెలంగగాఁ
గరము వెలింగె వాసర ముఖంబులు శారద వేళఁజూడఁగన్

ఇది ఎఱ్ఱన "నన్నయభట్ట మహాకవీంద్రు సరస సారస్వతాంశ ప్రశస్తి దన్నుఁజెందుటయు, సాధుజన హర్ష సిద్ధిగొం తత్కవితారీతియు గొంత దోప దద్రచనయకాఁగవీంద్ర కర్ణపుటపేయముగా" పూరించిన అరణ్యపర్వ శేషములోని చతుర్థాశ్వాసము నందలి 143వ పద్యము. దీనికి ముందటిదగు "శారదరాత్రులు జ్వలసత్తర తారకహార పంక్తులన్ చారు తరంబులయ్యె" అను 142వ పద్యముతో నన్నయగారి కవిత్వమాగిపోయినది. అందుకు కారణమాతని మరణము! మరణించుటకు చెప్పబడుచున్న కారణములలో అరణ్యపర్వముయొక్క "దుష్ప్రభావము" అనునదొకటి ! దీనిని విశ్వసింపవచ్చును. ఏలయన అరణ్యపర్వములోని కథలనన్నింటినీ పరిశీలించి చూడగా ప్రతి కథయు నెంతటి మనోహరమైనదో అంతటి యమంగళ భయంకర సన్నివేశ ముద్రాంకితమై యున్నది. ఈ "దుష్ప్రభావము" అతనిని హతమార్చియుండు ననుట కట్టుకథ వంటిది కాజాలదు. గతానుగతికముగనట్లు నమ్ముచు వచ్చిన ప్రాచీనుల చిత్తవృత్తిని కాదనుటకును వీలుగాదు. కాగా దీనినిట్లు చెప్పవచ్చును : నన్నయగారి గంట మాగిపోయిన కథాఘట్టము అజగర ప్రశ్నలు; భీముని విడిచిపెట్టిన అజగరము మన దురదృష్టము కొలది నన్నయ్యను కాటు వేసినది !

పిమ్మట సుమారు 200 సంవత్సరములకు అవతరించిన తిక్కన నన్నయ విడిచిపెట్టిన యరణ్యపర్వ శేషమును పూరింపక నాల్గవదగు విరాటపర్వమాదిగా స్వర్గారోహణ పర్వ పర్యంతము గల పదిహేను పర్వములను ఏకధాటిగా నిర్వహించెను. ఈతదరణ్య పర్వ శేషమును పూరింపక విడిచిపెట్టుటకు విమర్శకు లూహించిన కారణములలో ఆ పర్వముయొక్క 'దుష్ప్రభావము' నన్నయనుపలె

తనను కూడ పట్టి పల్లార్చునేమో అన్న భయమొకటి! ఇదియు విశ్వసింప వచ్చును. అయితే, ఈ భయము కొందఱు భావించుచుండినట్లు సామాన్యులకుండు 'పిఱికి తనము' మాత్రము కాదు. అతడు మంత్రశాస్త్ర రహస్యములు తెలిసిన వాడు. అరణ్యపర్వము నందలి "దుష్ప్రభావమును" సరిగా నంచనా వేసికొని నాడు. దాని జోలి విరమించుకొన్నాడు. కవిత్రయమువారు కారణజన్ములు. వారికొక నిర్దిష్టమైన ధ్యేయము, నిర్దుష్టమైన మార్గమునున్నవి ఒక మహా ప్రయోజ నమును సాధించుటకు మరణించుట యెంత యవసరమో జీవించుటయు నంతే యవసరమని భావించినవారు. తిక్కన యెదుటనొక సమస్య నిలిచియుండును! అరణ్యపర్వము యొక్క దుష్ప్రభావము నెరిగియు దానిని పూరించుటకు పూను కొని మరణించుటయా, లేక విరాటపర్వముతో ప్రారంభమగు నఖండ భారత భాగమును తుదముట్ట రచియించుటకు జీవించుటయా అన్నది. విశ్వశ్రేయము నకై రెండవ దానికే తిక్కన పూనిక వహించినాడు, ఇది భయమే యయినచో నది యాతని కలంకారమే యనుట నిష్కర్ష. కాగా దీని నిట్లు చెప్పవచ్చును: అజగరము నన్నయ్యను మ్రింగివేసినది. అరణ్యపర్వ శేషాంతమున యక్షు డున్నాడు. అతడు యముడు! అతడు తన్ను కాటువేయునేమో అన్న భయ ముతో తిక్కన యరణ్యపర్వ శేషమును పూరించలేదు; మన యదృష్టము కొలది యక్షుని బాఱి పడలేదు.

తిక్కనకు పిమ్మట సుమారు వంద సంవత్సరములకు ఎఱ్ఱనుదయించెను. అతడు ధీరవిచారుడు. నిర్భీత చేతస్కుడు. ఈతని యెదుట ఒకే ఒక సమస్య నిలిచియుండును. చావునకు తెగించి "సాధు జన హర్ష సిద్ధిగోరి" అరణ్యపర్వ శేషమును పూరించుటయా, లేక జీవితేచ్ఛతో విరమించుటయా అన్నది! నన్నయ 'జగద్ధితముగా' భారతమును వ్రాయుచు మరణించెను. తిక్కన "ఆంధ్రావళి మోదముంబొరయ" పదిహేను పర్వములను పండించుటకు జీవించియుండెను. తాను కూడ నట్టి ప్రయోజనము కొఱకు మరణించుటయో, జీవించుటయో తప్పదు; అను నిశ్చయమునకు వచ్చి యుండును. అరణ్యపర్వ "దుష్ప్రభావము" నన్నయ మరణముతోను, పిమ్మట తిక్కన్న నిర్మించిన మంగళమయ వాతా వరణముతోను కొట్టుకొని పోయి యుండుననియు భావించియుండును. అటు సావిత్రి కథలోను, ఇటు యక్ష ప్రశ్నల ఘట్టములోను తారసపడు యముని ధిక్కరించి, మృత్యువును జయించిన మార్కండేయ మహర్షితో కలిసి యరణ్య

పర్వశేష రమ్యకథలను నిర్విఘ్న పరిసమాప్తిగ, 'సవిస్తర మధురంబుగ'[1] ధర్మజునకు నుపన్యసింపగలనని యాత్మ ప్రత్యయము వహించియుండును. అజగర ప్రశ్నలకు, యక్ష ప్రశ్నలకు మధ్య మేరునగ ధీరుడై నిలబడి-

"ఎఱ్ఱనార్యుండు సకలలోకైక విదితుఁడయిన నన్నయభట్ట మహాకవీంద్రు
సరస సారస్వతాంశ ప్రశస్తి దన్నుఁజెందుటయు సాధుజన హర్షసిద్ధిఁగోరి
ధీర విచారుడు తత్కవితా రీతియుఁగొంతఁదోపఁద ద్రచనయకా
నారణ్య పర్వ శేషము పూరించెఁగవీంద్ర కర్ణపుట పేయముగాన్"

నన్నయ మరణముతో నాగిపోయిన భారత రచన, పిమ్మట రెండువందల సంవత్సరములదాక, తిక్కన వచ్చువఱకు కొనసాగక స్తంభించిపోవుటకు గాని, తిక్కనకు తరువాత వంద యేండ్లవఱకు, ఎఱ్ఱన వచ్చుదాక నరణ్యపర్వ శేషము పూరింపబడక నిలిచిపోవుటకుగాని విమర్శకు లూహించిన కారణములు పెక్కులుగలవు. తక్కిన కారణములెట్లున్నను అరణ్యపర్వ దుష్ప్రభావ జనిత భీతియే ప్రధాన కారణముగ కాన్పించుచున్నది. చిత్రమేమన, ఇది వక్తయైన నన్నయ్యనే కాక, శ్రోతయైన రాజరాజును కూడ హతమార్చినట్లు చెప్పనొప్పును![2] ఐదేండ్ల వ్యవధిలో రెండు మరణములు! అందుమూలమున వచ్చిపడిన రాజకీయ కల్లోలములు! ఇక దానిని ముట్టనెవ్వరు సాహసింతురు? ప్రోత్సహించుట కెవ్వరు పూనుకొందురు! సాహసింపనవకాశము కల్గియుండిన వ్యక్తి నారాయణ భట్టు మాత్రమే. భారత ఘోర రణమున పాకశాసనికి నారాయణుడువలె, భారత రచనా వ్యాసంగమున నీతడు తనకు తోడ్పడినట్లు నన్నయగారి వక్కాణ.[3] అట్లయినచో, శ్రీకృష్ణ నిర్యాణముతో నర్జునుడు నిర్వీర్యుడైనట్లు, తద్వ్యతిరిక్త క్రమమున నన్నయ నిర్యాణముతో నీ నారాయణభట్టు నిర్వీర్యుడైనట్లు భావింప వచ్చును. యథార్థమేమన నారాయణభట్టు గొప్ప పండితుడే గాని మంచికవి కాడేమో! నందంపూడి శాసనమున ఆతనిని గూర్చి నన్నయ వ్రాసినట్లు గొప్ప కవియే యనుకొందము! భయమొకటున్నది గదా! దీనికి తోడు ఆంధ్ర భారత రచనము ద్వారా నన్నయ తలపెట్టిన వైదిక మతోద్ధరణకు, వీరశైవుల

1. అరణ్యపర్వ శేషము - ఆ, 7-467.
2. నన్నయ మరణము క్రీ॥శ॥ 1057, రాజరాజు మరణము-1061.
3. ఆదిపర్వము - అవతారిక : 25.

మతావేశములకు సంఘర్షణ ముండనే యున్నది! ఇన్ని పరిస్థితులలో తొలి విడతలో భారత రచన మాగిపోయినది. మలి విడతలో, అనగా తిక్కన ఎఱ్ఱన్న లకు నడుమ అరణ్య పర్వశేష పూరణమాగిపోవుటకు గూడ భయమే కారణమని చెప్పుట చర్విత చర్వణము. ఇదిట్లుండ, తిక్కనగారు చెప్పిన "మూడు కృతుల"[1] పొడుపు కథ బాగుగా పనిచేసి కవులను తికమకపెట్టి యుండును. ఎఱ్ఱన కారహస్యము తెలిసినదే తడవు సమస్య పరిష్కరింపబడినది, భారత రచన పూర్తియైనది!

ఇట్లు మూడు వందల సంవత్సరములలో, ముగ్గురు కవులచేత, మూడు విడతలుగా, మూడు భాగములుగా సంతరింపబడి మన భాషా సారస్వత ములను పండించి గాదెలకు పోసిన మహాగ్రంథము - ఆంధ్ర మహాభారతము! రాత్రికి "త్రియామా" అను పేరు గలదు. అనగా మూడుజాములు గలది యని యర్థము. వంద సంవత్సరములకొక జాము చొప్పున మూడు జాముల సుదీర్ఘ రాత్రి తెలుగు సాహిత్య ప్రపంచమున చీకటులు చిమ్మినది. "రాత్రిర్గమిష్యతి భవిష్యతి సుప్రభాతమ్' అను నాసతో తెలుగువారి యెదలు అరుణోదయమునకై యెదురు తెన్నులు చూచుచు తహతహ లాడినవి. చూడగా చూడగా నొకానొక వేళా విశేషమున శారద ప్రసన్నయైనది. శారద వేళ నరుణోదయమైనది. ఋతంభరమైన పద్యమావిర్భవించినది!

> స్ఫురదరుణాంశు రాగరుచిఁబొంపిరివోయి నిరస్త నీరదా
> వరణములై దశత్కమల వైభవ జృంభణ ముల్లసిల్ల ను
> ద్ధురతర హంస సారస మధువ్రత నిస్వనముల్ సెలంగగాఁ
> గరము వెలింగె వాసర ముఖంబులు శారదవేళఁ జూడఁగన్

—చతుర్థాశ్వాసము - 148

ఆంధ్ర సాహితీ విహాయసము నిరస్త నీరదా వరణమైనది. శారదా తనయుల దళత్ హృదయ కమల వైభవ జృంభణ ముల్లసిల్లినది. సాహితీ క్షీరములను గ్రోలుట కువ్విళ్లూరిన కవిరాజహంసల యొక్కయు, సాహిత్య మకరందముల నాస్వాదించుటకు తహతహలాడిన కవిమధువ్రతముల

1. విరాటపర్వము - అవతారిక - పద్యము : 6.

యొక్కయు ఆనందోద్రిక్త కోలాహలములు పెల్లుబికినవి ! అను సుకుమార వ్యంగ్య వైభవముతో నొప్పుచున్న యీ పద్యమందలి యెఱ్ఱయ కవితావైభవము వర్ణనాతీతము !

## దేవతాస్తుతి - గురుస్తుతి :

నన్నయ తిక్కనలకు వలె నరణ్యపర్వ శేష ప్రారంభమున, అవతారికను సంతరించు నవకాశము ఎఱ్ఱన్నకు దక్కలేదు. కనీసము దేవతాస్తుతి చేయుట కైనను వీలు చిక్కదయ్యెను. ఆ కొఱతను తీర్చుకొనుటకు అరణ్య పర్వ శేష ప్రారంభమున "సరస్వతీ గీత"లో తార్క్ష్యుడు సరస్వతీ దేవిని స్తుతించిన-

అంబ నవాంబుజోజ్జ్వల కరాంబుజ ! శారద చంద్ర చంద్రికా
డంబర చారుమూర్తి ! ప్రకటస్ఫుట భూషణ రత్న దీపికా
చుంబిత దిగ్విభాగ ! శ్రుతి సూక్త వివిక్త నిజప్రభావ ! భా
వాంబర వీథి విశ్రుత విహారి ! ననుం గృపఁజూడు భారతీ !

—ఆ - 4 : 216

అను సమూలకమైన పద్యమును తొలుత దేవతాస్తుతి రూపముగ వ్రాసి, యా పిమ్మట "స్ఫురదరుణాంశు రాగరుచి" అను పద్యముతో నెఱ్ఱయ గ్రంథ రచనను ప్రారంభించి యుండునని ఆరుద్రగారొక చక్కని యూహ చేసిరి.[1] కీ. శే. నోరి నరసింహశాస్త్రిగారు నృసింహ పురాణము అవతారికలోని యీ క్రింది పద్యము నుదహరించి:

చ॥ కరకమలంబునందుఁ బటికంపుఁగమండలు వచ్చ కాంతి భా
సురమగు మౌక్తికంపు జపసూత్రముఁదాల్చుట, బ్రహ్మవాదియై
పరగిన హంసముంబిలిచి బాల మృణాళముఁజూపు చందమౌ
సిరి దిలకింపఁనొప్పు బుధ సేవిత మూర్తిఁ దలంతు భారతిన్

—పద్యము : 6

---

1. సమగ్రాంధ్ర సాహిత్యము : మూడవ సంపుటము, పుట - 189.

ఇందలి 'భారతిన్' అనునది సరస్వతీదేవికే గాక, ఎఱ్ఱయ గురువునకు గూడ నన్వయించుచున్నదనియు, శృంగేరి మొదలగు మూల శంకర పీఠస్వాము లందరూ భారతీ సంప్రదాయ పరులగుటచే నెఱ్ఱయ గురువగు శ్రీ శంకరస్వామి కూడ భారతీ యతియై యుండుననియు, కనుక ఎఱ్ఱన యీ పద్యమున తన గురువునుకూడ ప్రార్థించి యుండెననియు సెలవిచ్చిరి.[1] అట్లయిన "అంబ నవాంబు జోజ్జ్వల కరాంబుజః" అన్న యీ ప్రకృత పద్యమందలి 'భారతీ' అను సంబోధన కూడ సరస్వతికేగాక పుంభావ సరస్వతియైన అతని గురువునకు గూడ నన్వయించుచున్నదని భావింప వచ్చును. ఇట్లీపద్యమున దేవతాస్తుతి, గురుస్తుతి కూడ సిద్ధించుచున్నవి.

"స్ఫురదరుణాంశు రాగరుచి" అను తొలిపద్యము లోని యీతొలి వాక్యమే సూర్యస్తుతి రూపముననున్న గ్రంథాది దేవతాస్తుతిగా భావింపవచ్చును, ఎట్లన :

"దేవతా వాచకా శ్శబ్దాః యేచ భద్రాది వాచకాః
తే సర్వే నైవ నింద్యాస్యుః లిపితోగణతోఽపివా"[2]

అను ప్రమాణమును బట్టి 'అరుణ' శబ్దము దేవతావాచకము గాన నిది గ్రంథారంభమున చేయ బడిన దేవతాస్తుతి వాక్యమే యగును. మరియు నీ పద్యమందలి ప్రథమ గణము సూర్య గణమగుట విశేషము. సూర్యగణమగు నగణమునకు నధి దేవత చంద్రుడు. ఈ గణముతో గ్రంథాది పద్యమును ప్రారంభించుట శుభప్రదమని శాస్త్రము. అప్పకవి చతుర్థాశ్వాసమున గణాధి దేవతా ఫల ప్రకరణమున నిట్లు చెప్పెను : "నగణంబమృతాంధో నాథ దేవతాకంబుగాన సకల భోగప్రదంబని.... .... .... అరణ్య పర్వావశిష్టంబుందు భీమకవి శాప భయంబున జయము గోరి" "స్ఫురదరుణాంశు రాగరుచి" యని శంభుదాసుండును.......... చెప్పిరి. (వచనం—78)

ఈ వరుసలో 74, 75 పద్యములందీతడు నగణము యొక్క ప్రాశస్త్యమును విపులముగా వర్ణించెను. ఇదంతయు చూడగా నెఱ్ఱన్న యీతొలి పద్యమును,

1. విజ్ఞాన సర్వస్వము - 3 వ సంపుటము - పుట : 735.
2. "శిశుపాల వధమ్" కావ్యములోని మొదటి శ్లోకమునకు వ్యాఖ్య వ్రాయుచు మల్లినాథ సూరి ఉట్టంకించిన శ్లోకము.

అందునను ఈ తొలి వాక్యమును వ్రాయునప్పుడెవ్వో ఛందః శాస్త్ర విష యములను దృష్టియందుంచుకొన్నాడనుట నిక్కము. "ఆరోగ్యం భాస్కరాది చ్ఛేత్" అన్న సూత్రము నెరిగిన యెఱ్ఱన గ్రంథ రచన యొక్క నిర్విఘ్న పరి సమాప్తి కొఱకిట్లు సూర్యుని స్తుతించినాడనియు నిది దేవతాస్తుతి పద్యమనియు భావింపవలెను.

## వస్తునిర్దేశము - నన్నయ స్తుతి:

దానాంభః పటలంబునం బృథుపయో ధారా వఁదాల్చి గ
ర్జా నిర్ఘోషము బృంహితచ్ఛలనఁబ్రచ్ఛాదించి ప్రావృట్ పయో
దా నీకంబు శరద్భయంబున నిగూఢాకారతన్ డిగ్గె నా
గా నొప్పారె మదోత్కట ద్విరద సంఘంబుల్ వనాంతంబునన్

—చతుర్థాశ్వాసము - 144.

ఇందు శరత్కాలము వలన భయపడిన మేఘములు పృథుపయోధారావలిని దానాంభః పటలమునను, గర్జా నిర్ఘోషమును బృంహితమునందును దాచుకొని యరణ్యములలో మదపుటేనుగులై సంచరించుచున్నవని యుత్ప్రేక్షింపబడినది. ఇది యెఱ్ఱన వర్ణనా వైభవమునకెత్తిన వైజయంతము వంటి పద్యమని విమర్శ కుల నిర్ణయము. ఆలంకారిక రచనా విధానమునకు నిదానమైనది. ఏనుగులకు, మేఘములకు పోలిక చెప్పుట క్రొత్త విషయముగాదు. కాని యిది హేతూత్ప్రేక్ష యగుట విశేషము. ఇక్కడ కేవలము శరదృతు వర్ణనమే కవికి ముఖ్యముగాదు. ప్రధాన కథాబీజమును ఇందు పాదుకొల్పి దానిని ధ్వనింపజేయుటయు నాతని కభి ప్రేతము. "వనాంతంబునన్ నిగూఢాకారతం డిగ్గెనాగా నొప్పారు మదోత్కట ద్విరద సంఘము" లెవ్వరో కాదు! పాండవులే యను వ్యంగ్యార్థ మిట స్ఫురిం చుచున్నది. శత్రువులకు భయపడిన రాజులు రాజ్యమును కోల్పోయి ప్రచ్ఛన్న వేషధారులై యడవుల పాలై తలదాచుకొనుట లోకమునందున్న విషయము. పాండవులు దుర్యోధనాదులకు భయపడి, లేదా సమయపాలనకు కట్టుబడి నిగూఢా కారులై యడవుల యందున్నారు. కావున నిచ్చట సూచనా మాత్రముగ వస్తు నిర్దేశమున్నట్లు భావింప వలయును. ఇక్కడొక సందేహము కలుగును. వారు "నిగూఢాకారతన్" వర్తింపవలసినది యజ్ఞాతవాసమున గాని యరణ్యవాసమున కాదుగదా! మఱి దీనికి సమన్వయమెట్లు కుదురును? అని. దానికి సమాధానమిది:

అరణ్యపర్వ శేషాంతమున యక్ష ప్రశ్నలున్నవి. అక్కడ యక్షుడు పాండవుల కొక వరమును ప్రసాదించును. ఆ వచనమిది :

"ఇదె పదమూడవ యేడు సనుదెంచె ! నింక మీకు నజ్ఞాత వాసంబు సలుపవలయు ! నందు మీరెవ్వరెక్కడ నేరూపంబునం జరియింపం గోరిన నయ్యై రూపంబులల వడియెదు ! నెట్టున్నను మిమ్ము నెవ్వరు నెఱుంగ కుండునట్లుగా వరం బిచ్చితి ! నింక నొండెయ్యది వలసిన నడుగు మనిన"

—సప్తమాశ్వాసము - 465

ఈ వచనమునకు సరిపడునట్లు మూలమున 27, 28, 29 సంఖ్యలు గల మూడు శ్లోకములున్నవి. వానినుండి మనకు కావలసిన శ్లోకమిది :

వర్షం త్రయోదశమిదం మత్ప్రసాదాత్ కురూద్వహాః
విరాటనగరే గూఢాః అవిజ్ఞాతా శ్చరిష్యథ ॥

వనపర్వము—అధ్యాయము - 314 : 28

ఇందలి "గూఢాః అవిజ్ఞాతాః" అన్న దానికి "ఎట్లున్నను మిమ్ము నెవ్వరు నెఱుంగకుండునట్లుగా" అని యెఱ్ఱనార్యుని యనువాదము. ఇక్కడ ఎఱ్ఱన చేసిన శిల్పమేమన, మూలమునందలి యీ "గూఢ" శబ్దమును తీసికొని పోయి "దానాంభః పటలంబునన్" అను పద్యములో "నిగూఢాకారతన్" అను విధముగ చిత్రిక పట్టి ప్రయోగించుట. అజ్ఞాతపర్వమనవలసిన విరాటపర్వ ప్రారంభమున తిక్కన చేసిన శిల్పమును కూడ నొకింత పరికింతము. ఆయన ఈ క్రింది పద్యమును వ్రాసెను :

మహిత సముజ్జ్వలాకృతులు మానధనుల్ జనమాన్యులంగనా
సహితముగాగ నేమిగతి సమ్యగుపాయ నిగూఢ వృత్తిమై
నహితుల కప్రభేద్యమగు నా పదమూడగు నేడు మత్పితా
మహులు చరించిరంతయుఁ గ్రమంబున నా కెఱుగంగఁ జెప్పుమా ?

—విరాటపర్వము—ఆ. 1 : 44.

దీనికి మూల శ్లోకము లివి :

> కథం విరాటనగరే మమ పూర్వపితామహాః
> అజ్ఞాత వాస ముషితా దుర్యోధన భయార్దితాః
> పతివ్రతా మహాభాగా సతతం ధర్మచారిణీ
> ద్రౌపదీ సా కథం బ్రహ్మన్నజ్ఞాతా దుఃఖితాఽ వసత్ ॥

ఈ రెండు శ్లోకములందును గల "అజ్ఞాత వాసముషితాః" "అజ్ఞాతాః" అను రెండింటికి కలిపి "నిగూఢ వృత్తిమై" అన్నది తిక్కనగారి యనువాదము. మూలమున లేని యీ ప్రయోగమును తిక్కన యెక్కడినుండి గ్రహించి యుండును? యక్షప్రశ్నలలోని వెనుకటి మూలశ్లోకమునందలి "గూఢ" శబ్దమును గ్రహించి "నిగూఢవృత్తిమై" అన్న విధముగ చిత్రిక పట్టి ప్రయోగించినట్లు భావింపవచ్చును ? ఎఱ్ఱన యిటు వ్యాసుని యొక్క 'గూఢ' శబ్దమును దృష్టియం దుంచుకొని దీనిననుసరించి యటు తిక్కన ప్రయోగించిన "నిగూఢ వృత్తిమై" యను దానిని కూడ దృష్టియందుచుంకొని. తిక్కన వలెవడిలో "నిగూఢాకారతన్" అను విధముగ ప్రయోగించినాడని భావింపవలసి యున్నది. అప్పుడు ఎఱ్ఱనార్యుని యీ "నిగూఢాకారతన్" అన్న ప్రయోగము యక్ష ప్రశ్నలలోని 'గూఢ' పదమునకు తాను చేసిన "ఎఱుంగకుండునట్లుగాన్" అను అనువాదమును దూసు కొనిపోయి, విరాటము నందలి తిక్కనగారి "నిగూఢ వృత్తిమై" యను దానిని తాకుచున్నది ! అనగా నెఱ్ఱన, నన్నయ నుండి తాను గ్రహించిన కథా సూత్ర మును తెగిపోకుండ, బిఱ్ఱు సడలకుండ, పదిలముగ పట్టుకొనిపోయి తిక్కన కందించి ఆతడు చెప్పిన "పూర్వపరార్థ యుక్తి సేయునట్టియెడల యత్నమించు కంతయైన వలవదు" అను మాటను సార్థకమొనరించుచున్నాడు !

ఇట్లు 'దానాంభః పటలంబునన్' అను పద్యమునందలి 'నిగూఢాకారతన్' అన్న ప్రయోగముద్వారా వస్తు నిర్దేశస్ఫోరకముగ నింతటి కథా శిల్పమును పెట్టినాడెఱ్ఱన ! కీ. శే. డాక్టర్ పాటిబండ మాధవశర్మగారు ఈ 'నిగూఢాకారతన్' అను ప్రయోగమును పరామర్శించుచు "స్వర్గమునుండి నన్నయ దిగివచ్చి యెఱ్ఱయ రూపమున గూఢముగా నరణ్య పర్వమున విహరించుచుండెనా యన్న మృదువైన ధ్వనియు నీ పద్యమున భావుక హృదయములను స్పృశించుచున్నది."

అను మధురోహను పుట్టించిరి. అట్లయిన నెట్టన యిచ్చట చాల పరోక్షముగ నన్నయను స్మరించుచున్నాడనియు, అప్పుడిది పూర్వ కవిస్తుతిని స్ఫురింపించు చున్నదనియు భావింపవచ్చును !

> కల నీలకంఠ కోలా
> హల లీలలు సెందె రాజహంస కులంబున్
> విలసించె సప్తపర్ణా
> వలి ! విగళిత కుసుమ కుటజ వాటికలడరెన్
>
> —చతుర్థాశ్వాసము : 145

వర్షర్తువు మయూరములకును, శరదృతువు రాజహంసలకును, జీవనానందసారమును ప్రసాదించునట్టివి. వర్ష శరత్తుగా రూపొందిన పరిణామ క్రమమును బట్టి మయూరముల కేకారవముల లీలలు రాజహంసలను చేరినవను భావము పరమ రమణీయమైనది !

**తిక్కనస్తుతి :**

> అతిగాంభీర్య విభూతి నేక చుళుకాహంకార నిశ్శేష శో
> షిత పాథోధి పయస్కుడైన మునిదోఁ బెం బుణ్య తేజోమయా
> కృతి నయ్యామ్య దిగంత వీధిఁ బ్రకట క్రీడాకళా గర్వ గ
> ర్జిత మండూక కళంకి తాంబు శుచితా సిద్ధి ప్రదాచార్యుడై
>
> —చతుర్థాశ్వాసము - 146

అద్భుత రసమునకు నిదానమైన పద్యమిది. ఏకచుళుకాహంకార నిశ్శేష శోషిత పాథోధి పయస్కుడు, అంబు శుచితా సిద్ధి ప్రదాచార్యుడు అన్నవి అగస్త్యమునికి తొలి మలి విశేషణములు. ఎత్తుగడలోనే తొలి విశేషణముతో నొక్కుమ్మడిగ నావహించిన యద్భుతము, మధ్యలో చక్రభ్రమణము చేసినట్లు చేసి, మలి విశేషణముతో ప్రశాంత పరిణామమును పొందుట గొప్ప రసశిల్పము. అతి గాంభీర్య విభూతియట ! శుచితా సిద్ధియట ! ఇట్టిదీ ఎఱ్ఱనగారి శబ్ద ప్రయోగ శిల్పము !

---

1. అరణ్యపర్వము పీఠిక : పుట- 56, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ.

మూలమున సూక్ష్మముగనున్న అగస్త్యోదయ ప్రసక్తినిట్లు పెంచి వ్రాయుటలోగల కవి యాంతర్యమిది కావచ్చును: అగస్త్యముని ఒక్క జుఱ్ఱులో సముద్ర జలమును త్రాగినట్లు తిక్కయజ్వ ఒక్క దెబ్బలో పదిహేను పర్వముల భారతమును జుఱ్ఱినాడనియు, అతడు దక్షిణదిగ్భాగమున నుదయించి యల్లరి కప్పల దూకుడుల చేత కలుషితమైన నదీ జలములను ప్రసన్నము చేసినట్లు ఈతడు కూడ దక్షిణ దిశలో నుద్భవించి వైదికధర్మ విరుద్ధ మార్గ వర్తనుల దూకుడుల చేత నస్త వ్యస్తమైపోయిన వైదిక మార్గ వర్తనమునకును, తదనుకూలమగు నాంధ్ర మార్గకవితా స్రవంతికిని శుచితా సిద్ధి ప్రదాచార్యుడైనాడనియు ధ్వనింప జేయుటకు! అప్పుడీ పద్యమున ఎఱ్ఱన్న తిక్కన్నను స్మరించినాడని స్ఫురింప గలదు!

విశద శారదాంబుద పరివేష్టనమునఁ
బొలుచు గగనంబు ప్రతిబింబమో యనంగ
వికచ కాశవనీ పరివేష్టనమున
నతిశయిల్లె నిర్మల కమలా కరములు

చతుర్థాశ్వాసము - 147

ఇందలంకారము ఉత్ప్రేక్ష. గగనమునకును, కమలాకరములకునుగల బింబ ప్రతిబింబ భావము కన్నులకు గట్టునట్లు నారెండింటికి విశేషణములుగ చెప్పబడిన "విశద శారదాంబుద పరివేష్టనమున" "వికచకాశవనీ పరివేష్టనమున" అన్న వాక్య ద్వయమునందు కూడ బింబ ప్రతిబింబ భావముట్టిపడునట్లున్న కట్టుబడి మహాకవి యొక్క రచనా శిల్పమునకు నిరూపకముగ నున్నది!

నన్నయ భట్టారకుడు "శారద రాత్రులు" అన్న పద్యమును ఏస్థాయిలో విడిచిపెట్టెనో, ఆ స్థాయిని, ఆ ధారను, చెక్కు చెదరనీయక, వన్నె తఱుగనీయక అట్లే యందిపుచ్చుకొని యీ యైదు పద్యములను పోతపోసినాడెఱ్ఱన. ఈ పద్యములందీతడు పలికించిన నాదము గాని, ఒలికించిన శబ్దసారము గాని, వెలార్చిన భావ రామణీయకతగాని, మెఱపించిన యలంకార సౌందర్యము గాని, చిప్పిలజేసిన రసపూరముగాని, స్ఫురింపించిన ధ్వని విశేషములుగాని వర్ణనాతీతములు! నన్నయ కథాకథన శైలికి, తిక్కన నాటకీయ శైలికి, ఎఱ్ఱన వర్ణనా

శైలికి ప్రవర్తకులని విమర్శకులు నిర్ణయించి పెట్టిరి. ఎఱ్ఱన తన వర్ణనా వైభవ విన్యాసములన్నీ ఈ తొలి ఘట్టమునందే అద్భుతముగ ప్రదర్శించినాడు!

## ప్రసన్న సరస్వతీకత్వము :

నన్నయ 'శారద రాత్రులు' అను పద్యమున శరదృతువునకు పర్యాయముగ ప్రయోగించిన 'శారద' శబ్దమును ఎఱ్ఱన పలుమాఱులు ప్రయోగించుట గమనార్హము. 'శారదవేళ' 'విశద శారదాంబుద పరివేష్టనమున' 'ఇట్టి శారదాగమనంబున' ఇత్యాది. ఇచ్చట వర్ణించునది శరదృతువునే యన్నట్లు కాన్పించినను "శారద" శబ్దస్ఫూర్తి చేత "శారదాదేవి" రూపమును కూడ రేఖామాత్రముగ గోచరింపజేయుట విశేషము! అనగా శారద వేళావర్ణన మొకవైపున, శారదా రూపస్ఫూర్తి మరియొక వైపున - ఇట్లీ రెండు భావధారలు సమాంతర రేఖలపై నడచి వచ్చుచునే యుండును. అట్లు వచ్చి వచ్చి యీ యైదు పద్యముల తరువాతి వచనమునందు వర్ణింపబడిన సరస్వతీ మహానదీ ధారలో పర్యవసించును. ఇది యెఱ్ఱనగారి తొలి వచనము. ఈ వచన రచనా సౌందర్య లహరితో మిళితమై ప్రవహించు సరస్వతీ నదీ సౌందర్యమును తిలకింపుడు :

"అట్టి శారదాగమనంబున నుత్ఫుల్ల కమల కల్హార కేసర కరాళ కలిత కల్లోల మాలినియు, ననేక మునిలోక సతత సంసేవ్యమాన విపుల పులినోత్సంగయు, నిరంతర తీరవానీర వన మండలీ విలసితయు, నాకాశ సంకాశ విశద సలిలయునైన సరస్వతీ మహానది ననుదిన స్నానపానాది విశేషంబులం బరితోషంబు నొందుచుఁ బాండు నందను లమ్మరుభూమిం గొన్ని దినంబులు వసియించి, తదనంతరంబు ధౌమ్యాది భూసుర వరులు, నింద్రసేనాది మూల భృత్యులుఁదోడ నరుగు దేరఁ గామ్యకవనంబునకు వచ్చి యచ్చటి మునులచేత నభినందితులై యందు సముచిత వర్తనంబుల నుండునంత నొక్కనాడు"

—చతుర్థాశ్వాసము : 148.

అట్లు పర్యవసించి, యంతటితో నాగదు. సరిగదా "సరస్వతీ గీత" కడకు పోవుసరికి మున్ను నదీరూపమున గోచరించిన సరస్వతి, యక్కడి "అంబనవాంబు జోజ్జ్వల కరాంబుజ" అన్న పద్యములో దేవీ రూపమున సాక్షాత్కరించును! ఆ రూపము "శారద చంద్ర చంద్రికాడంబర చారుమూర్తియై"

శారద శరదృతువుల సమన్వయాకృతిని దాల్చును ! ఇదీ నన్నయ నుండి యెఱ్ఱయను పొందిన "ప్రసన్న సరస్వతీ కత్వము"! సరస సారస్వతాంశ ప్రశస్తి ! అదిగో "సరస్వతీ గీత"లోని సరస్వతి !

అంబ నవాంబుజోజ్జ్వల కరాంబుజ! శారద చంద్ర చంద్రికా<br>
డంబర చారుమూర్తి! ప్రకట స్ఫుట భూషణ రత్న దీపికా<br>
చుంబిత దిగ్విభాగ! శ్రుతిసూక్త వివిక్త నిజ ప్రభావ! భా<br>
వాంబర వీథి విశ్రుత విహారి ననుం గృపఁజూడు భారతీ!



# జననాభిజన గృహ నామములు

ప్రజ్ఞాపవిత్రుఁ డాపస్తంబ సూత్రుండు
　　శ్రీవత్స గోత్రుఁ డూర్జిత చరిత్రుఁ
డగు బొల్లనకుఁ బోల మాంబకుఁ బుత్రుఁడు
　　వెలనాటి చోడని వలన మిగుల
మన్నన గన్న భీమన మంత్రి పౌత్రుండు
　　పేరమాంబా మనః ప్రియుఁడు పోత
మాంబికా విభు సూరనార్యు మజ్జనకుని
　　బొల్లధీ నిధికిని బోలనకును

అన్ననకు ననుజన్ముని గన్న తండ్రి
వేగి నాఁటఁ గరావర్తి వృత్తి మంతుఁ
డనఘుఁడెఱపోత సూరి కంసారి చరణ
కమల మధుకర పతి సార విమల యశుఁడు.

—నృసింహ పురాణము—అవతారిక-15.

ఇందలి "వెలనాటి చోడని వలన మిగుల మన్నన గన్న భీమన మంత్రి" అను వాక్యము వలన నెఱ్ఱన జనన కాలమును. "వేగినాట కరావర్తివృత్తి మంతుఁ డనఘుఁడెఱపోత సూరి" అన్న వాక్యము వలన నాతని పూర్వీకుల యభిజనమును నిర్ణయించుట పరిపాటి. మఱియు విప్రనారాయణ చరిత్రను రచించిన చెదలువాడ మల్లయ ఎఱ్ఱన్నను స్తుతించుచు "చెదల్వాడనిలయు నాదు వంశకర్త"[1] అని చెప్పిన దానిని బట్టి యాతని గృహ నామమును "చెదలు వాడ" అనియు నిర్ణయించుట జరుగుచున్నది కాని యాలోచించి చూడగా నీ మూడు విషయములను "వెలనాటి చోడని వలన మిగుల మన్నన గన్న భీమన మంత్రి" అన్న ఒక్క వాక్యము నుండియే సిద్ధించుచున్నవి.

1. విప్రనారాయణ చరిత్ర - ఆ - 1, పద్యము-12.

ఎఱ్ఱన జననము :

చందవోలు రాజధానిగ రాజ్యమేలిన వెలనాటి చోడు లిద్దఱుండిరి. వీరిలో కళోత్తుంగ రాజేంద్ర చోడయ యను నసలు పేరుతోను, ఇమ్మడి రాజేంద్ర చోడయ అను నామాంతరముతోను వర్ధిల్లిన యీ రెండవ చోడుడే మన కిక్కడ ప్రసక్త పురుషుడు. ఈతడు క్రీ. శ. 1162-1182 మధ్య కాలమున రాజ్యమును పాలించెనని కీ శే మల్లంపల్లి సోమశేఖర శర్మగారు పేర్కొనిరి.[1] ఈతని వలన భీమన 1170-1180 మధ్య కాలమున మంత్రిగా మన్నన గని ఉండునని కీ.శే. చాగంటి శేషయ్యగా రభిప్రాయపడిరి.[2] దీనిని మనము 1180గా గ్రహించుట లెస్స. మన్నన గన్న నాటికి నాతని వయస్సు నలువది సంవత్సరములు ఉండవచ్చుననుకొన్నచో నాతడు 1140 ప్రాంతమున జన్మించి 1200 వఱకు జీవించి యుండవచ్చును. అది మొదలు కొని అనగా 1140నుండి యతనికి నాల్గవ తరము వాడైన యెఱ్ఱన వఱకు, తరమున కిన్ని యేండ్ల చొప్పున లెక్క కట్టవలయును. సాధారణముగా తరమునకు ముప్పదియని, ముప్పది అయిదని, నలువదియని భిన్న ప్రమాణములను గైకొనుట పరిశోధకులకు పరిపాటిగ నున్నది. ఎఱ్ఱన వంశ క్రమ కాల నిర్ణయమున ముప్పది చొప్పున లెక్క కట్టినవారు చాల నరుదు. అధిక సంఖ్యాకులు దాదాపు సరిసమానముగ, కొందఱు ముప్పది అయిదనియు మఱికొందరు నలువదియనియు లెక్కకట్టి, యెఱ్ఱన జననమును నిర్ణయించి ఆయుః ప్రమాణమును సూచించిన విధము ఇట్లున్నది :

| | | |
|---|---|---|
| కందుకూరి వీరేశలింగంగారు | 1296 | కవుల చరిత్ర, భాగం-1 పుట : 170 |
| చాగంటి శేషయ్యగారు | 1280-1345 : 65 | ఆంధ్ర కవి తరంగిణి, 4వ భాగం, పుటలు : 57, 58. |
| వేలూరి శివరామశాస్త్రిగారు | 1275-1335 : 60 | హరివంశ పీఠిక: పుట-22. |

1. "చందవోలు రాజధానిగా నున్నప్పుడు"-వ్యాసం-భారతి. జులై, 1944
2. "ఆంధ్ర కవి తరంగిణి"-నాల్గవ సంపుటము - పుట : 57.

| | | |
|---|---|---|
| పింగళి లక్ష్మీకాంతంగారు | 1280-1360 : 80 | ఆంధ్ర సాహిత్య చరిత్ర, పుట-274. |
| పురిపండా అప్పలస్వామిగారు | 1280-1365 : 85 | హరివంశ పీఠిక; పుట-21, (సంక్షేప ప్రతి). |
| దివాకర్ల వేంకటావధానిగారు | 1280-1345 : 65 | నృసింహ పురాణము, పీఠిక-పుటలు : 5. 6. |
| పాటిబండ మాధవశర్మగారు | 1285-1360 : 75 తరువాత గూడా | అరణ్యపర్వ పీఠిక-పుటలు-45, 47 |
| శ్రీమతి పి. యశోదారెడ్డిగారు | 1280-85-1355 : 70, 75, | తెలుగులో హరివంశములు-పుటలు-127, 128. |
| ఆరుద్రగారు | 1280, పది పదిహేను సం॥లు అటోయిటో | సమగ్రాంధ్ర సాహిత్యం, మూడవ సంపుటము, పుట-185. |
| నోరి నరసింహశాస్త్రిగారు | పధ్నాలుగో శతాబ్ది మొదటి 75 సం॥లు | విజ్ఞాన సర్వస్వం, మూడవ సంపుటి : పుట-734. |

ఇక మరణము విషయములో భిన్నాభిప్రాయములుండుటకు స్వల్ప విషయములటుంచి ప్రధానముగ కాన్పించు కారణములివి : ఒకటి-ఎఱ్ఱన కృతుల యానుపూర్విని నిర్ణయించుటలో భేదాభిప్రాయములుండుట. హరివంశమే చివరి రచన యని కొందఱు భావించిరి. క్రీ. శ. 1335 లో వేయించిన చీమకుర్తి శాసనములో వేమారెడ్డి శ్రీశైల అహోబలములకు కట్టించిన సోపాన ప్రసంగము గలదు. ఇది హరివంశమున పేర్కొన బడలేదు కావున 1335కు పూర్వమే హరివంశ రచన మని భావించి యా పిమ్మట ఎఱ్ఱన జీవించి యుండడని వేలూరి శివరామశాస్త్రి ప్రభృతులు కొందఱు ఊహించిరి.[1] రెండు—ప్రోలయ వేమారెడ్డి జ్యేష్ఠ పుత్రుడు అనపోతారెడ్డి క్రీ శ. 1364లో వేయించిన కొల్లూరి దానశాసన మున పేర్కొన బడిన "యఱ్ఱయ ప్రగడగారు" మన శంభుదాసుడే యని

1. హరివంశ పీఠిక - పుట - 12, వావిళ్ళ ప్రచురణ : 1967.

కొందరు భావించి యాతని జీవిత కాలమును ఆ తరువాత కూడ పొడిగించిరి. వీరిలో కీ శే. నోరి నరసింహశాస్త్రిగారు ముఖ్యులు.[2]

ఈ మహనీయులెల్లరును వెలిబుచ్చిన యభిప్రాయములను క్షుణ్ణముగ పరిశీలించి, పూర్వాపరములను సమన్వయించి చూడగా తరమునకు నలుబది సంవత్సముల చొప్పున లెక్కగట్టి యెఱ్ఱన జననమును క్రీ.శ. 1300 అని తేల్చుట లెస్స. ఏలయన, భీమన మంత్రికి బొల్లన ఒక్కడే కొడుకని గాని, బొల్లనకు ఎఱపోతసూరి ఒక్కడే కుమారుడని గాని చెప్పవలను పడదు. వఱి కొందఱు కొడుకులే గాక కుమార్తెలు కూడ నుండవచ్చును. ఆ సంతతిలో ఈ ప్రసక్త పురుషులెన్నవ వారో చెప్పుటకు వీలుకాదు. ఎఱపోతసూరికి నల్గురు కొడుకులనియు, అందు తన తండ్రి సూరనార్యుడు నాల్గవవాడనియు నెఱ్ఱన చెప్పనే చెప్పినాడు. సూరనార్యునకు నెఱ్ఱనార్యుడు ఎన్నవ కొడుకో తెలియదు. ఒక వంశక్రమమును చెప్పవలసి వచ్చినప్పుడు అక్కఅపడు మేఱకు, సూటిగా తన 'కుదురు'కు చెందిన ప్రధాన పురుషులను మాత్రమే పేర్కొనుట పరిపాటి. ఎఱ్ఱన చేసినది కూడ నదియే. కావున తరమునకు నలుబది యేండ్లు చొప్పున లెక్కకట్టి ఎఱ్ఱన జననము క్రి. శ. 1300 అని తేల్చుట సమంజసము.

## ఎఱ్ఱన మరణము :

ఆయుః ప్రమాణ నిర్ణయము : ఎఱ్ఱన కృతుల యానుపూర్వికి సంబంధించిన చర్చ అంతవఱకే పరిమితమగును గాని, యది యాతని జీవిత కాలమును పొడిగించుటకు గాని, కుదించుటకు గాని యుపకరింపదు. హరివంశ మాతని చివరి కృతి యనుకొన్నను నందు సోపానముల ప్రసక్తి లేకపోవుట, విషయమును నిర్ణయింపజాలదు. దీనిని గూర్చి "అరణ్యపర్వ శేష రచనాకాలము" అను ఘట్టమున వివరింపబడును.

కొల్లూరు దాన శాసనమున పేర్కొనబడిన "యెఱ్ఱయ ప్రగడ గారు" మన శంభుదాసుడే యనుట నిక్కము. ఈతడు మన మహాకవి కాదన్న విమర్శకులెల్లరు దానికి తగిన యుపపత్తులు చూపించినట్లు కానరాదు. పైపెచ్చు మఱియు నాతడెవ్వరో తేల్చరైరి. కీ. శే. నిడుదవోలు వేంకటరావుగారు మాత్రము

2. విజ్ఞాన సర్వస్వము - మూడవ సంపుటము ; పుట-784.

మన శంభుదాసుని మనుమడు కావచ్చునని భావించిరి.[1] దానశాసన రచనా విధాన మును బట్టి యిది యంత సమంజసముగా తోచదు. రెడ్డి సంచిక 57వ పుటలో శ్రీ వడ్డాది అప్పారావుగా రిట్లూహించిరి :—

"అనపోతారెడ్డి కొల్లూరు శాసనములో ప్రతిగ్రహీతలలో యర్రయ ప్రగడగారు కనబడుచున్నారు. ఈ యెర్రయ ప్రగడగారు శంభుదాసుడేమో యని సందేహము కలుగుచున్నది.... అయినచో నెఱ్ఱాప్రెగ్గడ అప్పటికి వృద్ధుడై జీవించి యుండవలెను" ఈ యభిప్రాయము యుక్తియుక్తముగ నుండి పలువురు పరిశోధకులకు నచ్చినట్లు కాన్పించుచున్నది. కావున నెఱ్ఱనార్యుని జీవిత కాలము క్రీ. శ. 1300-1375 మధ్య కాలమనుట యుక్తము.

## ఎఱ్ఱన పూర్వికుల యభిజనము :

ఇప్పుడు నిర్ణయింపవలసిన రెండవ యంశము ఈతని యభిజనము. "వేగినాటకరావర్తి వృత్తిమంతు డనఘు డెఱ పోతసూరి" అన్న వాక్యమును బట్టి యీతని పూర్వికుల నివాస స్థానమును నిర్ణయించుట ఇప్పటి వఱకు పరిపాటి యైనది. 'కరావర్తి' యనునది 'కాకరపర్తి'కి బదులుగా లేఖకుడు పొఱపాటుగా వ్రాసినదని కీ.శే మల్లంపల్లి వారి యూహ.[2] కరావర్తికి బదులు కాకరపర్తి యని వ్రాసినను తేటగీతి పద్యమున గణభంగము గలుగదని ఆచార్య డాక్టర్ దివాకర్ల వారి యభిప్రాయము.[3] ఈ కాకరపర్తి గ్రామమున నెఱపోతసూరి వృత్తిమంతుడై, అనగా పన్నులు వసూలు చేయు నుద్యోగమందున్నవాడై జీవించెననియు, కాగా వీరి యభిజనము కాకరపర్తి యనియు, అధిక సంఖ్యాక పరిశోధకుల నిర్ణయము. కాని కీ. శే. వేదాల తిరువేంగళాచార్యులు గారు, వర్ణ సామీప్యము వలన నిది వంగవోలు సమీపమున గల అమ్మనబ్రోలునకు ప్రక్కనే యున్న కరవది గ్రామమనియు, దీని నిప్పటికిని కొందఱు కరావది

1. "ఎఱ్ఱాప్రెగడ హరివంశ రచనా కాలము" వ్యాసము 'పరిశోధన' ఫిబ్రవరి, మార్చి : 1956.
2. "రెడ్డిరాజ్య చరిత్ర" - పుట-496.
3. నృసింహ పురాణము-పీఠిక-పుట-1. ఆం.ప్ర. సాహిత్య అకాడమీ ప్రచురణ : 1967.

యని వాడుదురనియు, ఇంచుమించుగా పూర్వ మీ ప్రదేశమంతయు వేగినాటి లోనిదే కావచ్చుననియు, ఈ కరవదికి కొలది దూరము నుండియే పాకనాడు ప్రారంభమగుననియు, ఎఱపోతసూరి యిక్కడ నివసించి యుండుననియు, ఎఱ్ఱన నివసించిన చదలువాడ కూడ నీ గ్రామమునకు ప్రక్కనే యున్నదనియు నొక సమంజసమైన యభిప్రాయమును వెలిబుచ్చిరి.[1]

మఱికొందఱు అసలిది గ్రామనామము కాదనియు, కరము-పన్ను, కరావర్తివృత్తి-పన్నులను వసూలు చేయు నుద్యోగము అని యర్థము చెప్పి, యెఱపోతసూరి వేగినాటిలో నేదేని యొక గ్రామమున నీ వృత్తి గలిగియుండెనని భావించిరి. డా॥ శ్రీమతి పి. యశోదారెడ్డిగారు కరావర్తి వృత్తిమంతులనగా పన్నులను గ్రహించు నేటి గ్రామాధికారి లేక గ్రామ కరణము వంటి వృత్తి మంతులని గ్రహించుటయే సమంజసమై కాన్పించుచున్నది అని చెప్పిరి.[2] ఇట్లు కాకరపర్తి, కరవది, కరావర్తి వృత్తి యను మూడు వాదములు వెలువడినవి.

వీనిలో కాకరపర్తి వాదము బొత్తిగా సమ్మతము గాదు. ఎఱ్ఱన కాలమును నిర్ణయించు పట్టున "వెలనాటి చోడని వలన మిగుల మన్నన గన్న భీమన మంత్రి" అన్న మాటను ప్రమాణముగ గ్రహించి యతడు మొదలుకొని ఎఱ్ఱయ వఱకు తరములు లెక్క గట్టిన మనము వీరి పూర్వీకుల నివాస స్థానమును నిర్ణయించు సందర్భమున మాత్రము "ప్రథమాతిక్రమణే కారణాభావాత్" అన్న న్యాయమును పురస్కరించుకొని తొలుత తొలి పురుషుడగు భీమన మంత్రి నివాస స్థానమేదో నిర్ణయింపక, ఆతని మనుమడగు ఎఱపోతసూరి నివసించిన స్థానమును నిర్ణయించుటకు పూనుకొని, అదియే వీరి యభిజనమని నిర్ణయించుటకు ప్రయత్నించుట సమంజసము కానేరదు. తొలుత భీమన మంత్రి యభిజనమును నిర్ణయింపవలెను. వెలనాటి చోడని వలన మంత్రిగా మన్నన గన్నది మొదలు భీమన పదవీ నిర్వహణమున కనుకూలముగ చందవోలులోనే నివసించి యుండును గదా! ఆతని స్వగ్రామము ఆ చుట్టుపట్టుల గల వేదేని యొక గ్రామమై యుండును. చందవోలునకు కొలది మైళ్ళ దూరమున గల కొల్లూరు

---

1. ఆంధ్ర మహాభారతోపన్యాసములు - పుట-27. ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రచురణ : 1991.
2. "ఎఱ్ఱాప్రెగడ"-పుట-12.

గ్రామమునకు సమీపమున నున్న "చదలవాడ" గ్రామము కావచ్చునని నేను భావించుచున్నాను. ఇదియే వీరి యభిజనము!

వెలనాటి ప్రభువులలో చివరివాడు పృథ్వీశ్వర రాజేంద్రుడు. ఈతని కాలముననే యీ రాజ్యము గణపతి దేవుని కాకతీయ సామ్రాజ్యమున కలిసి పోయెను. ఈతడును క్రీ. శ. 1206లో పరమపదించెను భీమన మంత్రి క్రీ. శ. 1200 వఱకు జీవించి యుండునని పూర్వోక్తము. ఇట్లు వెలనాడు తన అస్తిత్వమును కోలుపోయిన దాక భీమన తన కొడుకు బొల్లనతో చందవోలు నందే సుఖముగా జీవించి యుండును ఎఱపోత సూరి నాటికి యా కుటుంబము నకు గడ్డు కాలము వచ్చియుండును. ఈతడు సకుటుంబముగ కరవదికి వలస పోయి యచ్చట వృత్తిమతుడై కాలము గడిపి యుండును. అంతియే గాని, ఏ విధముగ చూచినను, బొత్తిగా సంబంధము లేని కాకరపర్తిలో నివసించినా డనుట పొసగని మాట దీనికి మఱొక్క యుపపత్తిని పరికింతము. నృసింహ పురాణ అవతారికలో దివంగతుడైన తాత యెఱపోతసూరి ఎఱ్ఱనకు "భావంబున నావిర్భావము నొంది" తన కిష్టదైవమగు నహోబల నారసింహుని పైనొక కావ్య మును వ్రాయుమని కోరును. అహోబలము కరవదికి దగ్గఱగా నుండును. కాకరపర్తికి మిక్కిలి దూరముగా నుండును. "శ్రీ మదహోబలేశ నరసింహుడు నా ప్రియదైవతంబు, మత్స్వామి" మొదలయిన ఎఱపోతసూరి చెప్పిన మాటలను బట్టి కరవదిలో నుండి తఱచు స్వామి సన్నిధికి వెళ్ళివచ్చు భక్తుడు మాటాలాడు నవిగా నుండును గాని, ఎక్కడో సుదూరమందలి కాకరపర్తిలో నివసించు భక్తుడు మాటలాడినవిగా తోచవు. ప్రయాణ సౌకర్యములు లేని యానాటి పరిస్థితులను బట్టి యిట్లూహింపక తప్పదు. కాగా నెఱపోతసూరికి, కాకరపర్తికి సంబంధము లేదు. కరావర్తి కరవదియే. ఇది మధ్యలో వచ్చిన నివాస స్థానమే గాని పూర్వికుల యభిజనము మాత్రము వెలనాటిలోని కొల్లూరు కడనున్న చదలవాడయే.

## ఎఱ్ఱన గృహనామము :

ఇక నిప్పుడు తేల్చవలసిన మూడవ యంశము ఎఱ్ఱన గృహనామము. విప్రనారాయణ చరిత్రలో చదలవాడ మల్లయ్య యెఱ్ఱనను "చదలువాడ నిలయు నొదుతంశకర్త" అని స్తుతించుటను బట్టి యీతని గృహనామమును చదలవాడగా

విమర్శకులు నిర్ణయించిరి. తన రచనా వ్యాసంగమంతయు ముగించిన పిమ్మట, వృద్ధాప్యమున నెఱ్ఱన యొక చదలవాడలో నివసించెను. ఇది మల్లారెడ్డి రామాలయమును కట్టించి తనచేత తొలికృతియగు రామాయణమును వ్రాయించి, వేమారెడ్డి కంకితమిప్పించిన నాటినుండియు తనకు సంబంధముగల పాకనాటిలోని చదలవాడయా లేక వెలనాటిలో కొల్లూరు కడనున్న తన పూర్వికుల యభిజనమగు చదలవాడయా! ఈ రెండింటిలో మల్లయ మనస్సులో నున్నదేది: అన్న విచికిత్స పుట్టుట కవకాశమున్నది. మన విమర్శకుల దృష్టిలో మొదటినుండియు వెలనాడులోని చదలవాడ లేదు. వారికి పాకనాటిలో నున్న చదల్వాడయే చదలవాడ. కావున మల్లయ చెప్పినదిదియే యని భావించి తదనుగుణముగ నప్పటి నుండియే యీతని యింటిపేరు చదలవాడయైనదని యూహించిరి. అట్లయినసంతకు పూర్వమింటిపే రేదై యుండును? పూర్వికుల యభిజనమగు చదలవాడను బట్టి, పూర్వము కూడ చదలవాడయే యనియు నిది మధ్య వచ్చినది గాదనియు నా యభిప్రాయము. ఎఱ్ఱన చివరికి చేరుకొన్నది కూడ వెలనాటిలోని చదలవాడయే యనియు నూహింపవచ్చును. దీనికి ప్రధాన కారణములు రెండున్నవి :

ఒకటి : క్రీ. శ. 1340 నాటి మంచాళ్ళ శాసనమునుబట్టి వేమారెడ్డి రాజధాని అద్దంకి నుండి కొండవీడుకు మాఱినట్లు తెలియుచున్నది. కొండవీడుకు కొల్లూరు చదలవాడ గ్రామములు కొంత సమీపముగా నుండుట గమనింపవలెను. రాజధాని మాఱగనే వేముని యాశ్రితుడైన యెఱ్ఱయకు తిరిగి యీ ప్రాంతముతో సంబంధము కలిగి యుండవచ్చును.

రెండు : కొల్లూరు దాన శాసనము - ఇందు పేర్కొనబడిన "యఱ్ఱయ ప్రగడగారు" మన శంభుదాసుడే యని యనుకొంటిమి. వృద్ధాప్యమున కొల్లూరు కడ నున్న యభిజన స్థానముపై యభిమానముతో కొల్లూరు నందీతడు భూములు సంపాదించుకొని యుండును.

కీ. శే. నోరి నరసింహశాస్త్రి గారు చెప్పిన వాక్యము లిప్పట్టున గ్రాహ్యములు : "గుడ్లూరు తరువాత ఆతడు తన మిత్రుడగు మల్లారెడ్డితో, ఆతడుగాని అతని తరువాతి వారు గాని ఒంగోలు తాలూకాలోని చదలవాడకో, తాను భూములు సంపాదించిన తెనాలి తాలూకా కొల్లూరు గ్రామము వద్దనున్న మరియొక

చదలవాడకో కాపురమునకు వెళ్ళుటచేత అతని సంతతి వారికి చదలవాడ వారని యింటి పేరు వచ్చి యుండును."

—విజ్ఞాన సర్వస్వము, 3 వ సంపుటము, పుట : 733.

ఈ వాక్యములే యీ వ్యాసమున ప్రతిపాదింపబడిన మూడు ముఖ్యాంశముల నిర్ణయమునకు నూతగా గ్రహింపబడినవి, ఎఱ్ఱన జీవితములో విడదీయుటకు వీలుగాని కొన్ని విచిత్రాంశములున్నవి. వానిలోనిట్లు రెండు చదలవాడ లుండుట యొక విచిత్రము !

సారాంశమేమన-ఎఱ్ఱన కాలము క్రీ.శ. 1300 నుండి 1375 వఱకు. పూర్వీకుల అభిజన స్థానము వెలనాడులోని చదలవాడ ! దీనినిబట్టి యాది నుండియు నీతని గృహనామము చదలవాడయే !



# అరణ్యపర్వశేష రచనా కాలము

రామాయణము, అరణ్యపర్వశేషము, నృసింహపురాణము, హరివంశము. ఇవీ యెఱ్ఱనార్యుని కృతుల యానుపూర్వి. నృసింహ పురాణములోని యీ పద్య మీ క్రమమునే సూచించుచున్నది.

## ఎఱ్ఱనకృతుల యానుపూర్వి :

ఉన్నత సంస్కృతాది చతురోక్తి పథంబుల కావ్య కర్తవై
యెన్నికమై ప్రబంధ పరమేశుడనంగ నరణ్య పర్వ శే
షోన్నయ మంధ్ర భాష సుజనోత్సవ మొప్పగ నిర్వహించి తా
నన్నయ భట్ట తిక్క కవినాథుల కెక్కిన భక్తి పెంపునన్

—ప్రథమాశ్వాసము - పద్యము : 17.

ఇందలి "ఉన్నత...................కావ్యకర్తవై" అన్నమాట తొలి కృతి యగు రామాయణమును సూచించుచున్నది. తక్కిన పద్యము రెండవదగు అరణ్య పర్వశేష పూరణమును తెలియజేయుచున్నది. ఈ సందర్భమున చెప్పిన తరువాతి పద్యములలో మూడవదగు నృసింహ పురాణమును వ్రాయుమని తాత యెఱపోతసూరి యెఱ్ఱనను కోరుచున్నాడు. దీనిని బట్టి యిప్పటి కింకను హరి వంశ రచన జరుగలేదనుట స్పష్టము. జరిగియుండినచో నెఱపోత సూరి తప్పక నా విషయమును కంఠోక్తిగా పేర్కొని యుండెడివాడు, ఎఱ్ఱన కృతులలో హరివంశమే చివరి దన్న విషయము ఎఱ్ఱనకు సన్నిహితోత్తర కాలమువాడైన జక్కన తన విక్రమార్క చరిత్రలో చెప్పిన ఈ క్రింది పద్యమువలన కూడ స్పష్టపడుచున్నది :

"ఈత్రయిఁ బ్రబంధ పరమేశ్వరుడై విరచించె శబ్దవై
చిత్రి నరణ్య పర్వమున శేషము శ్రీ నరసింహ రామ చా
రిత్రములన్ బుధ వ్రత గరిష్ఠత నెఱ్ఱయ శంభుదాసుఁడా
చిత్ర కవిత్వ వాగ్విభవ జృంభితుఁగొల్చెద భక్తి యుక్తితోన్॥

ఆశ్వాసము - 1-14

ఇందు హరివంశమును పేర్కొనలేదు. కావున నప్పటి కింకనూ ఎఱ్ఱన హరివంశము వ్రాసి యుండడని కీ. శే. చాగంటి శేషయ్యగా రభిప్రాయపడిరి.[1] ఇది వాస్తవము. ఈ పద్యము హరివంశము చివరి కృతియని నిర్ణయించుటకు మాత్రమే ఉపకరించునుగాని తక్కిన కృతుల రచనాక్రమము కూడ నిదియే యని నిర్ధారించుటకు మాత్రము కాదని గ్రహింపవలెను. ఏలయన, అరణ్యపర్వ శేష రచనవల్లనే యెఱ్ఱన కవిత్రయములో నొకడైనాడు. 'కవిత్రయము' అన్న వ్యవస్థకు నామకరణము చేసిన మొదటికవి జక్కనయే. 'ఈత్రయి' అని మొదలుపెట్టిన యీ పద్యమతోనే చేసినాడు. కావున సందర్భమునకు తగినట్లు ప్రాధాన్య వివక్షచేత నరణ్యపర్వ శేషమును తొలుత పేర్కొనవలసి వచ్చినది. తరువాతి కృతి నృసింహ పురాణమనుట నిక్కమే గదా! ఈ రెండును ఒక జంట. ఈ జంటను వ్రాసినప్పుడు గూడ నెఱ్ఱన వేమారెడ్డి యాస్థానములోనే యున్నాడు. అయినను దీనికి వేమారెడ్డితో సంబంధములేదు. దీనికి ముందుగా వ్రాసిన, తొలి కృతియగు రామాయణము, ఉట్టచివరికి వ్రాసిన హరివంశము వెమారెడ్డి కంకితములు. కావున నీ రెండును మఱియొక జంటగా పరిగణింప బడుట సహజము. ఇందులో నిప్పటికి వ్రాయబడిన దొక్క రామాయణమే. దానిని మాత్రమే చెప్పినాడు జక్కన.

జక్కన తరువాత నీ విషయమును నిర్ణయించుటలో ప్రామాణికముగ గ్రహింపదగిన మఱియొక వ్యక్తి చదలవాడ మల్లయ. ఎఱ్ఱన్నకు చిన మనుమ డనని చెప్పికొన్న నీతడు తన విప్రనారాయణ చరిత్రలో వ్రాసిన క్రమమిది :

"ప్రతిభతో నారణ్య పర్వ శేషముఁజెప్పెఁ
 గవులకుఁజెవుల పండువులు గాగ
వల్మీక భవు పచో వైఖరి రామాయ
 ణంబు నాంధ్ర ప్రబంధంబుఁజేసె
నొరసింహుని పురాణ మొనర్చె హరిమెచ్చ
 నన్నున్నె నెన్నడు చూచినాడవనగ
ప్రౌఢిమై హరివంశ భాగముల్ రెండును
 రచియించె సభలందుఁబ్రాజ్ఞులెన్న"

1. ఆంధ్రకవి తరంగిణి-నాల్గవ సంపుటము : పుట-216.

ఇందులో మొదటి పాదము రెండవ పాదముగను, రెండవది మొదటిది గను నుండియుండునని తోచుచున్నది. అప్పుడు కృతుల రచనాక్రమము సరి పోవును. ఈ చెప్పిన క్రమమే సరియైనదనుకొన్నచో మల్లియనాటికి 'కవిత్రయ' నామము క్షుణ్ణమై ప్రచారమునకు వచ్చినది. అరణ్యపర్వ శేష పూరణమువల్ల ఎఱ్ఱయకు దక్కిన కీర్తి సర్వోత్కర్షలతో వర్ధిల్లుచు స్థిరపడినది. ఈతడు కూడ ప్రాధాన్య వివక్షచేత తొలుత నారణ్యపర్వ శేషమును, పిమ్మట రామాయణమును పేర్కొనినాడని భావింపవలయును.

హరివంశము నందలి యీ క్రింది రెండు పద్యములు కూడ నిదే క్రమమును సూచించుచున్నవి. వేమారెడ్డి యెఱ్ఱన్నతో పలుకు మాటలివి :—

"నా తమ్ముండు ఘనుండు మల్ల రథినీ నాథుండు నిన్నాతత
శ్రీ తోడన్ సముపేతు జేసి యెలమింజేపట్టి మాకిచ్చుటన్
చేతో మోదమెలర్ప రామకథ మున్ జెప్పించి యత్యుత్తమ
ఖ్యాతింబొందితి మింక నేను దనియన్ గావ్యామృతా స్వాదనన్"

"భారత పరాంశమని యిం
పారగఁజెప్పుదురు బుధులు హరివంశము నీ
వా రమ్య కథ దెనుంగున
ధీరోత్తమ ! నిర్వహించి తెలుపుము మాకున్" అ.1-40

మొదటి పద్యమునందలి 'మున్' అన్న మాట మిక్కిలి కీలకమైనది. ఇది నిన్న మొన్న జరిగిన, సన్నిహిత పూర్వ భూతకాలమును గాక, ఏనాడో జరిగిన సుదూరపూర్వ పూర్వ భూతకాలమును సూచించుచున్నది. అనగా, వేమారెడ్డి యెఱ్ఱనతో నిన్నమొన్న జరిగిన విషయమునుగూర్చి గాక, ఎన్నడో జరిగిపోయిన పాత కథను త్రవ్వుచు మాటలాడుచున్నాడనుట. రామాయణమునకు వెంటనే హరి వంశమైనచో నీపద్య మిట్లుండదు. మధ్యలో రెండు మహా ప్రబంధముల రచనకు పట్టిన కాలమువలన తొలికృతియగు రామాయణ విషయము పాతబడినది. ఇంత కాలమున కా సంగతిని మఱల కదుపుచున్నాడు. ఈ'మున్' అన్నమాటయే గాక, పద్య రచనా విధానమంతయు నీ విషయమునే సూచించుచున్నదని సులభముగా గ్రహింపవచ్చును.

రెండవ పద్యమునందలి "భారత పరాంశము" అన్న మాట కూడ నావరుసలో మిక్కిలి యర్థవంతమైనది. అరణ్యపర్వ శేషమును పూరించి భారత రచనను పూర్తి చేసితివి. ఇక నిప్పుడు భారత పరాంశమగు హరివంశమును కూడ వ్రాయుము! అని సూచించు వాక్యమిది. పూరణము పూర్తియైన పిమ్మట, నృసింహ రచనము కూడ జరిగిపోయిన పిదప, నొకానొక వేళా విశేషమున నతి సహజముగ వేమారెడ్డికి తట్టిన యాలోచనమిది!

రచనా క్రమమున రామాయణ హరివంశములు వెంటవెంటనే వ్రాయబడిన తొలి జంటయనియు, అరణ్య నృసింహములు మలి జంటయనియు భావించిన పలువురిలో నొకరగు కీ. శే. డాక్టర్ పాటిబండ మాధవశర్మగారు లొకచోనిట్లు చెప్పిరి: "హరి వంశమునకు పూర్వమే అరణ్యపర్వ శేషము వ్రాయబడి యుండినచో ప్రోలయ వేమారెడ్డి - "భారత పరాంశమన...... నిర్వహించి తెలుపుము మాకున్" అని హరివంశ రచనకు ప్రోత్సహించునపుడు అరణ్యపర్వ శేషమును పూరించినట్లే యీ చివరి భాగమును గూడ నీవే పూరింపుమని చెప్పి యుండవలసినది. అరణ్యపర్వ శేష రచనా ప్రసంగమునకు ఇది సరియైన యదను. ఇచ్చట అది లేదు"[1] అని. కాని పూర్వోక్తానుసారముగ "భారత పరాంశము" అన్న పద్యమే, అందునను ఈ ఒక్క వాక్యమే యీ సర్వ విషయమును గతార్థము చేయుచున్నదని భావించుట సమంజసము!

ఎఱ్ఱన రామాయణారణ్య పర్వ శేషములను వరుసగా వ్రాయుటలో నొక చక్కని హేతువు నూహింపవచ్చును. నన్నయ భారత రచనకు పూర్వము "రాఘవాభ్యుదయము" అను గ్రంథమును రచించినట్లు ప్రతీతి గలదు.[2] తిక్కన నిర్వచనమునకు పిమ్మట భారతమును వ్రాయుట జగద్విదితము. ఆ వరుసలో నెఱ్ఱన కూడ తొలుత రామాయణమును రచించి, పిమ్మట నరణ్యపర్వ శేషమును వ్రాయుటకు కుతూహలపడి యుండును. మనసులోనిట్టి కుతూహలము తహతహలాడుచుండ, శేషమును వదలి హరివంశమును వ్రాసినాడనుట పొసగని మాట!

---

1. అరణ్యపర్వము - పీఠిక, పుట : 48 ఆం.ప్ర. సాహిత్య అకాడమీ ప్రచురణ.
2. ఆంధ్ర మహాభారతము, సంశోధిత ముద్రణము - అరణ్యపర్వము - పీఠిక, పుట : 5, ఉస్మానియా విశ్వవిద్యాలయ ప్రచురణ 1969.

చివరికి వేమారెడ్డి కోరనందాక నట్టియాలోచనయే వచ్చి యుండదు. కొందఱు అరణ్యపర్వ శేష పూరణమే మొదటిదని భావించిరి. కాని రెండు వందల సంవత్సరములు ఎవరు గాని ముట్టుటకు సాహసింపనిది, తిక్కన కూడ జంకినట్టిది యగు దీనిని యెఱ్ఱన తొలుతనే వ్రాసినాడనుట భ్రాంతి మూలకము!

రామాయణము, అరణ్యపర్వ శేషము, నృసింహ పురాణము, హరివంశము ఇదీ యెఱ్ఱనార్యుని కృతుల రచనాక్రమము.

## ఎఱ్ఱనకృతుల రచనాకాలము :

రామాయణ రచనా కాలము :- మల్లారెడ్డి క్రీ. శ. 1325 - 30 ప్రాంతమున చెదలవాడలో రామాలయమును నిర్మించెను. ఆ సందర్భమున దీనిని వ్రాయించి యన్న వేమారెడ్డి కంకిత మిప్పించెను. అప్పటికి నెఱ్ఱన వయసు కూడ నంతే యుండును.

అరణ్యపర్వ శేష రచనా కాలము :- 1330 - 35 మధ్యకాలము. స్వయం ప్రేరణతోనే వ్రాయుటకు తలపడి, వేమారెడ్డి యెఱుకతోనే, యాతని యనుమతితోనే రాజరాజాంకితము చేసి యుండును.

నృసింహ పురాణ రచనా కాలము - 1335-40 మధ్య కాలము. సరిగా 1335 నాటి చీమకుర్తి శాసనమున వేమారెడ్డి "శ్రీ పర్వత అహోబల నిర్మిత సోపాన" అని సంబోధింపబడినాడు. ఇదే సమయమున అహోబల నారసింహుని భక్తుడగు తాత యెఱపోతసూరి యీ ప్రబంధమును వ్రాయుమని కోరినాడు. ఇట్లీ మువ్వురి యందు నిట్టి విచిత్రమగు తాత్త్వికమగు నంతసూత్రత గోచరించుట విశేషము. ఈ గ్రంథ రచనతో వేమారెడ్డికి సంబంధము లేదనుటెట్లు?

హరివంశ రచనా కాలము :- 1340-1345. 1340 లో వేముని రాజధాని యద్దంకి నుండి కొండవీడుకు మాఱుచున్న దశలో ప్రారంభింపబడి 45 లోపల, మల్లారెడ్డి మరణమునకు ముందు ముగింపబడి యుండును. ఎఱ్ఱన యీ గ్రంథమున వేమారెడ్డి ఘనకార్యములను వర్ణించిన పద్యములలో 1335నాటి చీమకుర్తి శాసనము నందలి అహోబలమునకు నిర్మించిన సోపాన ప్రసంగము లేకపోవుట వలన నిది 1335 పూర్వమే రచింపబడియుండునని కొందఱందురు. కాని వేముని ఘన కార్యములను వర్ణించిన నొక పద్యములో "కామరాళ

చెఱువులు గుళ్ళు ప్రతిష్ఠించి లోక సంభావ్యములుగ నొనర్చె" అని వ్రాయబడినది 1 ఇందలి "గుళ్ళు ప్రతిష్ఠించి" అన్న మాటతో నీ సోపాన ప్రసంగము గతార్థమగుచున్నది. పూర్వోక్త ప్రకారము నృసింహ పురాణ రచనతోనే ఇది గతార్థమగును గదా !

## క్షత్రియ మాహాత్మ్య కథన ప్రసంగమున వేమారెడ్డి స్ఫురణ :

ఎఱ్ఱన పూరించిన యరణ్యపర్వ శేషము కొన్ని ప్రత్యేక పరిస్థితుల కారణమున నన్నయ ప్రణీతముగ రాజరాజాంకితమైపోయినది. ఏ విధముగ చూచినను, ఏ ఘట్టమునందు గాని యిక్కడ వేమారెడ్డి నీడ సైతము పడుటకు బొత్తిగా వీలులేదు. అట్లయ్యును, ఇందలి చతుర్థాశ్వాసమున, అత్రి గౌతముల పరస్పర సంవాద ఘట్టమున, క్షత్రియ మహాత్మ్య కథన ప్రసంగమున అత్రి వైన్యుని వర్ణించు సందర్భమున వ్రాయబడిన అమూలకాభాసముగ నున్న పద్యములందును, పాదములందును వేమారెడ్డి నీడలు కాన్పించుచున్నవా యన్న కుతూహలము రేకెత్తుచున్నది. వేముని యొక్క ఉదాత్తమైన క్షాత్ర ధర్మమును కన్నులార గాంచిన యెఱ్ఱన అప్రయత్నముగ నట్టి భావుకతకు లోనై యుండుననియే స్ఫురించుచున్నది !

1. అత్రివైన్యుని స్తుతించిన మొదటి మూల శ్లోకమిది !

    రాజన్ ధన్యస్త్వమీశశ్చ భువి త్వం ప్రథమో నృపః
    స్తువంతి త్వాం మునిగణాః త్వదన్యో నాస్తి ధర్మవిత్॥

వనపర్వము - అధ్యాయము 185-శ్లో. 13

అనువాదము :

నీవ విధాత వింద్రుడవు నీవ ! సమస్త జనేశ్వరుండవున్
నీవ ! యశేష ధర్మములు నీవ యెఱుంగుదు ! నిన్నుఁబోలఁగా
నీ వసుధా తలంబున మహీశ్వరు లెవ్వరు లేరు ! సన్మునీం
ద్రావలి యెప్డు నిన్నుఁగొనియాడుఁ బరిస్ఫుట వాక్యభంగులన్ ॥

చతుర్థాశ్వాసము : 196

---

1. హరివంశము—అవతారిక—పద్యము : 19.

ఇందు 'నీవ విధాత వింద్రుడవునీవ' అన్న మాటలు అమూలకములు. వేఱొక శ్లోకము నుండి కొన్ని రాబడినవి. తక్కిన పద్యమంతయు మూలమునకు వివరణ ప్రాయము.

2. ఇట్లు వైన్యుని స్తుతించుచున్న అత్రిని గౌతముడు, మానవుని యిట్లు కీర్తించుట తగదని మందలించును. దానికి రుష్టుడై అత్రి చెప్పిన సమాధానము : మూలము :

అయమేవ విధాతా హి యథైవేంద్రః ప్రజాపతిః
త్వమేవ ముహ్యసే మోహా న్న ప్రజ్ఞానం తవాస్తి హ॥

వనపర్వము—అధ్యాయము—185 - శ్లో : 16.

అనువాదము

ఊరక మీరనాడెదవు ! యుక్తమయుక్తము నాత్మఁజూడగా
నేరవు ! సర్వలోకముల నిర్మల నీతి పరాక్రమంబు లో
ప్పారగ నీతి ధర్మముల కన్నిటికిం గురుడై వెలుంగు ధా
త్రీ రమణుండు ! మేటిగ నుతించుట వోఁడె నాకు నిమ్మెయిన్ ॥

చతుర్థాశ్వాసము - 199.

మూలమునందలి మొదటి పాదము అనువాదమున ప్రసక్తము కాలేదు. వెనుకటి పద్యమునకు కొనిపోబడినది. రెండవ పాదము అనువాదమున మొదటి పాదమైనది ఇక, అనువాదమునందలి తక్కిన మూడు పాదములు అమూలకములే.

3. అత్రి గౌతములు వాదులాడుకొని తీర్పునకై మధ్యవర్తిగ సనత్కుమారుని ఆశ్రయించిరి. అతడు క్షత్రియ మాహాత్మ్యమును వర్ణించి చెప్పిన ఒక శ్లోకమిది :

మూలము :

రాజావై ప్రథితో ధర్మః ప్రజానాం పతిరేవచ
స ఏవ శక్రః శుక్రశ్చ స ధాతాచ బృహస్పతిః ॥

వనపర్వము—అధ్యాయము - 185 - శ్లో : 26.

అనువాదము :

అత్రి నిజంబ పల్కెఁదగునాతని వాక్యము ధర్మయుక్తః మీ
ధాత్రి సమస్తమున్ బృహదదగ్ర భుజాగ్రమునందుఁదాల్చు స
త్క్షత్రియు డెల్లవారలను గావను బ్రోవ ప్రభుండు గావునన్
శత్రునిషూదనుండతడు శక్రుడు నీశ్వరుడున్ విధాతయున్

చతుర్థాశ్వాసము - 203.

మూలమునందలి మొదటిపాదము అనువాదమున మూడు పాదము లైనది. రెండవపాదము దాదాపు యథాతథముగ నాల్గవ పాదమైనది.

4. మూలము :

ప్రజాపతి ర్విరాట్ సమ్రాట్ క్షత్రియో భూపతి ర్నృపః
య ఏభి స్తూయతే శబ్దైః కస్తం నార్చితుమర్హతి

వనపర్వము - అధ్యాయము - 185 - శ్లో : 27.

అనువాదము :

జనులకు నెల్లను పూజ్యుడు
జనపాలుండతని మహిత శాసనమున స
జ్జనులును మునులును సద్విధిఁ
జనువారలు గాని కడవఁజన దెవ్వరికిన్ —చతుర్థాశ్వాసము-204.

మూలమునందలి "కస్తం నార్చితు మర్హతి" అన్న ఒక్కమాట మాత్రము "జనులకు నెల్లను బూజ్యుడు జనపాలుడు" అని యనువదింపబడినది. తక్కిన పద్యమంతయు నమూలకమే. ఇక మూలమునందలి తక్కిన భాగమంతయు నను వాదమున విడువడి, 205 సంఖ్యగల వచనమునకు తరలింపబడినది.

ఈ అత్రి గౌతమము సంవాద ఘట్టము చాల చిన్నది. ఇందెన్నియో మార్పులుచేసినాడెఱ్ఱన. కొద్దియో గొప్పయో వేమారెడ్డి వ్యక్తిత్వమును ప్రతిబిం బింపజేయుటకే చేసినట్లు తోచుచున్నది !

ఈ విషయమును నిరూపించుటకు మఱియొక ప్రబలమైన యుపపత్తి లభించుచున్నది. కలియుగ ధర్మముల ఘట్టమున నీ క్రింది పద్యము వ్రాసినా డెఱ్ఱన :

వివిధ వ్యాఘ్ర మృగోరగాకులములై విస్తీర్ణ శూన్యాటవీ
నివహా భీలములై యరాజకములై నిర్మూల ధర్మంబులై
ద్రవిళాభీర తురుష్క బర్బర పుళిందవ్యాప్తి దుష్టంబులై
భువిలో నెల్లెడఁ బాడగున్ జనపదంబుల్ దద్యుగాంతంబునన్.

—చతుర్థాశ్వాసము 290

ఇందలి 'తురుష్క' శబ్దమమూలకము. ఈ ఒక్క మాటతో రెడ్డి రాజ్య స్థాపనకు పూర్వము, తురుష్క దండయాత్రల వలన, తెలుగు నేలపై జరిగిన భీభత్సము! దాని నెదుర్కొనుటకు తెలుగు నాయకులు చేసిన విప్లవ యజ్ఞము! ముసునూరి ప్రోలయ నాయకుడును, కాపయనాయకుడును, వారికి అండగ నిలబడి వేమారెడ్డియు వహించిన పాత్ర, రెడ్డి రాజ్యస్థాపన (1323) మొదలగు చరిత్రను కండ్లకు కట్టించి నాడెఱ్ఱన. ఇది వీస శాసన విషయము నద్దము పట్టుచు వేమా రెడ్డిని స్మరణకు తెచ్చుచున్న ప్రయోగమని కచ్చితముగ భావింపవచ్చును. అరణ్యపర్వ శేషము నందున్నట్లే హరివంశమున కూడ కలియుగ ధర్మము లున్నవి. (ఉత్తర భాగము-ఆ. 9) కాని ఈ 'తురుష్క' శబ్దమువంటి యమూల కము లక్కడ కానరావు. కారణము హరివంశము నేరుగా వేమారెడ్డి కంకిత మైనది. దాని అవతారిక యందు వేముడు విపులముగా వర్ణింపబడినాడు. అట్టి యమూలకము లచట అనవసరము. అరణ్యపర్వ శేషమట్లుగాదు! కావున 'తురుష్క' శబ్దము ప్రయోగింపబడినది!

కలియుగమున విష్ణువు కల్కిరూపమున శంబళ గ్రామమున ధర్మమును ప్రతిష్ఠించిన ప్రకరణము పఠించునప్పుడు వేమారెడ్డి సోదరులు అద్దంకి రాజ ధానిగ తెలుగు దేశమున ధర్మసంస్థాపనకు చేసిన ప్రయత్నములు స్ఫురింపక పోవు. వాస్తవమునకిచ్చట ఎఱ్ఱన విజృంభించి కొన్ని యమూలకములు జొప్పింప వచ్చును. కాని, యేలనో మిక్కిలి సంయమనముతో యథామూలముగ సమ తూకముతో నిర్వహించినట్లు కాన్పించును. ఒక్కచోట మాత్రము ఒడలుపొంగు నట్లుగ మధ్యాక్క అను వ్రాసినాడు. ఎఱ్ఱన వ్రాసిన మధ్యాక్కఱ యిదొక్కటే యగుట విశేషము! ఈ జయస్తంభము నిక్కడే యెందుకు నాటినట్లు? మన ప్రతిపాదితాంశమును స్ఫురింప జేయుటకే కావచ్చును! ఆ పద్యమిది:

అసదృశతేజుఁడు బ్రాహ్మణానీక సహితుఁడై కడగి
వసుమతి యందు నధర్మవర్తులై యున్న మ్లేచ్ఛులను
మసలక నిజశక్తిఁజేసి మడియించి ధర్మంబు నిలిపి
వసునిభుం డొనరించుఁ జేస్మి వాజి మేధము నిష్ఠయొప్ప॥

చతుర్థాశ్వాసము - ౩౧౦

దీనికి ప్రతిబింబమో యన్నట్లున్న హరివంశములోని తృతీయాశ్వాసాంత మందలి యీ పద్యమున ఎఱ్ఱన వేమారెడ్డిని వర్ణించిన తీరును గమనింపుడు :

సుజన భజన దుష్టస్తోమ నిర్మగ్న కామా
త్యజన చతుర వృత్తిస్థాప నోద్దీపితార్థా
యజన ముఖ సుకర్మ ప్రాపితాఽభంగ కీర్తి
ధ్వజ కలియుగ కృష్ణా దానకేళీ సతృష్ణా —పద్యము - ౨౫౦.

హరివంశావతారికలో వేమారెడ్డి ఘనకార్యములను వర్ణించు పట్టున వ్రాసిన పద్యములలో సు। ప్రసిద్ధ పద్యమునందలి యీ తొలిపాదము కూడ నిక్కడ చక్కగ సమన్వయ పడుచున్నది :

"అగ్రహారములు విద్యాతపోవృద్ధ విప్రులకిచ్చి యజ్ఞకర్తలుగనునిచె" (౧౪).

వేమారెడ్డి మ్లేచ్ఛులను తరిమికొట్టి "మ్లేచ్ఛాంబోధి కుంభోద్భవుడయి" నట్లు గ్రంథములు వాకొనుచున్న విషయమునిచ్చట ననుసంధించుకొనుట ముఖ్యము.[1]

## రాజరాజుకు వేమారెడ్డికి అభేద కల్పన :

నన్నయ భారతమున రాజరాజును వర్ణించిన ఆశ్వాసాద్యంత పద్యములు సుమారు నలువది. వీనిలో నాలుగైదింట దప్ప తక్కిన పద్యములన్నింటిలో రాజరాజు నామగ్రహణము చేతనో, తదనుగుణములగు విశేషణముల చేతనో కణోక్తిగా సంబోధింపబడినాడు. అరణ్యపర్వ శేషమున ఎఱ్ఱన వ్రాసిన ఆశ్వాసాద్యంత

1. పురిపండా అప్పలస్వామి - హరివంశము - పూ : సంక్షేప ప్రతి. పీఠిక - పుట : ౧౪, డిశంబర్-౧౯౬౮.

పద్యములు మొత్తము పదునొకండు. వీనిలో రాజరాజు నామగ్రహణము చేతగాని, తద్విశేషణముల చేతగాని కణ్ఠోక్తిగా సంబోధింపబడిన పద్యములు మూడు మాత్రమే. తక్కిన యెనిమిదింటిలో రాజరాజునేగాక మఱేయితర ప్రభువునైనను చూడ వచ్చును. నన్నయ పద్యములెట్లున్నను, అతనికృతికి భర్తయనుడు, శ్రోతయనుడు రాజరాజు మాత్రమే. కాని యెఱ్ఱన కృతి విషయమున గూడ కచ్చితముగ నట్లే యగునా! అన్నది విచికిత్స. శల్యపరీక్షకు అరణ్యపర్వము నందలి చతుర్థ సప్తమాశ్వాసములను గ్రహింతముగాక. చతుర్థాశ్వాసమునందలి ఆదిపద్యమును వ్రాసినది నన్నయభట్టారకుడే. ఆ పద్యమిది :

కం॥ శ్రీరాజరాజ! కుల వి
స్తార! సుధాహార హీర సన్నిభ కీర్తీ!
శ్రీరమణ రాజవిద్యా
పారగ! కోదండపార్థ! పార్థివ తిలకా! ఆ-4-1.

ఈ ఆశ్వాసము యొక్క అంత పద్యములు వ్రాసినవాడెఱ్ఱన. ఆ రెండు పద్యములివి :

కం॥ చరమ యుగ చలిత ధర్మ
స్థిరీకరణ చతుర చరిత! ధీగుణలీలా
పరికర పరిచితనయ వి
స్తర! వితరణ వివరణైక దాన వినోదా! ఆ-4-416.

మాలిని॥ కరివర కిరి కూర్మ క్ష్మా ధరాధీశతుల్యో
ద్ధరణ గుణధురీణోద్దండ బాహార్గళాగ్ర
స్ఫురిత నిఖిల గోత్రాభోగ భాగ్యైక భోగా!
తరుణ రుచిర మూర్తీ! ధర్మతంత్రాను వర్తీ! —417.

ఆశ్వాసాద్యంత పద్యములకు సంబంధించిన వఱకు ఇవి యెఱ్ఱన మొదటి పద్యములు. వీనిలో దిఙ్మాత్రముగనైననురాజరాజ సందర్భనము లభించుచున్నదా? అన్నది ప్రశ్న. ఇచ్చట రాజరాజును నామగ్రహణముచేత కంఠోక్తిగ స్మరింప వలసిన ధర్మము తనకుండగా నట్లుచేయకపోవుటకు కారణమేమై యుండును? ఇదే యాశ్వాసమున కలియుగమున విష్ణుడు కల్కిరూపంబున ధర్మమును ప్రతిష్ఠించిన

ఘట్టమునందు, వేమారెడ్డి అద్దంకిలో ధర్మమును ప్రతిష్ఠించిన ఘట్టము స్ఫురించు చున్నదని వెనుక భావించితిమి. ఎట్టిన ఈ రెండుపద్యములను, ముఖ్యముగ మొదటి పద్యమును దానికి సమన్వయించుటకు వీలుగ నుండునట్లు వ్రాసినాడని తోచుచున్నది !

సప్తమాశ్వాసము నందలి ఆది పద్యమును తిలకింపుడు :

శ్రీకర సోమాన్వయ ర
త్నాకర హిమధామ ! ధార్మికాంచిత వినయో
త్సేక ! భువనైక వీర ! మ
హా కావ్య రస ప్రయోజనారూఢ మతీ ! —1

ఇందు రాజరాజు లీలగా దర్శనమిచ్చినట్లున్నది. "మహాకావ్య రస ప్రయోజనారూఢ మతీ !" అన్న మాట రాజరాజున కన్వయించి నంతగా వేమారెడ్డికి గూడ నన్వయించును !

ఇప్పుడు ఈ యాశ్వాసాంత పద్యములు వినుడు :

క॥ వీరావతార ! విమలా
చార ! మహోదార ! శుభ విచార ! సుజన మం
దార ! నవకీర్తి మౌక్తిక
హార ! హర పదాబ్జ మధుకరాత్మ విహారా ! —471

తరలము॥ అమిత వైభవ ! లోభ మోహ మదాది దుర్లభ ! మంజు వి
భ్రమ విలాసిత కామినీ జన పంచబాణ ! నిరంత రా
నమ దశేష నృపాల మౌళి పినద్ధ ముగ్ధ మణి ప్రభా
క్రమ సమర్చిత విస్ఫురత్పద కాంతి నిర్జిత పంకజా ! —472

ఈ రెండు పద్యములలో రాజరాజు ఉన్నాడనుకొనవలయునా ? లేక వేమారెడ్డి యున్నాడనుకొనవలయునా ? లేదా ఇరువురు ఉన్నారనుకొనవలయునా ? అన్న విచికిత్స పొడముచున్నది. ఇందు మొదటి పద్యమందలి "హర పదాబ్జ మధుకరాత్మ విహారా" అన్న సంబోధన రాజరాజుకే చెందునని భ్రమపడరాదు !

వేమారెడ్డి కూడ "భవాంఘ్రి సరోజ పూజనా సన్నుతి తత్పరాత్ముడు" (హరి. పూ - ఆది - 1 - 20) అని వర్ణింపబడినాడు !

హరి వంశమున మొట్టమొదటి పద్యమున ;

"శ్రీకిం బ్రేమ పదంబు.... అన్న వేమ భూవిభు నకిచ్చున్ సుస్థిరైశ్వర్య ముల్" అనియు, చిట్టచివరి పద్యమున-

శ్రీ వేమక్ష్మావల్లభ !
భూవల్లభ ! పూజనీయ భుజవైభవ ! ల
క్ష్మీ వల్లభ ! గుణ వితరణ
పావన ! నిను బొందుగాత భవ్య శుభంబుల్

అనియు వేమారెడ్డిని నోరార పిలిచినవాడు, అరణ్యపర్వ శేషమున మొట్టమొదటి పద్యములలో గాని, చిట్టచివరి పద్యములలో గాని రాజరాజును నోరార పిలువక పోవుటకు గల కారణమూహింపవచ్చును !

ఎఱ్ఱన్న బాహ్యదృష్టికి రాజరాజును స్తుతించుచున్నట్టున్నను అంతర్యమున నాతడు భావించినది వేమారెడ్డినేయని ఊహించుట పొరపాటు కాబోదు ! హరి వంశమున అవతారికలో వేముని గూర్చి ప్రసంగించిన తొలి వచనమున, తొలి వాక్యమున-

"అఖిల జనరంజనం బొనర్చుటం జేసి 'రాజ' శబ్దంబునకు భాజనం బగుచు" అని యెఱ్ఱన వేమారెడ్డి యందు 'రాజ'త్వమారోపించుట ఆతని దూర దృష్టికి, సమన్వయ దృష్టికి, నిదర్శనము. నన్నయ తాను ప్రత్యక్షముగ చూచిన రాజరాజును వర్ణించెను. ఎఱ్ఱయ నన్నయ పద్యములను చదివి తానూహించిన రాజరాజును వర్ణించెను.

ఎఱ్ఱయ తాను ప్రత్యక్షముగ చూచుచుండిన తన ప్రభువగు వేమారెడ్డిని దృష్టియందుంచుకొనియే తానూహించిన రాజరాజును చిత్రించి యుండునని భావించుట చోద్యము కానేరదు. నన్నయ రాజరాజునకు వాడిన విశేషణములు కొన్ని ఎఱ్ఱయ రాజరాజును గూర్చి వ్రాసిన పద్యములలో కాన్పించుటయు అట్లు

రము కాదు. అట్లే ఎఱ్ఱన రాజరాజునకు వేసిన విశేషణములు కొన్ని వేమారెడ్డిని గూర్చి వ్రాసిన పద్యములలో గోచరింపకపోవు. ఇదంతయు నొక విచిత్రమైన సమన్వయము! నన్నయ భారతము రాజరాజాంకితమైపోయినది. ఎఱ్ఱన కృత మైన యీ ఉచ్చిష్టమును-అరణ్యపర్వ శేషమును-అంకితము గొనుటకుత్సహించు అవివేకి గాదు వేమారెడ్డి! అతడే, యీ భాగమును గూడ రాజరాజు పేర చెల్లింపు మని బహుశః ఎఱ్ఱన్నకు చెప్పియుండుననుట కట్టుకథవంటిది కాజాలదు. తాను "తద్రచనయకాన్" పూరించిన అరణ్యపర్వ శేషమును, రాజరాజుకు చెల్లించిన మహనీయుడు, తాను నన్నయ్యతో తాదాత్మ్యమును చెందినట్లు తన ప్రభువగు వేమారెడ్డిని రాజరాజుతో తాదాత్మ్యమును చెందించి యుండవచ్చునన్నచో విప్రతి పత్తియు, అతిశయోక్తియు లేవనుట నిక్కము!

ఇంత చెప్పిన దానికి సారాంశమిది: రెడ్డి రాజ్యస్థాపన క్రీ. శ. 1325 ప్రాంతమున జరిగినది. ఇంచుమించుగా, అది మొదలుకొని 1353 వఱకు అనగా వేమారెడ్డి మరణించువఱకూ, అతని నంటిపెట్టుకొని, ఆస్థాన కవిగ నుండి, యీ నాల్గు మహాప్రబంధములను వెలయించిన మహనీయు డెఱ్ఱన. రామాయణము 1325-30 మధ్య కాలమున, అరణ్యపర్వ శేషము 1330-35 మధ్య, నృసింహ పురాణము 1335-40 మధ్య, హరివంశము 1340-45 మధ్య, ఇదీ, ఎఱ్ఱనార్యుని కృతుల యానుపూర్వి. రామాయణ హరివంశములు వేమారెడ్డికంకితములయినట్లు, అరణ్య నృసింహములు తదంకితములు కాకపోవు గాక, కాని యాతని యెఱుక తోనే వ్రాయబడినవి. అతని సమ్మతితోనే ఒకటి రాజరాజాంకితము, మఱొకటి నారసింహాంకితములయిపోయినవి. రాజరాజులో నాతడు చూచినది వేమారెడ్డినే, లేదా వేమారెడ్డిలోనే యాతడు రాజరాజును చూచియుండును. సూక్ష్మేక్షికతో పరిశీలించిన విషయము బోధపడును!



# అరణ్యపర్వ శేష కర్తృత్వము

తే॥ ఎఱ్ఱనార్యుండు సకల లోకైక విదితుఁ
డయిన నన్నయభట్ట మహాకవీంద్రు
సరస సారస్వతాంశ ప్రశస్తి దన్నుఁ
జెందుటయు సాధుజన హర్షసిద్ధిఁగోరి —ఆ. 7-469

కం॥ ధీర విచారుఁడు తత్కవి
తా రీతియుఁ గొంతఁదోపఁ దద్రచన యకా
నారణ్యపర్వ శేషము
పూరించెఁ గవీంద్ర కర్ణపుట పేయముగాన్ —ఆ. 7-470

ఉ॥ ఉన్నత సంస్కృతాది చతురోక్తి పథంబుల కావ్యకర్తవై
యెన్నికమై ప్రబంధ పరమేశుఁడనంగ నరణ్యపర్వ శే
షోన్నయ మంధ్ర భాష సుజనోత్సవ మొప్పగ నిర్వహించి తా
నన్నయభట్ట తిక్కకవి నాథుల కెక్కిన భక్తి పెంపునన్
—నృసింహ పురాణము - ఆ. 1-17

## సరస సారస్వతాంశ ప్రశస్తి :

నన్నయభట్ట మహాకవీంద్రు సరస సారస్వతము భారతము. దాని యంశము అరణ్యపర్వము. (అరణ్యపర్వ శేషమని కొందఱు చెప్పుట సరిగాదు! నన్నయ చేత రచితము కాని యా భాగము అతనిదగుట కుదురదుగదా! అల తియో వలతియో వ్రాసినాడు గావున అరణ్యపర్వ మనవచ్చును). దానిని పూరించు ప్రశస్తి తనకు దక్కినది అనగా నన్నయ చేత శేషము రచితము కాకపోగా తనకా పర్వమే పూరణీయమైనదనుట! ఇదే విషయమును సంశయ విచ్ఛేదమునకై, స్పష్టప్రతిపత్తికై రెండవ పద్యమున "అరణ్య పర్వ శేషము పూరించెన్" అని చెప్పినాడు. వాస్తవమున కిచ్చట "అరణ్యపర్వము పూరించెన్"

అని చెప్పిన చాలును. ఒకవేళ అట్లే చెప్పినాడను కొందము. అప్పుడు కొంద జెట్లనవచ్చును:

నన్నయ సగపాలు వ్రాసెను, ఎఱ్ఱన రచించినది మిగిలిన సగపాలు మాత్రమె! మఱి "అరణ్యపర్వ శేషము పూరించెన్" అని స్పష్టముగ చెప్పవలసి యుండగా పర్వమునంతయు తానె రచించినట్లు "అరణ్య పర్వము పూరించెన్" అనుచున్నాడేమి? అని. ఇటి పరిణామములను ఊహించని మహాకవి తాను చేసి నది చేసినట్లు చప్పినాడు. కాగా నిచ్చట 'పూరించెన్' అన్న దానికి రచించననియే నిశ్చితార్థము. ఎఱ్ఱనకు సన్నిహితోత్తర కాలము వాడైన జక్కన "ఈత్రయి దా ప్రబంధ పరమేశ్వరుడై పరచించ శబ్ద వైచిత్రి నరణ్య పర్వమున శేషము" అని గదా ప్రశంసించినాడు! (విక్రమార్క చరిత్ర - అవతారిక : 14).

## అరణ్యపర్వ శేషోన్నయము :

అరణ్యపర్వ శేషాంతమున ఎఱ్ఱన స్వయముగా చప్పిన యీ మాటల వలన సందేహముండుటకు తావె లదు. ఇక నృసింహములో ఎఱ్ఱన తాత ఎఱపోత సూరి పలికిన పలుకులను పరిశీలింతము : "అరణ్యపర్వ శేషోన్నయ మంధ్ర భాష సుజనోత్సవ మొప్పగ నిర్వహించి" ఇచ్చట "ఉన్నయ" పదమునకు తాత్పర్యార్థము రచించననియె గాని, కచ్చితమగు శబ్దార్థము మాత్రము "పైకి తీసుకొని వచ్చుట" అని. శేష భాగ రచనా వాదులు 'రచించుట' యను నర్థము చెప్పిరి. శిథిలాంశ పూరణవాదులు "పైకితీసుకొనివచ్చుట" అని చప్పిరి. ఏది చప్పినను అసలు వస్తుస్థితి యిది : ఉన్నయము - పైకి తీసుకొని వచ్చుట. దేనిని పైకి తీసుకొని వచ్చుట? అరణ్యపర్వ శేషమును! ఏ భాషలోనికి? ఆంధ్ర భాష లోనికి! ఆంధ్రభాష లోనికి పైకి తీసుకొనిరావలసిన అరణ్యపర్వ శేషము ఎవ్వరిదై యుండును? వ్యాసుని సంస్కృత భాగమా లేక నన్నయగారి ఆంధ్ర భాగమా? ఆంధ్రములో నున్న నన్నయగారి యరణ్యపర్వ శేషమును మఱల నాంధ్రములోనికి తెచ్చుటయేమి! కాగా నిది వ్యాసుని సంస్కృతారణ్యపర్వ శేషమె ముమ్మాటికి కావలయును! సంస్కృతభారతమున ఆ పర్వమునకు 'వనపర్వ' మని పేరు పెట్టినను పర్వానుక్రమణికలో వ్యాసుడు 'అరణ్యపర్వ' మనియె పేర్కొనినాడు. నన్నయగారు వనపర్వము అనుటకుబదులు అరణ్యపర్వ మను నామమును ప్రసిద్ధికి తెచ్చినాడు. కావున ఈపద్యమున అరణ్యపర్వ శేషమను మాటకు వ్యాసుని 'వనపర్వభాగమ'ని యర్థము గ్రహింపవలెను. అనగా సంస్కృ

తారణ్య పర్వమందలి కొంత భాగమప్పటికింకను ఆంధ్రమున ననువదింపబడక నష్టే పడియున్నది! దానిని యాంధ్రభాషలో నిర్వహించి (అనువదించి) ఉన్నయ మొనర్చి (పైకి తీసుకొని వచ్చి) ప్రజలకు తెల్లము చేసెనని యర్థము! నన్నయ తిక్కన లేమి చేసిరో ఎఱ్ఱనయు నదియే చేసినాడు!

భాసుర భారతార్థముల భంగులు నిక్కమెఱుంగ నేరమిన్
గాసట బీసటే చదివి గాథలు ద్రవ్వ తెనుంగు వారికిన్
వ్యాసముని ప్రణీత పరమార్థము తెల్లఁగఁజేసినట్టి య
భ్యాసన కల్పులందలఁతు నాద్యుల నన్నయ తిక్కనార్యులన్

—నృసింహ పురాణము - ఆ. 1 - పద్యము 9

ఈ యిర్వురు తమతమ భారత భాగములను రచించిరని సామాన్యముగ చెప్పనొప్పునా? ఒప్పునేమోగాని ఎఱ్ఱన చేసినది మాత్రము 'ఉన్నయ' మనియే చెప్పితీరవలయును. నన్నయ తిక్కనల భారత భాగములను చదువుకొనుచుండిన జనులకు ఆ మధ్యలో దిగబడిపోయిన కొద్దిపాటి మొఱిక - వనపర్వశేషము - అందున్న వ్యాసముని ప్రణీత పరమార్థము అందక జాఱిపోయినది! దానిని పైకి తెచ్చి అందించి సుజనోత్సవము కలిగించిన వాడెఱ్ఱన! దీనిని "ఉన్నయ" మనియే చెప్పవలెను. విషయమింత సూటిగా నుండ, నన్నయ అరణ్యపర్వమంతయు వ్రాసెను. ఏ కారణముననో అందుత్తర భాగము అక్కడక్కడ చిల్లులుపడి శిథిలమైనది. ఆ శిథిల భాగములను మాత్రమే యెఱ్ఱన అందదుకులుగా పూరించెను—ఉన్నయమొనర్చెను. అంతేగాని, నన్నయ ఉత్తర భాగమును వ్రాయకపోగా ఎఱ్ఱయయే పూర్తిగా రచించెననుట కల్ల అని చెప్పు వారి వాదములు సరిగావు. నన్నయ ఉత్తర భాగమును వ్రాయనేలేదు! ఎఱ్ఱనయే రచించినాడనుట సిద్ధాంతము!

ఉన్నయ శబ్దమునకు కడముట్ట వ్రాయుట, ప్రతిభతో నూహించి వ్రాయుట అనియు నర్థములు గలవు. కడముట్ట వ్రాయుట అనునర్థము ఇప్పటికి చెప్పిన దానితో గతార్థమైనది. ఇక ప్రతిభతో నూహించి వ్రాయుట అను నర్థమును పరిశీలింతము. ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకమున నిట్లు వ్రాకుచ్చెను:

ఇతివృత్త వశాయాతాం త్యక్త్వాననుగుణాం స్థితిం
ఉత్ప్రేక్ష్యోప్యంత రాభీష్ట రసోచిత కథోన్నయః॥

ఇది సరిగా నరణ్యపర్వ శేషోన్నయ కథా ప్రసంగమునకు అతికినట్లున్న శ్లోకమనవచ్చును! ఇట "ఉన్నయ" మనగా ప్రతిభా సంపదతో నూహించి కల్పించుటయని యర్థము. నన్నయ తన అరణ్యపర్వ భాగమును రసోదంచిత ముగ రచించినాడు. ఆదిపర్వము నుండి యరణ్యపర్వము దాక, ఒక్కొక్క మెట్టు పైపైకి క్రమపాకముతో పరాకాష్ఠ నందించి రసోత్కటము గావించినాడు. ఆ రసపట్టులో హఠాత్తుగ నాగిపోయిన దాతని రచన. ఆ ఓట్టు సడలకుండ, అతడే యైనచో తక్కిన భాగమును కూడ ఎట్లు వ్రాసి యుండెడివాడో తన ప్రతిభా బలముతో నూహించి "తత్కవితారీతియు కొంత దోప దద్రచనయ కాన్" అరణ్యపర్వ శేషమును పూరించినాడెఱ్ఱన. నన్నయ కవితా శరీరమున "పరకాయ ప్రవేశము" చేసి తన మేధా చుంచువుతో నందలి జీవసారమును పీల్చుకొని అచ్చము అతడు వ్రాసినట్లే వ్రాసినాడు. "ప్రతిభతో నారణ్యపర్వ శేషము జెప్పె గవులకు చెవుల పండువులు గాగ" అని పొగడ్తల నందినాడు! "తత్కవితారీతి"తో గాక తన స్వంత కవితారీతితో వ్రాసియుండినను అంతటి వాడయ్యెడివాడే! కాని, "నన్నయభట్ట తిక్క కవినాథుల కెక్కిన భక్తి పెంపునన్" ఈ వినయాన్వితుడు ఈ మార్గము నవలంబించినాడు. "ప్రబంధ పరమేశ్వరుడై" కవిత్రయములో నొకడుగ కీర్తింపబడి అనంతర కవులచే శతాబ్దుల తరబడిగా నీరాజనములనందుకొనుచున్నాడు. ఇదిట్లుండ, ఇటీవల ఈ శిథిలపూరణ వాదము వచ్చిపడినది!

## అంతరంగ సాక్ష్య పరామర్శ :

ఈ శిథిలపూరణ వాదులు గ్రంథ పరిశీలనలో నుదాహరించిన యంత రంగ సాక్ష్యమొకటి మెతుకు పట్టినట్లు పట్టి పరిశీలింతము :

> రయ విచలత్తురంగమ తరంగములన్ మదనాగ నక్ర సం
> చయముల సంచలచ్చటుల సైనిక మత్స్యములన్ భయంకరం
> బయి కురురాజ చంద్రునుదయంబునఁ దద్దయుఁబొంగెఁ బ్రస్ఫుర
> ద్భయద మనోహర ప్రకట భంగులఁదద్భట వార్ధియుద్ధతిన్
>
> —ఆ. 6 : 58

ఇందలి మొదటి రెండు పాదములు సభాపర్వము లోనివి. ఒక్క క్షణము అరణ్యపర్వమంతయు నన్నయ్యయే వ్రాసినాడనుకొందము గాక! అప్పుడాతడు సభాపర్వములోని యీ పద్యమును అరణ్యపర్వములో తిరిగి పునరావృత్తము చేసినాడనవలయును. ఇట్టివింకను మఱికొన్ని యున్నవని వీరు చూపించు చున్నారు. నన్నయ వానిని కూడ పునరావృత్తి చేసినాడనవలయును. అప్పుడు నన్నయగారి యారణ్యపర్వ రచన మంతయు, అందునను ఈ ఉత్తరభాగము పునరావృత్తి దోషమునకు గుఱి కాకతప్పదు. నన్నయ్య అట్లు చేయునా? చేసి నట్లాతని భారతమునందలి యితర పర్వములలో నెచ్చటగాని మఱికొన్ని సందర్భములున్నవా? అట్లయిన అతని శబ్దశాసనత్వమునకు కొంత కొఱత యేర్పడక తప్పదు. అతడు తన కడ శబ్దజాలముగాని, భావ సంపదగాని, నిరర్గళ ధారాశుద్ధి గాని, లేనివాడు కాదు! ఆదికవియే గాదు, ఆదర్శకవి గూడ! ఇట్టి పట్టులందు మఱికొన్ని కమ్మని పద్యములను ప్రసాదించి యుండునే గాని పునరావృత్తము చేయుటకు పూనుకొనడు. కాగా, ఇది నన్నయ వ్రాయశేదనుటకు నిదర్శనము. ఎఱ్ఱన "తత్కవితారీతి"లో వ్రాయుటకు ప్రతినబూనినవాడు గాన పద సంఘటనా రూపమైన యాతని రీతిని సాధనచేసి స్వాధీన మొనర్చుకొని, వ్రాయునప్పుడు కొన్ని పదములు, పదబంధములు అక్కడక్కడ కావలెనని గ్రహించుట స్వాభావికము మూడు నాల్గు చోట్ల పాదములకు పాదములే యుండుటకు కారణము నన్నయపై తనకు గల గౌరవమును పురస్కరించుకొని ఎఱ్ఱన కావలయుననియే వాటిని ఎఱువు తెచ్చికొన్నాడనుట! అంతమాత్రమున నది నన్నయ రచన యనుట పొసగదు. ఎఱ్ఱన ఈ "రయవిచలత్తురంగమ తరంగములన్" అన్న పద్యమును ప్రత్యేకించి ఈ విధముగ వ్రాయుటకు కారణ మిట్లూహింపవచ్చును. ఇందలి రెండవ సగమున చక్కని సూక్తి వైచిత్రి యున్నదని విద్వాంసులంగీకరించిన విషయమే. ఇట్టి రమ్యమైన భావము స్ఫురించి అప్రయత్నముగ నీ రెండు పాదములూ ఎఱ్ఱన గంటమునుండి దొర్లియుండును. దాని కనుగుణముగ మొదటి రెండు పాదములు కూర్చవలసి వచ్చుట తప్పని సరి! మార్గాంతరము లేక గాని, నన్నయమీది గౌరవముతో గాని, నన్నయ నుండి యీ రెండు పాదములను గ్రహింపవలసి వచ్చినది కావలయును. మఱొక ముఖ్య విషయము కూడ నున్నది. సభాపర్వమున నన్నయగాని, అరణ్యపర్వ శేషమున నెఱ్ఱనగాని తమతమ పద్యములనిట్లు వ్రాయుటకు వ్యాసుని మూలముల యనుగ్రహము కూడ కొంత కారణము. ఇది యెఱ్ఱన్నకు లభించిన దానికంటె

నన్నయకు అధికతరముగ లభించినది. నన్నయ, మూలము నూతగా గొని తన పద్యమును అలంకార ప్రవణముగ సంతరించినాడు. ఎఱ్ఱన్న మూలముతోపాటు నన్నయ్యను కూడ నాశ్రయించి తన పద్యమునకు వన్నె పెట్టుకొనినాడు. నన్నయ ఖాంతముకోని పది యక్షరములో, పది పదములో, పది సమాసములో, పది వాక్యములో, ఒక పద్యము యొక్క సగభాగమో యిక్కడ నున్నందువలన ఇది నన్నయ కృతమైనచో, ఇట్టివి ఎఱ్ఱన్న యితర కృతులలో గూడనున్నచో నవి కూడ నన్నయ కృతులే యగునా! అన్న ప్రశ్నకు సమాధానము దుర్లభము. ఎఱ్ఱన కవితలో అంతర్లీనముగ నూరుచున్న "తత్కవితా రీతి" యొక్క తపఃసలిలమును ఆస్వాదింపగలుగవలయును. ఆస్వాదించి యథార్థమును సెలవిచ్చిన మహనీయులు జక్కన శ్రీనాథ రాధామాధవాది మహాకవులు! తిక్కన వేసిన "మూడు కృతుల" పొడుపు కథ అంతర్యము వీరికి తెలియదనగలమా? అసలు తిక్కనగదా ఈ పీటముడిని బిగించినది! ఆ విషయమును దిఙ్మాత్రముగ పరామర్శింతము :

## మూడు కృతుల అసలు రహస్యము :

> "ఆది దొడంగి మూడు కృతులాంధ్ర కవిత్వ విశారదుండు విద్యాదయి
> తుండొనర్చె మహితాత్ముఁడు నన్నయ భట్టు దక్షతన్"[1]

ఇది సుమారుగ చెప్పినదే గాని కచ్చితముగ చెప్పినది గాదు. కారణమేదైన గానిండు! ఆతడు అరణ్యపర్వ శేషమును పూరింపదలచలేదు. ఆ మాట చెప్పుట కిష్టము లేదు. ఉపాయముగ దాటవేయుట కిట్టి లౌక్యము చేసినాడు. ఇది అబద్ధమాడినట్లు భావించుట సమంజసము కాదు. లౌక్యమనుటకెట్టి సందేహము లేదు. నన్నయ ఎఱ్ఱనలు కేవలము కవులు మాత్రమే. తిక్కన రాజతంత్రమున కాకలు తీరినవాడు, లౌకికము నెఱిగినవాడు. దానినిక్కడ ప్రయోగించినాడు. "మూడు కృతుల" పొడుపు కథ వేసినాడు. అది విప్పుట కితరులకు చేతగాని పని యని భావించి కాబోలు "కథ జగత్ప్రసిద్ధి గాన పూర్వాపరార్థయుక్తి చేయునట్టి యెడల యత్నమించుకంతయైన వలవదు" అన్న మాటతో ఆ పొడుపు కథను తానే విప్పి ఆ రహస్యమును వ్యంగ్యముగ వెల్లడించినాడు!

ఇచ్చట "మూడు కృతులు" అను ప్రయోగములో సూచనామాత్ర సారముగ నొక రహస్యము గర్భీకృతమై యున్నట్లు స్ఫురించుచున్నది. 'కృతి'

---

1. విరాటపర్వము—అవతారిక; పద్యము-6.

శబ్దమునకు గ్రంథము, పర్వము, ఆశ్వాసము - ఇత్యాదిగా సందర్భమును బట్టి యెన్నియో అర్థములున్నవి. "ఆది దొడంగి మూడు కృతులు" అన్నప్పుడు తొలి మూడు పర్వములనుట సామాన్యార్థమే. కాని "మూడు కృతులు" అన్నది విడిగా విశ్లేషించి మూడవదగు నరణ్య పర్వమునందలి మూడాశ్వాసములు అను విశేషార్థమును లాగవచ్చునా! అన్న విచికిత్స పొడముచున్నది! అప్పుడు నన్నయ మొదటి మూడు పర్వములు వ్రాసెను. అయితే మూడవ పర్వములో మూడాశ్వాసములు మాత్రమే వ్రాసెను! అనునర్థము వచ్చును. అట్లు వచ్చునా యన్నచో తిక్కన గుండె లోతులను త్రవ్వి చూడగా ఇచ్చటి పొడుపు కథా సందర్భమును బట్టి శబ్ద పరివృత్తి సహించినను సహింపకున్నను వచ్చుననుటలో సందేహము లేదు. అయితే, అప్పుడు కూడ మూడవ పర్వమందలి చతుర్థాశ్వాసములో 142 పద్యములు నన్నయ కృతములుండుట వలన మఱల 'సుమారు' వాదము నంగీకరింపక తప్పదు! ఏ విధముగ చూచినను ఈ ఘట్టమునకు 'సుమారు' వాదమే శరణ్యమనుట నిక్కము!

కాని, ఇక్కడొక చిన్న కొతుకున్నది. తిక్కన యింత మెలకువతో 'పర్వ' శబ్దమునకు బదులు 'కృతి' శబ్దమును ప్రయోగించినను ఆతని యాంతర్యమును పూర్తిగా పసిగట్టజాలని వాడగుటవలన శిష్యుడు మారన తన మార్కండేయమునందు :

> "భారత సంహితన్ మును త్రిపర్వము లెవ్వడొనర్చెనట్టి వి
> ద్యా రమణీయు నాంధ్ర కవితాగురు నన్నయ భట్టు గొల్చెదన్"[1]

అని 'పర్వ శబ్దమును ప్రయోగించినాడు. ప్రయోగమేదైనను గురువు యొక్క "మూడు కృతుల" అసలు రహస్యము శిష్యునకు తెలుసు. కావున తాను కూడ "ఉజ్జాయింపు" అను నర్థములోనే వ్రాసినాడనుటకు సందేహము లేదు!

ఈ వరుసలో అప్పకవి గూడ మూడు పర్వములనియే చెప్పినాడు :

1. "తెనుంగు బాస జెప్పె నన్నయభట్టు తొల్లి పర్వములు మూడు శ్రీ భారతమున" అవతారిక - 42
2. "ఆ మూడు పర్వములలో నామాన్యుడు నుడువు తెలుగులరసికొని" అవతారిక - 47

1. అవతారిక—పద్యము 9

ఈతడు ఎఱ్ఱనకు కడు నర్వాచీనుడు (క్రీ. శ 1675). అరణ్యపర్వ శేషకర్తృత్వము ఎఱ్ఱనదేయని గట్టిగా తెలిసినవాడు. అసలెట్టి సందేహము రాని వాడు. ద్వితీయాశ్వాసమున "అరివర్ణ చక్రోద్ధారము" క్రింద ఇట్లు వక్కాణించి నాడు :

"ఎఱ్ఱా ప్రెగడ తనకును, అరణ్యపర్వ శేషము మొదలి పద్యమునకును అక్షరచక్రము చూచుకొన్నందుకు తెలివిడి :

"తెనుగున" శబ్దాదిని యకారములేదు గనుక నెఱ్ఱాప్రెగడ నామాద్యక్షర మిచ్చు గనుక ఎ కారము అది మొదలుకొనియు వ్రాయగా పద్యాది వర్ణము "స్ఫురదరుణాంశు" అన్నాడు గనుక ద్వితీయాక్షరమునందు మొదట యక్షరమే కారణము గనుక నకారము సాధ్యపు చౌకమునందు సాధ్యపు యింట నిలిచెను గనుక సాధ్యాసాధ్యము మంచిది యెవరికి చూచినను ఇటువలెనే"

అప్పకవి అందించిన యీ కీలకమును చక్కగా నధ్యయనముచేసిన కొండముది నరసింహముగారు[1] అక్షర చక్రమును చూచుకొనుట గ్రంథరచనకు పూనుకొను వారి పనిగాని, ఇతరుల గ్రంథములో శిథిలములయిన పద పద్యములను పూరించువారి పని గాదని తేల్చి 'మూడు కృతుల రహస్యమును భేదించి విషయ నిర్ధారణము గావించినారు. వేలూరి శివరామశాస్త్రి[2] ప్రభృతి పండిత పరిశోధకులు దీనిని ప్రామాణికముగా స్వీకరించినారు. అసలు అప్పకవియే మఱొకచోట - చతుర్థాశ్వాసమున "గణాధి దేవతా ఫలంబులు" వర్ణించు సందర్భమున నిట్లుడివినాడు :

"అరణ్య పర్వావశిష్టంబునందు భీమకవి శాపభయంబున జయముగోరి స్ఫురదరుణాంశు రాగరుచి యని శంభుదాసుండును" (వచనం-73).

## అరణ్యపర్వ శేషకర్త ఎఱ్ఱనయే:

ఇంతకంటె ప్రమాణమేమున్నది ! అసలీ వాదము ఇటీవలనే తలయెత్తినది. ఇప్పుడు పాతబడినది. ఇక ముందురాణకెక్కనిది. అరణ్యపర్వమును పూర్తిగా పూరించిన మహనీయు డెఱ్ఱనార్యుడే !

---

1. "అరివర్ణ చక్రోద్ధారము" భారతి, జూలై, 1927.
2. హరివంశ పీఠిక—వావిళ్ల ముద్రణ-1967.

# అనుక్రమణిక

# ప్రబంధ పరమేశ్వరుడు

ఉన్నత సంస్కృతాది చతురోక్తి పథంబుల కావ్యకర్తవై
యెన్నికమై ప్రబంధ పరమేశ్వరుడనంగ నరణ్యపర్వ శే
షోన్నయ మంధ్ర భాష సుజనోత్సవ మొప్పగ నిర్వహించి తా
నన్నయ భట్ట తిక్క కవినాథుల కెక్కిన భక్తి పెంపునన్.

—నృసింహ పురాణము ; ఆ. 1-17

దీనిని బట్టి యెఱ్ఱయ ప్రబంధ పరమేశ బిరుదాంచితుడు. అరణ్యపర్వ శేషోన్నయము వల్లనే యిది వచ్చినదనుట స్పష్టము. అయితే ఇది బిరుదము కాదనియు, బిరుదమే అయినచో ఆశ్వాసాంత గద్యములలో నుండవలయుననియు, శంభుదాస లక్షణాభిధేయముతోపాటు దీనిని ఆశ్వాసాంత గద్యలలో పేర్కొనక పోవుట వలన నిది ప్రశంస యని భావించుట సమంజసమనియు ఆచార్య డాక్టర్ కె. గోపాల కృష్ణారావు గారభిప్రాయపడిరి[1] ఇదొక చక్కని యూహ అనుటలో సందేహములేదు. ఒకవేళ ఇది బిరుదమయ్యుండియు ఎఱ్ఱన ఆశ్వాసాంత గద్యలలో పేర్కొనక పోవుటకు గల కారణమిట్లూహింప వచ్చును. శంభుదాస బిరుదము ఆతని ఆధ్యాత్మిక జీవన ప్రవృత్తికి సంబంధించినది. ప్రబంధ పరమేశ బిరుదమో ఆతని సాహిత్య ప్రక్రియకు సంబంధించినది. దానిని పేర్కొనుట సులువు. దీనిని పేర్కొనుట కష్టము. కొంతమోమోటమి అడ్డము వచ్చును. వచ్చుననుటకు నాతడు సహజముగ హ్రీరమ్యుడగుట కారణము. నన్నయ తిక్కన నన్నెచోడాది మహనీయులు తాముగా తమతమ కవితా లక్షణములను, బిరుదములను పేర్కొనిరి. ఎఱ్ఱన్న అట్లు పేర్కొనుటకు సాహసించలేదు. ఎంతకాలమైననౌగాక, తన కవితా లక్షణమును, 'శబ్దవైచిత్రి' యని జక్కన చెప్పలె ! 'సూక్తివైచిత్రి' యని శ్రీనాథుడనవలె ! తన విషయమును ఇతరులు చెప్పవలె, లేదా చెప్పించవలె, తాను మాత్రము చెప్పడు. ఈ ప్రబంధ పరమేశ బిరుదమనుడు ప్రశంస యనుడు తాత యెఱపోతసూరి చెప్పవలసి

1. ముఖాముఖి సంభాషణలో వారు సూచించిన యభిప్రాయమిది.

వచ్చినది! ఎట్టన్నలో తాబేలువలె లోలోపలికి కుంచించుకుపోవు నొకానొక మధుర లజ్జాభరితమైన మానసికస్థితి కాన్పించును. ఈ పద్యమును చిత్తగింపుడు :-

మించిన వేడ్కఁ బీనులకు మిక్కుటమై మధువృష్టిఁ గ్రమ్మ రా
యంచలు కూయఁ గ్రౌంచమును నావలఁగూయఁ దొడంగు భంగిఁ బ్రౌ
ఢాంచిత శబ్దసారులు మహాకవులాద్యులు కావ్యశయ్య గీ
లించిన కీర్తిసంగ సుఖ లీలకు నేనునుఁగాంక్ష సేసితిన్.

—నృసింహ పురాణము ; ఆ. 1 - 18

ఇది సరిగా కాళిదాసు రఘువంశ పీఠికలో చెప్పిన శ్లోకమును స్మరణకు తెచ్చును:

మందః కవియశః ప్రార్థీ గమిష్యామ్యుపహాస్యతామ్
ప్రాంశు లభ్యే ఫలే లోభాదుద్బాహురివ వామనః 1 - 3

కావుననే శంభుదాసు కాళిదాసనుట! ఇట్టి వినయాన్వితుడు, నన్నయ తిక్కనలకు లేని ప్రబంధ పరమేశ బిరుదము తనకున్నదని తానుగా ఎట్లుచెప్పును? ఇది బిరుద మన్నను ప్రశంస యన్నను ఫలితార్థమొక్కటే గావున బిరుద ప్రాయమగు ప్రశంసగా భావింతముగాక! చిత్రమేమన, ఎఱ్ఱన బిరుదములు రెండును శివ సంబంధములై యుండుట:

## సహజ పరిణత సిద్ధ ప్రబంధ రచనా ప్రావీణ్యము

గురు భజన పరాయణుఁడవు
సరస బహు పురాణ ధర్మశాస్త్ర కథా వి
స్తర వేదివి వినయోదయ
భరితుఁడ వతులానుభావ భవ్యుఁడ వెందున్. —19

కావున ప్రబంధ రచనా
ప్రావీణ్యము నీకు సహజ పరిణత సిద్ధం
బై వెలసినయది యొక కృతిఁ
గావింప జగద్ధితంబుగా నేఁబనుతున్ —20

ఇవి తాత ఎఱపోత సూరి ఎఱ్ఱన్నతో పలికిన మాటలు. ఇందు మొదటి పద్యము ఎఱ్ఱనార్యుని వ్యుత్పత్తిని, రెండవ పద్యము ఆతని ప్రతిభను చాటిచెప్పు చున్నవి. ప్రతిభావ్యుత్పత్తులలో ప్రతిభ గరీయసి గదా! అట్టి "ప్రతిభతో నారణ్యపర్వశేషము జెప్పె గవులకు చెవుల పండువులు గాగ." దీనికి పూర్వము "వల్మీక భవు వచో వైఖరి రామాయణంబు నాంధ్ర ప్రబంధంబుచేసె" అని గదా చదలవాడ మల్లయ వక్కాణ. దీనినిబట్టి ఎఱ్ఱన రామాయణమును రసవత్ప్రబంధముగా రచించినాడనుట నిక్కము. రామాయణమున సహజసిద్ధమై వెలసిన ప్రబంధ రచనా ప్రావీణ్యము అరణ్యపర్వ శేషమున సహజ పరిణతసిద్ధమై, నృసింహ పురాణమున మఱికొన్ని క్రొత్తరేకులు విప్పుకొని ఆదేస్థాయిలో హరి వంశమున విశ్రాంతి నందినది కావలయును. ఈ క్రమ పరిణత ప్రబంధ రచనా ప్రావీణ్యమును గూర్చి యెఱ్ఱన తానై భంగ్యంతరముగ సూత్రీకరించి సూచించు చున్నాడో అన్నట్లున్నదీ పద్యము :

> క్రమపాకంబున కెంపుతోడి నలుపెక్కన్ మిక్కుటంబైన గం
> ధము దిక్కుల్ సురభీకరింప రసమంతర్గామి యయ్యున్వెలిం
> గమియం గారుచు నున్న చాడ్పున విలోక ప్రీతిఁగావింప హృ
> ద్యములై యున్నవి చూచితే ఫలములీ తాళద్రుమ శ్రేణులన్
>
> —హరివంశము : పూ.ఆ. 7. పద్యం : 71

ధేనుకాసుర వనములో కమియమాగిన తాళ ఫలములను బలరామునకు చూపించుచు కృష్ణుడు పలికిన పలుకులివి. కీ.శే నోరి నరసింహశాస్త్రిగారు ఎఱ్ఱయ కిష్టమగు కవితా పాకమెట్టిదో వివేచనచేసి చెప్పుటకు పరిగ్రహించిన పద్యమిది.[1] ప్రకృతాంశమున మన మీ పద్యమునిట్లు సమన్వయించుకొనవచ్చును. తాళఫలములు కెంపుతోడి నలుపెక్కుట, మిక్కుటమైన గంధముతోడ దిక్కులను సురభీకరించుట, రసమంతర్గామియగుట, అంతర్గామియైన రసము వెలింగమియంగారు చున్నట్లుండుట మున్నగు దశలను సంతరించుకొనుచు క్రమపక్వములై విలోకప్రీతి గావించుచు హృద్యములగుచున్నట్లు, ఈ నాల్గు ప్రబంధములలోను ఎఱ్ఱన రచనా ప్రావీణ్యము క్రమపాకమున రసప్రవణమైనది. మొత్తముమీద

---

1. ఎఱ్ఱయ కవిత - వ్యాసము; సారస్వత వ్యాసములు - ప్రథమ సంపుటి; ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ, సంపాదకుడు - డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యం. (పుట. 71)

ఎఱ్ఱన గ్రంథములన్నియు - ఒకదానిని గూర్చి మరొక దానిలో చెప్పబడిన దానిని బట్టి - ప్రబంధ శబ్దవాచ్యములే యని తేలుచున్నది.

## పూర్వకవుల ప్రబంధ శబ్దప్రయోగ పరిశీలన :

నన్నయ ప్రబంధ శబ్దమును ప్రయోగించెనా? అన్నదొక విచికిత్స :

జననుత కృష్ణద్వైపా
యన ముని వృషభాభిహిత మహాభారత బ
ద్ధనిరూపి తార్థమేర్పడ
తెనుఁగున రచియించు మధిక ధీయుక్తి మెయిన్

—ఆంధ్రమహాభారతావతారిక - పద్యం : 16

ఆచార్య డాక్టర్ సి. నారాయణరెడ్డిగారు తమ "ఆధునికాంధ్ర కవిత్వము- సంప్రదాయము- ప్రయోగము" అను సిద్ధాంత గ్రంథమున ఈ పద్యమున గల 'బద్ధ' బంధమేమో! ఈ బంధమును ప్రబంధార్థమున నన్నయ వాడెనేమో! అని యూహించిరి. (పుట : 119 పుట్‌నోట్)

ఆచార్య డాక్టర్ కేతవరపు రామకోటిశాస్త్రిగారు "తిక్కన కావ్యశిల్పము" అను తమ సిద్ధాంత గ్రంథమున, తిక్కన విరాటపర్వ ప్రారంభమున ప్రయో గించిన "ప్రబంధమండలి" "పుణ్యప్రబంధములు" అనునవి ఆళ్వారుల దివ్య ప్రబంధములను స్మృతికి తెచుచున్నవి. అని భావించిరి. (ద్వితీయోన్మేషము పుటలు 198 నుండి).

కాలనిర్ణయము సరిగా జరుగని నన్నెచోడుడు తన కుమార సంభవమున తిక్కన కావున ఈ ప్రబంధ శబ్దమును ప్రయోగించినాడు :

జంగమ మల్లికార్జును నిసర్గ కవిస్తవనీయ సూక్తియు
క్తింగొనియాడి సత్కవిత గేనము లేకనురక్తయైన భా
షాంగనఁదక్కనేలిన మహత్త్వము లోకమునం బ్రసిద్ధిగా
భంగిగ విస్తరించెదఁ బ్రబంధము సద్రస బంధురంబుగాన్

—ఆ. 1-48

సంస్కృతమున భోజుని శ్లోకమిట్లున్నది :-

గద్యానుబంధ రసమిశ్రిత పద్యసూక్తిః
హృద్యాహి వాద్యకలయా కలితేవగీతిః
తస్మాద్ధ ధాతు కవి మార్గవిదాంసుఖాయ
చంపూ ప్రబంధ రచనాంరసనా మదీయా

—చంపూ రామాయణం, బాల : 126

## భోజుని ప్రబంధ శబ్దమే ఎఱ్ఱనకొజ్జబంతి :

నన్నయ వాడియుండవచ్చునని యూహింపబడుచున్న బద్ధ/బంధ/ప్రబంధ శబ్దములు కాని, తిక్కనగారి "ప్రబంధమండలి" "పుణ్య ప్రబంధములు" అను ప్రయోగములు గాని యిక్కడ నిరుపయోగములు. నన్నెచోడ భోజరాజులయొక్క ఈ రెండు పద్యములు ఎఱ్ఱన్న హృదయమును ఆకట్టుకొని యుండునని భావింపవచ్చును. అందునను భోజుని శ్లోకమే యాతనికి ప్రమాణమైనట్లు స్ఫురించు చున్నది. ఇందలి ప్రథమ పాదములోని "సూక్తి" అనుమాట సూక్తి వైచిత్రికి, తృతీయ పాదమంతయు "కవీంద్రకర్ణపుట పేయముగాన్" అన్న వాక్యమునకు, చతుర్థపాదమందలి "ప్రబంధరచనా" అన్నది, 'ప్రబంధరచనా ప్రావీణ్యముగాన్' అన్న వాక్యమునకు, మూల సూత్రములుగ నున్నవని భావింపవలయును. నన్నెచోడుని పద్యమందలి "సూక్తి" అను మాటయు, "ప్రబంధము సద్రసబంధురంబుగాన్" అన్న వాక్యమును భోజుని మాటల నుండియే పుట్టినవని తలపవచ్చును. భోజుడు క్రి.శ. 1018 మొదలు 1060 వఱకు రాజ్యమును పాలించినట్లు తెలియుచున్నది గనుక ఇంచుమించు, 11వ శతాబ్దిలో 75 సంవత్సరములుండినట్లు అనుకొనవచ్చును. భోజుడు ఎఱ్ఱన్నకు స్ఫూర్తిదాత యనుటకొక ఊహ స్ఫురించుచున్నది. అతడు రామాయణ చంపువులో బాలకాండ మొదలుకొని సుందరకాండము వఱకు మాత్రమే వ్రాసి మరణించినాడు. పిమ్మట కొంతకాలమునకు లక్ష్మణసూరి యను కవి యుద్ధకాండను రచించి ఆ రామాయణమును సమగ్రముచేసెను. సూరి, భోజుని తన గురువుగా నుతించి రచనకు పూనుకొనినాడు, "చేతఃస్నిహ్యతి తత్ర దేశిక పదాంభోజేచ భోజే మమ" అని అర్థశ్లిష్టోక్తితో ప్రస్తుతించినాడు. విశేషమేమన, సూరి, యుద్ధ

కాండను, భోజుని కవితారీతిలోనే వ్రాయుట! అట్లు వ్రాసి తన గ్రంథ భాగమునకు పండితామోదము లభింపగలదనియు ఆశించుట! ఈ వృత్తాంతమంతయు పునరావృత్తమైనదా అన్నట్లు ఎఱ్ఱన్న ఆరణ్యపర్వ శేష పూరణగాథలో నచ్చు గ్రుద్దినట్లుండుట చిత్రముగా తోచక మానదు! ఇదంతయు చెఱ్ఱన్నకు తెలియదనగలమా? రామాయణ చంపువునందలి కవిత్వమును పరామర్శించిన విమర్శకులు అందీ లక్షణములున్నవని పేర్కొనిరి: శబ్దచమత్కారము, సూక్తివైచిత్రి, బహువిధ వక్రోక్తి, ఊహాసౌందర్యము, భావచాలనము, అలంకార ప్రాచుర్యము, వ్యంగ్యచారుత్వము మొదలయినవి. (సాహిత్య ప్రబోధము : సాహితీ సదస్సు ప్రచురణ).

ఈ లక్షణములన్నియు ఎఱ్ఱన కవితలో, తత్రాపి, అరణ్యపర్వ శేషమున గమనింపవచ్చును. ఇట్లు పరిశీలించి చూడగా "ప్రబంధపరమేశ" బిరుదగత ప్రబంధ శబ్దముగాని, ఆతడన్యత్ర ప్రయోగించిన ప్రబంధ శబ్దములుగాని కావ్య సామాన్య వాచకములనుకొనుటయెట్లు? అట్లయిన, మనుచరిత్రాది గ్రంథములు గూడ ప్రత్యేక లక్షణ సంపన్న ప్రబంధ శబ్ద వాచ్యములుగాక కావ్యసామాన్య శబ్ద వాచ్యములు కావలసివచ్చును. ఈ ప్రబంధ ప్రక్రియకు ప్రత్యేక లక్షణ గ్రంథములు లేకపోవుట వలన ఈ భేదమును ఇద మిత్థముగ నిర్ణయించుటకు వీలుగాకున్నది. ఆధునికులు చెప్పుచున్న ప్రబంధ లక్షణములు అవ్యాప్తి అతివ్యాప్తి దోషములు గలిగి ఏరెండు మూడు ప్రబంధములను గూడ సమన్వయ విధానముతో నొక్క కొలికికి తీసుకొని రాలేకపోవుచున్నవి. కావుననే ఇప్పటికిగూడ కొందరు మనుచరిత్రాది ప్రబంధములను కావ్యసామాన్యములుగనే భావించుచున్నారు. ఇన్ని శతాబ్దములకు పిమ్మట కూడ వస్తుస్థితి యిట్లుండ, ఎఱ్ఱన్న నాటికి మనుచరిత్రాదికము వంటి ప్రబంధములుండెనా? లేనప్పుడు "ప్రబంధపరమేశ" గత ప్రబంధ శబ్దమును కావ్య సామాన్యార్థముననే పరిగణింపవలయు గాని ప్రత్యేక ప్రక్రియా పరముగ భావించుటకు వీలులేదనుట సరికాదు.

## నృసింహ పురాణము ప్రథమ ప్రబంధము :

మఱి, ఎఱ్ఱనగారి యీ ప్రబంధ శబ్దము యొక్క ప్రత్యేక ప్రతిపత్తి ఏమిటి? అన్నది విచికిత్స! సంస్కృతమున వాల్మీకి వ్యాసుల మార్గము కంటె భిన్నముగ కాళిదాసుతో నొక క్రొత్త కావ్య మార్గమేర్పడినది. తెలుగున నన్నయ

తిక్కనల మార్గము కంటె భిన్నముగ నన్నెచోడుని కుమార సంభవముతో నొక క్రొత్త కావ్యమార్గ మేర్పడినది. ఈ విషయమున నన్నెచోడునకు మార్గ దర్శకుడు కాళిదాసునుట కాదనరాని సత్యము. సంస్కృతమున కాళిదాసుతో ప్రారంభమైన కావ్యమార్గము పరిణామక్రమమున భోజుని రామాయణ చంపువుతో ప్రబంధ మార్గమును సంతరించుకొన్నది. తెలుగున నన్నెచోడుడు త్రొక్కిన కావ్యమార్గము పరిణామ క్రమమున ఎఱ్ఱన నృసింహ పురాణముతో ప్రబంధ మార్గమును పట్టినది. ఎఱ్ఱన, నృసింహ పురాణము దేనికిగాని అను వాదము గాదు! స్వతంత్ర ప్రబంధము. వస్త్వైక్యము గలది. వర్ణనాప్రధాన మైనది. రసభరితమైనది, పంచాశ్వాస పరిమితమైనది. సుమారు ఎనిమిది వందల పద్యగద్యములు గలిగి సర్వవిధముల ఆకృతియందును, కుదింపునందును మను చరిత్రాది ప్రబంధములకు నొజ్జబంతిగ నున్నది. నాయికానాయకుల విషయ మున మాత్రము అర్వాచీన ప్రబంధములకు భిన్నముగ నున్నమాట మాత్రము వాస్తవము. ప్రబంధ లక్షణములలో నిట్లొక లక్షణమున కిట అవ్యాప్తి దోషము పట్టినది. ఇది ప్రారంభ ప్రబంధముగదా? ఇట్టి అవ్యాప్తి, అతివ్యాప్తి దోషము లకు తక్కిన ప్రబంధములుగూడ గుఱియగుచునే యున్నవి. ప్రబంధ లక్షణములలో కచ్చితముగ నంగీకరింపవలసిన మొదటి లక్షణము అది అను వాదము కారాదు, స్వతంత్రమై యుండవలెనన్నది. అప్పుడు నన్నెచోడుని కుమార సంభవము, శ్రీనాథుని శృంగార నైషధము; పినవీరుని శృంగార శాకుం తలము ప్రక్కకు తొలగిపోవును; నృసింహముతో ప్రారంభమైన ప్రబంధప్రక్రియ కప్పదాటుతో మనుచరిత్ర కడకు వచ్చును. ప్రబంధ ప్రక్రియకు తిన్ననైన, ఏకాకారమైన నొక సూటి మార్గమేర్పడును. ఈ మార్గమునకొక సమగ్రమైన లక్షణ గ్రంథమేర్పడవలయును.

ఇంత చెప్పినదానికి సారాంశమేమన నృసింహ పురాణము ప్రథమాంధ్ర ప్రబంధమనవచ్చును. ఇట్టి అస్తిత్వమును సూచించుట కొఱకే ఈ ప్రబంధమున పలుమారులు, పలువిధముల ప్రబంధ శబ్దము ప్రయోగింపబడినది. నృసింహ రచనకు పూర్వరంగము అరణ్యపర్వ శేషము. ఇందు సమగ్రమగు ప్రబంధ లక్షణములు లేకపోవచ్చును గాక, ప్రబంధాంకురము లున్నవని యంగీకరింపక తప్పదు. దీనిని బట్టియే యాతడు "ప్రబంధపరమేశుడై"నాడు. దానిని సార్థక మొనరించుకొనుటకు నృసింహమును సంతరించినాడెఱ్ఱన. ఆ వరుసలో, పిమ్మట

మనుచరిత్రాదికములు వెలవడినవి. మొత్తముమీద, ఎఱ్ఱనగారి యీ బిరుదము కావ్య సామాన్యార్థమున వాడబడుచున్న ప్రబంధ శబ్దమునకొక తళుకును సంతరించి ఒక ప్రత్యేకమైన అస్తిత్వమును సమకూర్చినది. పెద్దన్నకు మార్గదర్శకమైనది. ఆ విషయమును పరామర్శింతము.

## మనుచరిత్రలో పూర్వ కవిస్తుతి :

పెద్దన మనుచరిత్ర పీఠికయందు పూర్వ కవిస్తుతిలో సంస్కృత కవుల నిట్లు స్తుతించెను :

మ॥ వనజాక్షోపము వామలూరు తనయున్ ద్వైపాయనున్ భట్టబా
ణుని భాసున్ భవభూతి భారవి సుబంధున్ బిల్హణున్ గాళిదా
సుని మాఘున్ శివభద్రు మల్హణ కవిం జోరున్ మురారిన్ మయూ
రుని సౌమిల్లిని దండి బ్రస్తుతులఁ బేర్కొందున్ వచశ్శుద్ధికిన్

—పద్యం : 7

తెలుగు కవుల నిట్లు స్తుతించెను :

ఆ॥ వ్యాస రచిత భారతామ్నాయమాంధ్ర భా
షగ నొనర్చి జగతిఁ బొగడుఁ గనిన
నన్నపార్యుఁ దిక్కనను గృతకృతు శంభు
దాసు నెఱ్ఱ సుకవిఁ దలఁతు భక్తి

—పద్యం : 8

ఇచ్చట గ్రహింపవలసిన ముఖ్య విషయమేమన దాదాపు ఇరువదిమంది సంస్కృత కవులను ప్రస్తుతించినవాడు తెలుగు కవులలో కవిత్రయమును మాత్రమే స్తుతించి తక్కిన వారిని త్రోసి రాజనుట ! నాచనసోమన, శ్రీనాథ, పోతన, పినవీరనవంటి మహాకవులేమైనట్లు! ఇది ఆశ్చర్యములలో కెల్ల నాశ్చర్యము! ఎఱ్ఱన తన గ్రంథములలో నన్నయ తిక్కనలను మాత్రమే నుతించెను; ఆ వరుసలో పెద్దన్న కూడ నన్నయ తిక్కన యెఱ్ఱనలను మాత్రమే స్తుతించె నను కొనవచ్చునేమో మఱి ! కవిత్రయములో కూడ నెఱ్ఱన్నను నిజనామముతోనే గాక బిరుద నామముతోకూడ స్తుతించి 'సుకవి' అన్న విశేషణమును కూడ తగిలించుటను బట్టి ఉత్కృట ఏకతర కోటిగ పెద్దనార్యునకు ఎఱ్ఱనార్యుని పై గల గౌరవాదరములను సూచించుచున్నది.

## నృసింహ మనుచరిత్ర పీఠికల పోలిక :

ఎఱ్ఱనార్యుని నృసింహ పురాణ పీఠికను పఱవడిగా పెట్టుకొని పెద్దనార్యుడు మనుచరిత్ర పీఠికను సంతరించినాడనుట నిక్కము. ఈ రెండింటిని పోల్చి చూతము :

నృసింహ పురాణమున తాతయెఱ పోతసూరి ఎఱ్ఱన భావమున నావిర్భవించును ! వ॥ "మదీయ భావంబున నావిర్భావము నొంది సదయానంద మధుర వాక్యంబుల నన్ను నిట్లని యనుగ్రహించె"(16)

ఉ॥ ఉన్నత సంస్కృతాది చతురోక్తి పథంబుల కావ్యకర్తవై
యెన్నికమైఁ బ్రబంధ పరమేశుఁడనంగ నరణ్య పర్వ శే
షోన్నయ మంధ్ర భాష సుజనోత్సవ మొప్పగ నిర్వహించి తా
నన్నయ భట్ట తిక్క కవినాథుల కెక్కిన భక్తి పెంపునన్ 17

క॥ గురుభజన పరాయణుఁడవు
సరస బహుపురాణ ధర్మశాస్త్ర కథా వి
స్తర వేదివి వినయోదయ
భరితుఁడవతులాను భావ భవ్యుడవు మహిన్ 19

క॥ కావునఁ బ్రబంధ రచనా
ప్రావీణ్యము నీకు సహజ పరిణత సిద్ధం
బై వలసినయది యొక కృతిఁ
గావింప జగద్ధితముగా నేఁబనుతున్ 20

ఉ॥ శ్రీమదహోబలేశ నరసింహుడు నా ప్రియదైవతంబు మ
త్స్వామి తదీయ తీర్థ విభవంబునుఁ దన్మహితావతారమున్
నీ మధురోక్తి గుంభన మనీషులు మెచ్చగఁ బ్రస్తుతింపు నీ
కే మెయి సంభవించు నఖిలేప్సిత పుణ్యఫలోదయోన్నతుల్ 21

మనుచరిత్ర పీఠికలో శ్రీకృష్ణదేవరాయలు పెద్దన్నతో నిట్లు పలుకును :

క॥ భువన విజయాఖ్య సంస
ద్భవన స్థిత భద్రపీఠిఁ బ్రాజ్ఞుల గోష్ఠిన్
గవితా మధురిమ డెందము
దవులన్ గొలువుండి సదయతన్ ననుఁబల్కెన్ 1[illegible]

తే॥ సప్తసంతానములలోఁ బ్రశస్తిఁగాంచి
ఖిలము గా కుండునది ధాత్రిఁగృతియ కానఁ
గృతి రచింపుము మాకు శిరీష కుసుమ
పేశల సుధామయోక్తులఁబెద్దనార్య 14

క॥ హితుఁడవు చతుర వచోనిధి
వతుల పురాణాగమేతిహాస కథార్థ
స్మృతియుతుఁడవు నాంధ్ర కవితా
పితా మహుఁడ వెవ్వరీడు పేర్కొన నీకున్ 15

క॥ మనువులలో స్వారోచిష
మను సంభవ మరయ రససమంచిత కథలన్
వినవింపు కలి ధ్వంసక
మనఘ ! భవచ్చతుర రచన కనుకూలంబున్

—16

ఈ రెండు పీఠికల యందలి సమానాంశములు పూస గ్రుచ్చబడుచున్నవి :

1. ఎఱ్ఱపోతసూరి యెఱ్ఱన భావంబున నావిర్భావమునొంది సదయానంద మధుర వాక్యంబుల పలుకగా - రాయలు కవితామధురిమ డెందము దవులన్ గొలువుండి సదయతన్ పెద్దనతో పలికెను.

2. ఎఱ్ఱన తొల్లి చతురోక్తి పథములతో సుజనోత్సవ మొప్పగ నారణ్య పర్వ శేషమును రచించెను. ఇప్పుడా చతురోక్తులతోడను, మధురోక్తి గుంభనములతోడను, మనీషులు మెచ్చగ జగద్ధితము కొఱకు నృసింహ పురాణమును వ్రాయవలసి యుండగా - చతుర వచోనిధియైన పెద్దన తచ్చతుర రచనకనుకూలమైన మనుచరిత్రను శిరీష కుసుమ పేశల సుధామయోక్తులతో కలి ధ్వంసనముకొఱకు వ్రాయవలసి యుండును.

3. ఎఱ్ఱన "సరస బహుపురాణ ధర్మశాస్త్ర కథావిస్తరవేది" పెద్దన అతుల పురాణాగమేతిహాస కథార్థస్మృతి యుతుడు !

4. ఎఱ్ఱన ప్రబంధ పరమేశ్వరుడు. పెద్దన ఆంధ్ర కవితాపితామహుడు.

ఇట్లు ఈ పీఠికలకు బింబ ప్రతిబింబ భావము స్పష్టము. దీనినిబట్టి ఏమనుకొనవలయును ? ఈ మహనీయు లిర్వురూ చతురోక్తి మధురోక్తి పథ వర్తనులన్నది యిట ముఖ్యము.

ఈ పీఠికలయందున్న మఱొక ముఖ్యాంశమును కూడ గుర్తింపవలసి యున్నది :

ఎఱ్ఱనకు పూర్వులు 'ప్రబంధ' శబ్దమును ప్రయోగించిరే గాని 'మహా ప్రబంధ' శబ్దమును ప్రయోగించినట్లు కానరాదు. ఎఱ్ఱన పలుమాఱులు 'ప్రబంధ' పదమునేగాక రెండు మాఱులు 'మహాప్రబంధము' అనియు ప్రయోగించెను :

వ॥ ఇట్లు మహాప్రబంధ కల్పనా కుతూహలాయత్తంబగు చిత్తంబుతో నొక్కనాడు.........(14)

వ॥ ఈ నిశ్చయంబిట్టిది కావున బ్రహ్మాండాది పురాణోక్తంబయిన శ్రీ నరసింహావతారంబను పురాణంబుఁ దెనుంగు బాస ప్రకటింపవలయు నమ్మహా ప్రబంధంబునకు.........(27)

ఎఱ్ఱన ననుసరించియే కావలయును పెద్దన్న కూడ మనుచరిత్ర పీఠికలో సరిగా రెండుసారులు దీనిని ప్రయోగించినాడు :

వ॥ కావున మార్కండేయ పురాణోక్త ప్రకారంబునం జెప్పుమని కర్పూర తాంబూలంబు పెట్టినన్ బట్టి మహాప్రసాదంబని మోదంబున నమ్మహా ప్రబంధ నిబంధనంబునకుఁ బ్రారంభించితి.........(17)

వ॥ అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పఁబూనిన స్వారోచిష మనుసంభవంబను మహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన(8)

పెద్దన దీనిని ఆశ్వాసాంత గద్యలలో కూడ పొందుపఱచినాడు. ఎఱ్ఱన మాత్రమట్లు చేయలేదు. ఎఱ్ఱన "ప్రబంధ పరమేశ" బిరుదమును సైతము చేర్చ లేదు. పెద్దన తన ఆంధ్ర కవితా పితామహ బిరుదును కూడ చేర్చుట విశేషము. ఈ తారతమ్యమును ఈ మహాకవుల చిత్తవృత్తిని బట్టి కొంత నిర్ణయింప వచ్చును. మఱియు నిది కాలసరణిని బట్టియు, హేతుసరణిని బట్టియు ప్రబంధ ప్రక్రియా పరిణామ క్రమగతికి సూచనగా భావింపవచ్చును.

నృసింహ పురాణము సుమారు 845 పద్య గద్యలతో పంచాశ్వాస పరిమితి గలిగియుండ, మనుచరిత్ర దాదాపు 732 పద్య గద్యలతో షష్ఠాశ్వాస పరిమితమై, నృసింహమును పోలియున్నది. నృసింహము గాలవ మహర్షి తీర్థ యాత్రలతో ప్రారంభము కాగా మనుచరిత్ర ప్రవరుని తీర్థయాత్రలతో ప్రారంభ మగును. మఱికొన్ని అంతర్గత విషయములను ఆ కుతూహలము గలవారు పరిశీలింపవచ్చును.

ఇప్పుడిక అరణ్యపర్వ శేషము యొక్క నీడలేవైన మనుచరిత్రలో గోచరించునేమో కనగొందము :

## మనుచరిత్రపై అరణ్యపర్వ శేష ముద్ర :

అంతఁబరమేష్ఠి చోదితమైన యొక్క
మారుతము నలిరేగి దుర్వార భంగి
విలయకాల విశృంఖల విపుల వారి
ధర చయంబుల నెల్లను విరియఁజేయు

—ఆరణ్య - ఆ. 4-249

మార్కండేయ మహర్షి ధర్మజునకు ప్రళయ ప్రకారమును తెల్పు ప్రకరణములోని పద్యమిది. పరమేష్ఠి యొక్క ఆజ్ఞానువర్తియగు మారుతము అతని ప్రేరణ చేత ప్రళయ సమయ మేఘ సమూహములను విరియజేయునని చెప్పబడినది. ఆ పిమ్మట,

క॥ ఆ మారుతంబుఁగ్రోలి పి
తామహుఁడెంతయును ఘోర తమమగు సలిల
స్తోమంబునందు నడుమం
దామరపై నిమర వోవుఁదర్దయు నెమ్మిన్ 250

ఆ మారుతమును పితామహుడు గ్రోలి ఆ జల సమూహములందు తామర పైన మిక్కిలి హాయిగ నిద్రించునట! ఆ తరువాత,

వ॥ "మదీయ నాభి కమల కర్ణికా శయనుండయి యున్న చతురాననుండు మేల్కొని సృజియించు లోకంబు లేర్పడ" (ఆ 4-వచనం : 281)

ఇవి మార్కండేయునకు బాలరూపుడైన నారాయణుడు చెప్పిన మాటలు. పరమేశ్వరుని యాజ్ఞానువర్తియగు మారుతము అట్లు విజృంభించిన ప్రళయ సమయ మేఘసమూహములను విరియజేయును. పిమ్మట దానిని పీల్చుకొని బ్రహ్మ శ్రీమహావిష్ణువు యొక్క నాభికమలమున నిద్రించి కొంతకాలమునకు మేల్కాంచి మఱల యీ జగత్తును సృష్టించును అన్నది యిచ్చటి కథాక్రమము.

క॥ మృగమద సౌరభ విభవ
ద్విగుణిత ఘనసార సాంద్ర వీటీ గంధ
స్థగితేతరపరిమళమై
మగువ పొలుపుఁదెలుపు నొక్క మారుతమొలసెన్

—మనుచరిత్ర : ఆ. 2-24

కస్తూరి, పచ్చకర్పూరము మొదలగు పరిమళ ద్రవ్యములు కలిసిన పీటికా గంధము, ఇతర సువాసనలను కప్పిపుచ్చగా మగువ పొలుపు దెలుపు నొక్క మారుతము అల్లన వీచెను.

మ॥ అత డావాత పరంపరా పరిమళ వ్యాపార లీలన్ జనా
న్వితమిచ్చోటని చేరబోయి కనియెన్ విద్యుల్లతావిగ్రహన్
శతపత్రేక్షణఁజంచరీక చికురన్ జంద్రాస్యఁజక్రస్తనిన్
నతనాభిన్ నవలా నొకానొక మరున్నారీ శిరోరత్నమున్

—ఆ. 2-25

ప్రవరుడా సుగంధ భరిత మారుతము వచ్చు వాలునుబట్టి యిది ప్రజలుండు స్థానమని భావించి యచటికిపోయి ఒకానొక స్త్రీ రత్నమును చూచును ఆమె వరూధిని. వారిరువురకు కొంత సంభాషణ జరిగి రసాభాసమగును. పిమ్మట వరూథినీ మాయాప్రవరుల సంగమము జరుగును. స్వారోచిషమనుసంభవ మగును. అనగా సృష్టి జరుగును.

ఈ రెండు సందర్భములందలి కథాంశములు పూర్తిగా భిన్నములయినవి. అరణ్యపర్వము నందలి కథాంశము ప్రళయ ఘట్టమున కొన్ని పద్యములకు మాత్రమే పరిమితమైనది. మనుచరిత్రయందలి కథాంశము ప్రణయఘట్టమున బహుసంఖ్యాక పద్యములకు విస్తృతమైనది. కాని తమతమ నెలవులందు శ్లే

ఉదాహరింపబడిన పద్యములు మిక్కిలి కీలకములయినవి. బాహ్యదృష్టికి కథాంశముల తీరు భిన్నముగ కానించినను తాత్త్వికమగు ప్రాతిపదిక సమాన ధర్మము గలది. ఒకచోట ప్రళయము సృష్టి, మఱొకచోట ప్రణయము సృష్టి రెండు చోట్లను మారుతమున్నది; ఉండవలయును. కాని, దీని ప్రయోజనము అక్కడ గాని, ఇక్కడగాని ఒక దశవఱకు కొంత మాత్రమే. ఎఱ్ఱన 'ఒక్క మారుతము సలిరేగి' అని వ్రాయగా, పెద్దన 'ఒక్క మారుత మొలసెన్' అని వ్రాసినాడు. ఈ కట్టుబడిలో గోచరించు బింబ ప్రతిబింబ భావమును బట్టి పెద్దనపై నెఱ్ఱన ముద్ర యున్నదనుకొనవచ్చును. నిరలంకృత మనోహరమైన ఎఱ్ఱన పద్యమునందు ప్రబంధ బీజములున్నవి. కావ్య లింగముతో సాలంకృత మనోహరమైన పెద్దన పద్యమునందు ప్రబంధ కోరకములున్నవి. వారిధరచయములను విరియజేసిన మారుతమును పితామహుడు పీల్చుకొని, పిమ్మట సృష్టి గావించినట్లు, మగువ పొలుపును తెలుపు మారుతమును బట్టి పోయిన ప్రవరుడు పిమ్మట సృష్టికి కారణమైనట్లు, ప్రబంధ పరమేశ్వరుని ప్రబంధపు పొలుపును ఆఘ్రాణించిన ఆంధ్రకవితా పితామహుడు పారిభాషిక ప్రబంధ సృష్టికి కారణభూతుడయినాడన్నచో నది వట్టి చమత్కారము మాత్రమే గాక వాస్తవమే యగుచున్నది!

అరణ్య పర్వశేషమున చతుర్థాశ్వాసములో, పరిక్షితుడను రాజు కథ గలదు ఇది మొత్తము పదిహేడు పద్యగద్యాలలో నిముడ్చబడినది. ఎఱ్ఱనకు దక్కిన భారతభాగము నందలి కథలలో అచ్చమైన శృంగార కథయని చెప్పదగినది యిదొక్కటే. మూలానుసారముగ అనువదింపబడినది. అయినను రసభరిత మొనర్చినాడెఱ్ఱన. అతడు తలచుకొన్నచో ఎన్నో పద్యములతో, వర్ణనలతో పెంచి ఒక చక్కని ప్రబంధ ప్రాయకథగ వ్రాసియుండవచ్చును. కాని మిక్కిలి సంయమనముతో యథాతథముగ చిన్న కథగా దిద్దితీర్చినాడు.

ఈ పరిక్షితుడు మృగయారతుడై ఒకనాడు అడవికిపోయి పెక్కు మృగంబుల వధియించుచు గ్రుమ్మరువాడు ఒక్కయెడ పూవులు కోయుచున్న సుశోభన యను సుందరిని జూచి మోహితుడయ్యెను. ఇపట్టున యెఱ్ఱన వ్రాసిన యీ వరుస పద్యములిట్లున్నవి ప్రతిపాద్యాంశము యొక్క స్పష్టప్రతిపత్తి కొఱకు ముట్టంకింపబడుచున్నవి :

ఆ॥ మదభరాభిరామ మృదుల యానంబొప్పఁ
నల్లబొలయుచును లతాంతరములఁ
గరము లీలఁగమ్మ విరులు గోయుచునున్న
పువ్వుఁబోఁడి నొక్క పొలఁతిగనియె 321

క॥ కనియంతఁగడిసి యాకా
మిని యొప్పులు చూడ్కిఁదగుల మీరిన తమకం
బున ననిమిష లోచనుఁడై
జన నాథుఁడు మదన బాణ సంహతిఁదూలెన్ 322

వ॥ అదియును నతి సుందరంబైన తదీయ మూర్తివిభవంబునకు మెచ్చి సాభిప్రాయముగా నవలోకించె; నంత నమ్మహీకాంతుఁడక్కాంత కిట్లనియె.

ఉ॥ ఎవ్వరి దానవంబుజ దళేక్షణ! యేకత మిట్టులేల నీ
వివ్వన భూమియందుఁ జరియించెదు! నావుడుఁదండ్రి పంపునం
దివ్వన భూమియందుఁ జరియించెద సద్వరుఁగోరి కన్య నే;
నెవ్వరి దానఁగావఁయు? నేర్పడఁజెప్పుము రాజనందనా! 324

వ॥ "అనిన దాని ప్రగల్భవచనంబులకు నధిక విలోలుండై భూపాలుండు దన యభిలాషం బెఱింగించిన నమ్మగువ "నన్నెన్నండును జల విహారంబునకు జొనుపకుండునది; యట్లయిన నిన్ను వరియించెద" ననిన వాడును దత్సమయం బున కొడంబడి దానిందోడ్కొని పురంబునకుం జనుదెంచి యిష్ట సుఖ తత్పరుం డయి యుండె; నంతనొక్కనాడు శరత్సమయంబు నందు" -325

ఎఱ్ఱనార్యుని యొక్క ఈ సన్నివేశ నిర్వహణమును చూచియే పెద్దనా ర్యుడు మనుచరిత్రలో వరూథినీ ప్రవరులు తొలుత పరస్పరము చూసుకొన్న ప్పటి సన్నివేశమును నిర్వహించినాడనుట నిస్సందేహము. కానీ కొంత భేద మున్నది. ఇది నాయికానాయకులకు పరస్పరానురాగమున్న ఘట్టము. అది ఏక త్రైవానురాగమున్న ఘట్టము. రసాభాసమునకు ఉదాహరణ భూతము. ఇది మిక్కిలి కుఱుచనైనది. అది మిక్కిలి విస్తృతమైనది. ఈ తారతమ్యమును దృష్టియందుంచుకొని ఉభయ ఘట్టములను పరిశీలించుట న్యాయమ్ము;

అట్లు మగువ పొలుపు తెలుపు నా మారుతము ననుసరించి పోయిన ప్రవరుడు అక్కడ వరూథినిని చూచెను. ఆమెయు వానిని చూచినది :

ఉ॥ చూచి ఝళంఝళత్కటక సూచిత వేగ పదారవిందయై
లేచి కుచంబులన్ దుఱుము లేనడు మల్లలనాడనయ్యెడన్
బూచిన యొక్క పోకనునుబోదియ జేరి విలోకన ప్రభా
వీచికలన్ దదీయ పదవీ కలశాంబుధి వెల్లిగొల్పుచున్

—మను. - ఆ. 2-29

ఈ పద్యము యొక్క కూకటివేళ్లు ఎఱ్ఱనగారు సుశోభనను వర్ణించిన "మదభరాభిరామ మృదుల యానం బొప్ప" అన్న పద్యమునందున్నవి. పరిక్షితుడు సుశోభనను, ప్రవరుడు వరూథినిని చూసినప్పుడు, ఆ నాయికల యొక్క తత్కాల స్థితిగతి విచేష్టితము లిట్లున్నవి :

| సుశోభన | వరూథిని |
|---|---|
| 1. కరము లీల కమ్మవిరులు గోయు చున్నది. | "క్రమ కర పంకరుహరత్నకటక ఝణంఝణ స్ఫూర్తి తాళమానములు గొలుప నింపు దళుకొత్త వీణ వాయించుచుండినది" ఆ. 3 - పద్యం 127 |
| 2. మదభరాభిరామ- అనగా కచకుచ జఘన భారముచేత అభిరామయనుట. | కుచంబులన్ దుఱుము లేనడుమల్లలనాడ. |
| 3. మృదుల యానం బొప్ప | వేగ పదారవిందయై |
| 4 అల్ల బొలయుచు లతాంతరముల | పూచిన యొక్క పోక నునుబోదియ జేరి. |
| 5. ఈమె పరిక్షితుని చూసినదో లేదో పద్యమున వాచ్యముగ చెప్పబడలేదు. కాని ఈమె టక్కరియగు విలాసవతి యని తరువాతి పద్యములలో నొక చోట వ్యక్తమగును. కాగా, చూడ లేదనుకొనుట యెట్లు? ఇక్కడ ఇదొక గొప్ప వ్యంగ్య వైభవ మున్నది. | విలోకన ప్రభావీచికలన్ దదీయ పదవీ కలశాంబుధి వెల్లిగొల్పుచున్; ఇచ్చట నిది వాచ్యముగ నున్నది. |

ఎఱ్ఱన పద్యము నిరలంకృత మనోహరమై ధ్వని కక్ష్యలో రసస్ఫూర్తిని కలిగించుచున్నది. పెద్దన పద్యము సాలంకృత మనోహరమై (పరిణామాలంకారము) వాచ్యకక్ష్యలో రసస్ఫూర్తిని కలిగించుచున్నది. ఎఱ్ఱన పద్యము ఆటవెలదిలో నుండుట గొప్ప ఛందశ్శిల్పమునకు నిరూపకముగ నున్నది. పెద్దన పద్యము ఉత్పలములో నుండుటయు నట్టి శిల్పమునకు తార్కాణముగ నున్నది. సుశోభన ఆటవెలది ! వరూథిని ఉత్పలగంధి !

సుశోభన తొలుత పరిక్షితుని చూసిన విషయము ధ్వని కక్ష్యలో సూహింపబడినది. మలుత మాత్రము ఆతడామెను కదిసి అనిమిషలోచనుడై చూసి మదన బాణసంహతి దూలినప్పుడు :

వ॥ "అదియును నతిసుందరంబైన తదీయమూర్తి విభవంబునకు మెచ్చి
సాభిప్రాయంబుగా నవలోకించె, నంత నమ్మహీకాంతుడక్కాంతకిట్లనియె"

అని చెప్పబడినది.

ఎఱ్ఱనగారి యీ వాక్యమునకు విస్తరణయే కావలయును, పెద్దనగారు, వరూథిని ప్రవరుని సాభిప్రాయముగా తనివిదీర చూసిన విధమును తొమ్మిది పద్యములలో రసవత్తరముగ వర్ణించినాడు. (పద్యములు 30-38) ఇట్లు చూసి చూసిన వరూథిని ప్రవరునకు "అడ్డంబు నిల్చిన నయ్యచ్చర జూచి చేర జని పల్కెన్ వాడు విభ్రాంతుడై" పద్యం : 38

పరిక్షితునకు సుశోభనకు ప్రశ్నోత్తర రూపమున జరిగిన సంభాషణ పద్యమిది :

ఉ॥ ఎవ్వరి దానవంబుజ దళేక్షణ ! యేకత మిట్టులేల నీ
వివ్వన భూమి యందుఁజరియించెదు ? నావుడుఁ దండ్రి పంపునం
దివ్వన భూమియందుఁజరియించెద సద్వరుగోరి, కన్యనే
నెవ్వరి దానగా వలయు ? నేర్పడఁజెప్పుము రాజనందనా !

ఇందు మొదటి రెండు పాదములలో సాభిప్రాయ ప్రశ్న గర్భిత సంబోధనాద్యుక్తి వైచిత్రియు, తక్కిన రెండు పాదములలో సాభిప్రాయ సమాధానగర్భిత సంబోధనాద్యుక్తి వైచిత్రియు, యుగపదుద్భూత పరస్పరానురాగ ధ్వనితనాద్భుతా

నాయక హృదయభావ సమైక్యతకు స్ఫోరకమై పద్యమంతయు శిల్ప వైచిత్రీ భరితమగుచున్నది. దాని ప్రగల్భ వచనములకు నధిక విలోలుడైనాడట రాజు. ప్రబంధ పరమేశ్వరుని ప్రగల్భ వచనముల సేవకు మనము కూడ ముగ్ధులము గాక తప్పదు !

ఇప్పుడీ పద్యమును ఆంధ్ర కవితా పితామహు డనుకరించిన తీరును గమనింపుడు :

ఉ॥ ఎవ్వతెవీవు భీతహరిణేక్షణ ! యొంటిఁజరించెదోటలే
కివ్వనభూమి భూసురుడనేఁ బ్రవరాఖ్యుఁడఁద్రోవ దప్పితిన్
గ్రొవ్వున నిన్నగాగ్రమునకున్ జనుదెంచి పురంబుఁ జేరని
కెవ్విధిఁగాంతుఁ దెల్పగదవే తెరువెద్ది శుభంబు నీకగున్ —39

ఈ పద్యము యొక్క యెత్తుగడ, కట్టుబడి, కొన్ని పదముల కూర్పు, అచ్చముగ పై పద్యము వలెనున్నది !

దీనికి వరూథిని చెప్పిన సమాధాన పద్యమిది :

ఉ॥ ఇంతలు కన్నులుండఁ దెరువెవ్వరి వేడెదు భూసురేంద్ర యే
కాంతమునందు నున్న జవరాండ్ర నెపంబిడి పల్కరించు లా
గింతియఁగాక నీవెఱుగవే మును వచ్చిన త్రోవచొప్పు నీ,
కింత భయంబు లేకడుగ నెల్గిదమైతిమి మాటలేటికిన్ 41

ఎఱ్ఱన పద్యమున "నేనెవ్వరి దాన గావలయు ! నేర్పడ జెప్పుము" అని కన్యక ప్రశ్నించినది. ఈ పద్యమున "నీవెఱుగవే మును వచ్చిన త్రోవచొప్పు" "మాటలేటికిన్" అని వరూథిని ప్రశ్నించినది. ఈ రెండునూ నర్మగర్భితము లయిన కమ్మని బూకరింపులే !

ఇచ్చట గ్రహింపవలసినదేమన, ఎఱ్ఱన ఒకే పద్యమున ఉక్తి ప్రత్యుక్తులను కూర్పగా, పెద్దన ఉక్తికొక పద్యమును, ప్రత్యుక్తికి మఱొక పద్యమును వ్రాసినాడు. ఎఱ్ఱన పద్యము ఉత్పలమాలికలో నున్నది పెద్దన పద్యములు రెండును ఉత్పలమాలికలోనే యున్నవి

డాక్టర్ పల్లాదుర్గయ్యగారు తమ "ప్రబంధ వాఙ్మయ వికాసము" అను సిద్ధాంతగ్రంథమున "పెద్దనామాత్యులపై పూర్వకవుల ప్రభావము" అన్న

ప్రకరణమున అరణ్యపర్వ శేషమునుండియు, నృసింహ పురాణము నుండియు కానవచ్చు కొన్ని యనుస్మృతులను మనుచరిత్రలో చూపించినారు. అరణ్యపర్వ శేషమునకు సంబంధించినంత వఱకు నచటి ద్రౌపదీ సైంధవుల సంభాషణల ముద్రలు ఇచట వరూథినీ ప్రవరుల సంభాషణలోనున్న వైనమును ఉదాహరించి యున్నారు. నన్నయనుండి ఒక్క యనుస్మృతిని చూపించిరిగాని తిక్కనవి యసలే పేర్కొనకపోవుట గమనింపవలసి యున్నది. (పుటలు : 380, 81)

ఇదిట్లుండ కొన్ని తావులందు ఎఱ్ఱనార్యుని పద్య రచనా విధానమును దృష్టియందుంచుకొని, యందలి పదములను, పదబంధములను పరిగ్రహించి పెద్దనార్యుడు తన పద్యములను నిర్మించుకొన్న పట్టులుకూడ కన్పించుచున్నవి. మచ్చునకు మూడు సందర్భములుదాహరింపబడుచున్నవి :

ఎఱ్ఱన పద్యము :

1. సీ॥ అతడును దద్భావ మరయంగ మదిఁగోరి
రూపించి యిటఁబోయి రేపవత్తు
ననిపోయి నడికిరేయర్ధితోఁ జనుదెంచు
రేయి వచ్చెదనని రేపవచ్చు
నే ప్రొద్దు వచ్చిన నింతి యప్పుడ భక్ష్య
భోజ్యముల్ గొత్రపొల్పుగ నొనర్చు
నెయ్యది గోరిన నిచ్చకు రాఁబెట్టు
నలయదు మఱనైన నలుగ దెపుడు"

ఆరణ్య. ఆ-7-323

కుంతి దుర్వాసునకు పరిచర్య సేయు సందర్భములోని పద్యమిది. ఇందలి 'నడికి రేయి' 'భోజ్యముల్' 'పెట్టు' 'అలయదు' మొదలగు పదములను పరికింపుడు.

పెద్దన పద్యము :-

తే॥ వండనలయదు వేవురు వచ్చిరేని
నన్నపూర్ణకు నుద్దియౌ నతని గృహిణి
యతిథులే తేర నడికి రేయైనఁ బెట్టు
నలయు భోజ్యంబులింట నవ్వారిగాగ

మను. ఆ-1 : 56

ఆ పదములన్నియు నిందున్నవి గదా !

2\. తే॥ ఒక్కమను జాథముండు మ్రొక్కో యనంగ
నన్నుఁజెఱఁగొని పోయెడు నన్నలార !
యెవ్వరిట విడిపింపరే యింతవట్టు
పుణ్యమునఁ బోవరయ్య కారుణ్య బుద్ధి

ఆరణ్య - ఆ. 5-177

కేశియను దానవుడు దేవసేనను బలాత్కరించి యెత్తుకొని పోవునపుడు ఆమె ఆర్తనాదము చేయు పద్యమిది. (అది విని యింద్రుడు ఆమెను రక్షించును.)

కం॥ ఆవిపినాంతరమున హా
హా వనిత ననాథ నబల నార్త విపన్నన్
గావరె యీ పుణ్యమునం
బోవరె యని పలుకు నాదు మొఱ వినఁబడియెన్

మను : ఆ. 4-66

ఒకానొక రాక్షసుడు మనోరమను వెంటాడి పీడించుచున్నప్పుడు ఆమె ఆర్తనాదము చేయు పద్యమిది (ఇది విని స్వరోచి యీామెను రక్షించును.)

ఈ రెండింటిలోనూ కానవచ్చు సమాన వాక్యములు గమనార్హములు.

విడిపింపరే యింత వట్టు పుణ్యమున బోవరయ్య..............ఎఱ్ఱన
కావరె యీ పుణ్యమునం బోవరె.............................పెద్దన

3\. క॥ ఒడలెల్లఁబిండి కూడుగఁ
బొడిచి, యెగయ నెత్తి, త్రిప్పి భూస్థలి మీదన్
బడవైచి, యురము మొగమును
నడిచెను పదముడి తల ప్రహార కుశలుడై

—ఆరణ్య, ఆ. 6 - 248

భీముడు సైంధవునకు ఇట్లు బుద్ధి చెప్పిన పద్యమిది. ఇందు "పిండికూడు" అన్నది ఎఱ్ఱనగారి శబ్దవైచిత్రికి నుదాహరణముగ నున్నది !

తే॥ ఒండొకఁడవైన నిపుడ నీ పిండి యిడమె
బ్రాహ్మణుఁడ వౌట మాచేతఁ బ్రతుకు గంటి
తడవఁబని లేదు నిన్ను గౌతముని గోవ
యనుచు వాదించి విడిచిన నా గ్రహించి

—మను. - ఆ. 4-90

ముసలి ముని మనోరమను నాగబెత్తముతో కొట్టినప్పుడు కోపించిన యామె చెలికత్తెలు నా మునితో పలికిన పలుకులివి. ఇందు "నీ పిండి యిడమె"- నీ దేహము పిండిచేయమా! అని యర్థము. ఇది ఎఱ్ఱనగారి "పిండి కూడు"నకు సమానముగ నున్న పదమని గ్రహింపగలము. మచ్చునకు మూడు పట్టులు ఉదాహరింపబడినవి. ఇంకను కోకొల్లలుగ నున్నవి. సమాన సందర్భములందు ఇట్టి యనుసృతులుండుట సామాన్యమే యనియు వీనిని విశేషముగ భావించు టుచితము కాదనియు ననుకొనరాదు. ఏలయన, ఇప్పటివఱకు అనేక ఘట్టము లుదాహరింపబడినవి. ఆ క్రమములో చూసినప్పుడు ఇది కావలయుననియే పెద్దన ఎఱ్ఱన్నను అనుసరించినట్లు స్పష్టపడగలదు.

మఱొక్క విషయము : ఎఱ్ఱనార్యుని అరణ్యపర్వ శేషమునందలి కథల నన్నింటిని మార్కండేయుడు ధర్మజునకు వినిపించును. పెద్దనార్యుని స్వారో చిష మనుసంభవ కథను ధర్మపక్షులు మార్కండేయుడు క్రోష్టికి చెప్పిన ప్రకా రమున జైమిని మునికి వినిపించును. ఈ రెండింటియందును సామ్యమును పరిశీ లింతము!

## అరణ్యపర్వ శేషము :

శ్రీకృష్ణుడు సత్యభామాసమేతుడై పాండవుల కడకు వచ్చును. ఆదే సమయమున మార్కండేయుడు కూడ నటకు వచ్చును. అప్పుడు శ్రీకృష్ణుడు మార్కండేయునితో నిట్లనును :-

ఉ॥ ఏనును బాండునందనులు, నిమ్మని ముఖ్యులు నిష్ఠ లోక స
మ్మానిత వాక్య! నీదయిన మంజుల వాగమృత ప్రవాహమున్
వీనులఁదోయి నించుచును వేడుకఁగ్రోలి కొనంగ నాత్మలం
బూనెద మస్మదీప్సితము పూర్ణము సేయగ నర్హమెమ్మెయిన్

ఆర. 4-168

కావున, ఆయా పుణ్యకథలను వినిపింపుమని కోరును. మార్కండేయుడు ధర్మజునకు కథలు చెప్పుట ప్రారంభించును. ఈ కథాకథన ప్రసంగము ఇంద్రుడు కర్ణుని కవచకుండలములను హరించు కథ వఱకు సాగి అక్కడ ముగియును. ఆ ముగింపు వాక్యమిది !

వ॥ అట్లు మార్కండేయు వలనఁ బుణ్యకథలు విని పాండవులనంతరంబ
క్రమ్మఱ ద్వైత వనంబున కరిగి.............. ఆ. 7-377

స్వారోచిష మను సంభవము :-

శ్రీకృష్ణదేవరాయలు పెద్దనార్యుని ఇట్లు కోరును :

వ॥ కావున మార్కండేయ పురాణోక్త ప్రకారంబునం జెప్పుము.........
పీఠిక - 17

పెద్దన కథాప్రారంభము చేసిన విధమిది :

వ॥ అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పం బూనిన............
జైమిని ముని......... అనవుడుఁబక్షులు మార్కండేయుండు క్రోష్టికిం
జెప్పిన ప్రకారంబున నిట్లని చెప్పందొడంగె 48

ఇందు ముగింపు పద్యమిది :

తే॥ అని మృకండు తనూభవుఁడనుఁగుఁ శిష్యుఁ
డైన క్రోష్టికి వినిపించినట్టి యీ క
థాసుధాధార నించిరి దయఁదలిర్ప
జైమిని శ్రుతి పుటముల శకుని వరులు -ఆ. 6-128

ఎఱ్ఱన కమ్మని పద్యముతో ప్రారంభించి చిన్న వచనముతో సామాన్యముగ ముగించినాడు. పెద్దన సామాన్యమగు వచనముతో ప్రారంభించి కమ్మని పద్యముతో ముగించినాడు. కాని ఇర్వురి పద్యములందున్న పోలిక గమనార్హము. ఎఱ్ఱన పద్యము బింబము; పెద్దన పద్యము ప్రతిబింబము.

మార్కండేయ మహర్షియే ఎఱ్ఱన పెద్దన్నలకు సంధాత. కావున ఎఱ్ఱన అరణ్యపర్వ శేషమును పెద్దన మనుచరిత్ర అనుసరించుటలో నాశ్చర్యము లేదు.

అప్పకవికి ఎఱ్ఱన్నపైనను, పెద్దన్నపైనను గాఢమగు గౌరవాదరము

లున్నట్లు తోచును. ఆతడు ఈ ఇరువురిని తలచుగ నిజనామములతో గాక "ప్రబంధ పరమేశ్వరుడు" "శంభుదాసుడు" "ఆంధ్ర కవితాపితామహుడు" అని బిరుద నామములతో పేర్కొనుచుండుట నన్నయ్యకు, ఈ యిర్వురకు దక్క తక్కిన వారికిట్టి గౌరవమును ఆతడిచ్చినట్లు కానరాదు.

## ప్రబంధ పరమేశ బిరుద సార్థక్యము :

ఇట్టి పరిశీలనము కావించిన పిమ్మటనే కాబోలు కీ. శే కందుకూరి వీరేశలింగముగారు : 'ప్రబంధ ధోరణిని భారతారణ్యపర్వ శేషమును చమత్కార బంధురముగ రచించుట చేత ప్రబంధ పరమేశ్వరుడను బిరుద నామము కలిగినది' అని అభిప్రాయపడిరి. —కవుల చరిత్ర

ఈ యభిప్రాయముతో నేకీభవింపక కీ. శే. వేదాల తిరువేంగళాచార్యులు గారు "భారత భాగములను ప్రబంధించినవాడు - ప్రబంధ పరమేశ్వరుడు" అని వ్రాకుచ్చిరి. -ఆంధ్ర మహాభారతోపన్యాసములు - పుట. 91

ఈ బిరుదమును గూర్చి డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యంగారు విపులముగ చర్చించిరి. అందుండి అక్కఅపడు మేరకు, వారి వాక్యములనే స్వీకరించి పూసగుచ్చినట్లు ఇట పొందుపఱచుచున్నాను :

"కావ్య ప్రబంధ శబ్దములు సమానార్థకములయ్యును వాని యందు శబ్ద వ్యుత్పత్తిని బట్టి కొంత భేదము నూహింపవచ్చును..... .........,......... ............................. ప్రకృష్టమైన బంధము గలది ప్రబంధము. ఇది కవిరచనా సామర్థ్యము వలన రూపుగట్టునది. కావ్య కళారహస్య కోవిదులు కవిత్వమున వస్తుకళను, భావకళను, రచనాకళను గుర్తించియుండిరి. ఇతిహాసాదులందు వస్తుకళకు ప్రాధాన్యము గలదు. కావ్యమున అది ఒక్కటి చాలదు. లోకోత్తర వర్ణనా నిపుణుడైన కవి కావ్యమున భావకళకు ప్రాధాన్యము కల్పించును. నన్నయ తిక్కనాదులు ఇతిహాసము నాంధ్రమున ననువదించుచు దానియందు భావకళకు ప్రాచుర్యము కల్పించిరి. దానివలన వారి రచనకు కావ్యగౌరవమబ్బినది. రచనాకళలో భావమును వెలువరించు పద్ధతికి ప్రాధాన్యముండును. అది కవి ప్రయోగించు పదములపైనను, వాక్యములపైనను ఆ రెండింటిని లోగొనిన శైలిపైనను దానికి నెలవైన ఛందశ్శిల్పముపైనను ఆధారపడియుండును. ఇందు భావ ప్రకటన

మున శబ్దముకంటె అర్థమునకు ప్రాధాన్యము కల్పించు విధమొకటియు అర్థము కంటె శబ్దమునకు ప్రాధాన్యము కల్పించు విధము మఱియొక్కటియు కానబడు చున్నది. నన్నయ తిక్కనాదులలో మొదటి విధమునకు చెందిన రచనాకళకును కొంత స్థానముగలదు నన్నయ తిక్కనలపై గల భక్తి పెంపున ఆరణ్యపర్వ శేషమును పూరించుటయే గాక వారు చూపిన త్రోవన కవితను వెలయించిన ఎఱ్ఱాప్రెగడ కవిత్వమున నట్టి కళకు విశిష్ట స్థానమును కల్పించెను. నన్నయ తిక్కనల కంటె ఎఱ్ఱాప్రెగడ రచనాకళలో ఒక అడుగు ముందుకు వేసెను. అందువలన నతడు ప్రబంధ పరమేశ్వరుడయ్యెను." "(ప్రబంధ పరమేశ్వరుడు" వ్యాసము, సాహితీ మంజూష, సారస్వత వ్యాస సంపుటి, కళాస్రవంతి ప్రచురణ.)

క్రీ॥ శ॥ 1500 లో "కవిలోక బ్రహ్మ" బిరుదాంచితుడైన పెద్దపాటి సోమయ తన "అరుణాచల పురాణము" నందు ఎఱ్ఱన్నను ఇట్లు స్తుతించెను.

"భావబంధ నిబంధ పరమేశ బిరుద ప్రశస్త్యు నెఱ్ఱయ్యశర్ము సన్నుతింతు." ఇందలి 'భావ' 'బంధ' శబ్దములు ఎఱ్ఱయ కవితలో డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యం గారు దర్శించిన భావకళకు, రచనాకళకు సూచకములుగా నున్నవని భావింప వచ్చును.

నన్నయభట్టు కావ్యరచనా నిధి దిక్కన సోమయాజి న
చ్ఛిన్నమహత్త్వ సంవిహిత శేముషి నెఱ్ఱయ ప్రెగ్గడన్ సము
త్పన్న నవ ప్రబంధ రసభావన నింపున బ్రార్థనాంజలుల్
మున్నుగ నాత్మలో దలతు మువ్వుర మువ్వుర బోలు పుణ్యులన్

-నిశ్శంక కొమ్మయ్య-వీరమాహేశ్వరము,
ప్రబంధ రత్నావళిలో నుదాహృతము.

ఇందు ఎఱ్ఱనకు వాడబడిన విశేషణము గమనార్హము. "నవ ప్రబంధ రస భావనన్". దీనినిబట్టి యేదో ఒక నూతనత్వమును సంతరింప వలయునన్న తహతహ ఎఱ్ఱన్నలో నున్నట్లు గోచరింపగలదు. దానికి అరణ్యపర్వ శేషమున బీజములు చల్లినాడు. నృసింహపురాణమున నారు మొలిపించినాడు. అది మను చరిత్రమున పల్లవించినది. అనంతర ప్రబంధములందు పుష్పించినది. ఇది!

"ప్రబంధ పరమేశ బిరుదము" అంతేగాని భారత భాగములను ప్రతిబంధించిన వాడు - ప్రబంధ పరమేశ్వరుడు అనుట అవిచార రమణీయము. ఆ యర్థమును సామాన్యార్థమున భావింపవచ్చునేమో గాని విశేషార్థమున దీనినిట్లు నిర్వచింపవలయును.

## ప్రబంధ పరమేశ బిరుద నిర్వచనము :

'వస్తుకళ భావకళ రచనాకళలను తరతమ భేద ప్రాధాన్యముతో సమన్వయించి వర్ణనాత్మకముగ నిబంధించుట ప్రబంధము ఈ ధోరణిలో భారతారణ్య పర్వ శేషమును చమత్కార బంధురముగ రచించుటచేత ఎఱ్ఱనకు ప్రబంధ పరమేశుడను బిరుద నామము కలిగినది.'



# శంభుదాస లక్షణాభిధేయము

చ॥ వలఱు జటాటవిం గుసుమ వల్లరులై చదలేటి నీటి నె
త్తలుల జనించు క్రొన్నురువు తండములై తలచుట్టు పాము మే
నలవుడు గుప్పసంపుఁ బొరలై చెలువారు శివేందు చంద్రికల్
నెలయఁగ బ్రోచుమున్ముఖ మనీషత కావ్యకళా కుముద్వతిన్

నృసింహ పురాణము-అవతారిక-4

ఎఱ్ఱనార్యుని ప్రబంధములందున్న దేవతాస్తుతి పద్యములలో తలమానిక మీ పద్యము. ఇది కేవలము అతని శివభక్తిని మాత్రమే వెల్లడించునదిగాక అతని శివభక్తికిని, కవితా తపస్సునకును తాత్త్వికమగు సంతస్వాతతను వ్యక్తము చేయు పద్యము. 'శివపదాబ్జ సంతత ధ్యాన సంసక్తచిత్తుడగు' నీతడు నృసింహ పురాణమువంటి అచ్చమైన వైష్ణవ ప్రబంధమును వ్రాయుట ఈతనికే చెల్లినది! ఈ విషయమున నీతడు 'సేవే శ్రీగిరి మల్లికార్జున మహాలిఙ్గంశివాలింగితమ్' అన్న నాలుకతోనే "లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్" అని స్తుతించిన శంకరులకు సాటి వచ్చువాడు! విష్ణుతత్త్వ ప్రతిపాదకమైన రఘు వంశమునందు 'వాగర్థా వివసంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే, జగతఃపితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ' అని నుతించిన కాళిదాసుకు సరిపోలినవాడు!

ఈతని ప్రబంధములన్నియు విష్ణుధర్మ ప్రశంసా పవిత్రములయినవే. తొలి ప్రబంధము రామాయణము లభింపదు. రెండవది అరణ్యపర్వ శేషము. ఇందలి చివరి పద్యమున 'శివపదాబ్జ సంతత ధ్యాన సంసక్త చిత్తుడ'ని మాత్ర మున్నది. మూడవది నృసింహము. ఇందలి యవతారికలో తాతయెఱ్ఱపోతసూరి మనుమని యిట్లు ప్రశంసించును.

గిరిశ పద భక్తి రసత,
త్పర భావము కలిమి శంభుదాసుండనగాఁ
బరగియు గోవింద గుణా
దర సంభృత సౌమనస్య ధన్యుడవెందున్ ఆ. 1-18

శంభుదాసుడను బిరుదనామము తొలుత నిచ్చుటనే తటస్థపడుచున్నది. ఈ ప్రబంధము నందలి ఆశ్వాసాంత గద్యమిట్లున్నది.

"ఇది శ్రీ శంకరస్వామి సంయమీశ్వర చరణ సరోరుహ ధ్యానానంద సౌందర్యధుర్య శ్రీ సూర్యసుకవిమిత్రసంభవ శంభుదాస లక్షణాభిధేయ యెఱ్ఱయ నామధేయ ప్రణీతంబైన లక్ష్మీనృసింహావతారంబను."

హరివంశము నాల్గవది. ఇందలి యవతారికలో ఎఱ్ఱయ తనను గూర్చి "పూజిత ధూర్జటి చరణాంబుజుడు" అని చెప్పికొనినాడు. ఆశ్వాసాంత గద్య నృసింహము నందువలె నున్నది. కాని "శ్రీ సూర్యసుకవి మిత్ర సంభవ" అని గాక 'శ్రీ సూర్యసుకవి సంభవ' అని మాత్రమున్నది. మిత్ర శబ్దములేదు.

## అరణ్యపర్వ శేష రచనవల్లనే శంభుదాస బిరుదము :

కృతుల యానుపూర్విని బట్టి యీ లక్షణాభిధేయము మొదటి రెండు ప్రబంధములలో లేదు. చివరి రెండు ప్రబంధములలో నున్నది. దీనినిబట్టి యిది అరణ్యపర్వ శేషరచన తరువాత వచ్చియుండునని భావింపవచ్చును. ఈ విష యము తరువాత నిరూపింపబడును. ఈ బిరుదము వచ్చిన విధమును గూర్చి కొందఱిట్లు భావించిరి! కీ. శే. నోరి నరసింహశాస్త్రిగారు - "ఈ లక్షణాభి ధేయము ఎఱ్ఱయకు గురువే ప్రసాదించి యుండును." అని సెలవిచ్చిరి. డాక్టర్ శ్రీమతి పి. యశోదారెడ్డిగారు - "ఎఱ్ఱనకు గల శివభక్తి విశేషము చేత జను లాతనిని శంభుదాసుడని యుందురు. రానురాను అదియే యాతని రెండవ పేరుగా మాఱినది." అని పేర్కొనిరి.[2] గురువు ప్రసాదించిన పిమ్మట ప్రజలలో ప్రచా రమునకు వచ్చి యుండును. లేదా ప్రజలలో ప్రచలితమైనప్పుడు గురువు శంఖున బోసిన తీర్థము చేసియుండును. ఎందరో కవులు పూర్వకవిస్తుతి చేయు నప్పుడు ఎఱ్ఱన్నను ఎక్కువగా నిజనామముతో గాక శంభుదాసుడు, ప్రబంధ పరమేశ్వరుడు అను బిరుదనామములతో స్తుతించినట్లు కాన్పించును. శంభుదాస బిరుదము కాళిదాస నామమును స్ఫురింపించుచు సంస్కృతమున కాళిదాసుకున్న స్థానమును తెలుగున శంభుదాసునకు సూచించుచున్నదని భావింపవచ్చును.

---

1. విజ్ఞాన సర్వస్వము - 3వ సంపుటము - పుట. 734
2. "ఎఱ్ఱాప్రెగడ" - ఉ. వి. వి. తెలుగుశాఖ ప్రచురణ - పుట. 7

**శంభుదాసు, కాళిదాసు :**

మారన మహాకవి కాలమునుండియు నన్నయ్యను వాల్మీకితోను తిక్కన్నను వ్యాసునితోను పోల్చుట పరిపాటిగా నున్నది. పరిశేష న్యాయమున శంభుదాసుని కాళిదాసుతో పోల్చవలయును. కాని ప్రాచీనులెవ్వరు కంఠోక్తిగ నట్లు పోల్చినట్లు కానరాదు. ఆధునిక యుగమున ఆ కొరతను తీర్చిన మహనీయులు కీ. శే. రాళ్ల పల్లి అనంత కృష్ణశర్మ, కీ.శే కాటూరి వేంకటేశ్వరరావుగారలు. వారిట్లు చెప్పిరి:

కీ. శే రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు "నృసింహపురాణ పాఠ పరిశోధన" అను తమ వ్యాసములో,[1] ఈ శంభుదాస లక్షణాభిధేయమును; కాళిదాస లక్షణాభిధేయముతో సమన్వయించి చెప్పిన విధానము మిక్కిలి సహేతుకముగను, చమత్కారజనకముగను నున్నది. :

"ఎఱ్ఱన నృసింహపురాణము కాళిదాసుని కుమారసంభవము వంటిది. ఆయన హరివంశము అతని రఘువంశమునకు సాటి. హరివంశము రఘువంశము వలెనే వేఱువేఱు కథల సంపుటి. నృసింహపురాణమువలె అనుస్యూతమైన ఒక కథ గల తీర్పు. హరివంశమను పాత పేరే నిలిపి రఘువంశముతో నామసామ్యమును కూడ సాధించినాడు ఎఱ్ఱన మఱి కుమారసంభవము వలె నృసింహ సంభవమని పేరుపెట్టక తన గ్రంథమునకు "లక్ష్మీ నరసింహావతారము" అని నామకరణము చేసినాడు. కారణము సంభవశబ్దముకంటె అవతారశబ్దము భగవంతుని విషయమున ఉచితతరమని భావించినాడేమో ! మఱి కాళిదాసుతో రూపసామ్యమును గూడ సూచించుచు శంభుదాసుడు అనునతని లక్షణాభిధేయము....

సుకుమారమైన ప్రేమతో నిండిన మధురహృదయము, మితినెఱిగిన చిక్కని యర్థభావములు, ధారాళమైనను కుదింపుగల ప్రసన్నమైనభాష, అసాధారణమైన వినయము, అపూర్వమై, కమనీయమైన కల్పన - ఇవి ఎఱ్ఱన్నను కాళిదాసుతో సాటికి దించునట్టి మహాకవి ధర్మాలు....నన్నయ తిక్కనలు హిమాలయ వింధ్య గిరులుగా నిలిచి నడుమ కౌగిలించుకొని కాపాడిన అరణ్యపర్వ శేషము చెదరక నిలిచి నడచివచ్చినది."

కీ. శే కాటూరి వేంకటేశ్వరరావుగారు తమ "సాహిత్య దర్శనము వ్యాసావళి" (ప్రచురణ - 1967) అను గ్రంథమునందు వ్రాసిన 'శంభుదాసుని

---

1 ఆంధ్రపత్రిక (వారపత్రిక) 1969-70 సౌమ్య సంవత్సరాది సంచిక, ఏఐది తొమ్మిదవ సంచిక, పుట. 137.

సాత్త్వికత' అన్న వ్యాసమున శంభుదాసుని కాళిదాసుతో పోల్చుచు కొంత విపులముగనే చర్చించిరి. వారు అక్కడక్కడ, విడివిడిగా, విస్తారముగ వెలి బుచ్చిన కొన్ని ముఖ్యములయిన అంశముల పిండీకృత సారాంశ మీ విధముగ నున్నది:

'ప్రాచీన సంస్కృతాంధ్ర కవులలో ననేకులు రజోగుణ ప్రధానులుగ కాన్పింతురు. పరమ సాత్త్వికులుగను, వినయోదయభరితులుగను కనుపట్టు వారు శంభుదాస కాళిదాసు లిరువురే. శంభుదాసు "మందః కవియశః ప్రార్థీ" అని వినయమును ప్రకటించుకొన్న కాళిదాసునకు సాటివచ్చువాడు. సాత్త్వికుడైన వాడు చేయుపని సంయమన ప్రధానముగ నుండును. ఈ సంయమనమే కావ్యమునకు ప్రాణమైన ఔచితిని సమకూర్చును. ఈ సంయమన మూలకమైన ఔచిత్యము కాళిదాసు సొమ్ము. మన కవిత్రయము వారు కూడ నట్టివారే. ఈ ముప్వురిలో ఎఱ్ఱన పరమ సాత్త్వికుడని యాతని యావద్గ్రంథము సాక్ష్యమిచ్చును."

## ఎఱ్ఱన ఇతర ప్రబంధములలో కానవచ్చు నాతని శైవము :

కాళిదాస కావ్యములలో నాతని శివభక్తికి ప్రధానమగు నిధానము కుమార సంభవము. శంభుదాసుని ప్రబంధములలో నట్టి ప్రత్యేకమైనది లేదు. కాని ప్రతి ప్రబంధములో అలతియో వలతియో శైవము ప్రతిపాదింపబడినది. లభించని రామాయణములోనిదిగ పరిశోధకులచే నూహింపబడి ఉల్లేఖింపబడుచున్న యీ పద్యము శంభుదాసుని శైవమునకు దృష్టాంతముగ నున్నది:

నిను సేవించినగల్గు మానవులకున్ వీటీ పఘాటీ ఘటీ
ఘనకోటీ శకటీ తటీపటీ గంధేభవాటీ పటీ
రనటీహారి పటీ సువర్ణమకుటీ ప్రచ్ఛోటికాపేటికల్
కనదామ్నాయ మహాతురంగ! శివలింగా! నీలకంఠేశ్వరా!

ఇది గుడ్లూరులోని నీలకంఠేశ్వరుని గూర్చిన పద్యమని పరిశోధకుల భావన. అరణ్యపర్వశేషమున చివరనున్న "ఇలపాకనాటిలో నీలకంఠేశ్వర స్థానమై యెసకమెసగు గుడ్లూరు నెవుగ గుణగరిష్ఠతనొప్పు ధన్యుడు, ధర్మైక తత్పరాత్ముడెఱ్ఱనార్యుడు" అను పద్యమునిట ననుసంధించుకొనవలయును.

నృసింహపురాణమందలి ద్వితీయాశ్వాసములో పట్టాభిషిక్తుడైన హిరణ్యకశిపుడు దిక్పాలకులను పరాభవించు పట్టున,

ఎక్కడిదేస్తు భూతియును నెమ్ములు సొమ్ములు భిక్షజీవనం
బొక్కటి కట్టఁజీరయును నుండగ నిల్లును లేదు నిక్కవం
బిక్కరకు న్దపస్విజనుఁడేచిన నయ్యెడుఁ నేమియంచు దా
నొక్కని శర్వునింబలుప నొల్లడు దైత్యుడఁ నాదరంబునన్

—ఆ. 2, 125

అని చెప్పుట ఎఱ్ఱన శివభక్తికి తార్కాణము.

హరివంశమున ఉత్తరభాగములో వచ్చు హరఘట్టములను వర్ణించు సందర్భములందు శివదాసుడు ఉప్పొంగినట్లు కన్పించును. శ్రీకృష్ణుడు శివుని మాహాత్మ్యంబభివర్ణించి స్తుతించిన సందర్భములోని యీ పద్యమును గమనింపుడు:

నీ మహనీయ నామములు నీ మహనీయ గుణోదయంబులు
న్నీ మహనీయ శీలములు నిత్య విచిత్రము లాద్యసంయమి
స్తోమ నిరుక్తులం దెలిసి చూతురు ప్రాజ్ఞులు సర్వదేవ చూ
డామణి లగ్నముల్ భవవిడంబన మోచనముల్ మహేశ్వరా !

—ఉ. భా. - ఆ. 6-45

శివుని స్తుతించునప్పుడు శివదాసుడుగను, విష్ణుని స్తుతించునప్పుడు విష్ణుదాసుడగను ఉప్పొంగిపోవుట ఎఱ్ఱన ప్రత్యేకత !

## అరణ్యపర్వ శేషము నందెఱ్ఱన శైవ విజృంభణము :

అరణ్యపర్వ శేషమునందలి కుమారస్వామి యవతార ఘట్టము అచ్చమైన శైవఖండము. దీనిని నిర్వహించుటలో నీతడు విజృంభించిన తీరు, అటనట కొన్ని యమూలక పద్యములను వ్రాసిన విధము వర్ణనాతీతము. 1. కుమారస్వామి యవతారము, 2. ఇంద్రుడు కుమారునిపై నెత్తి వచ్చుట, 3 ఈశ్వరుడు కుమారుని యొద్దకు వచ్చుట, 4. కుమారస్వామి సప్తమాతృకలను బాలగ్రహములుగా జేయుట, 5. ఈశ్వరుడు కుమార సహితుడై భద్రవటము చేరుట, 6. కుమారస్వామి మహిషాసురుని జంపుట - ఇందలి ఘట్టములు.

ఈ కథాంశములను తీర్చిదిద్దుటలో నెఱ్ఱయ సాధ్యమగునంత వఱకు మూలాతిక్రమణము చేయలేదు. కొన్ని సందర్భములందు మూలమున చెల్లాచెదురుగనున్న యంశములను ఒక క్రమమునకు తెచ్చి చక్కని కథాఖండముగ

రూపొందించినాడు. మూలమును పొల్లుపోనీయక, మించిన మెఱుగులతో, తనదైన పద్య శిల్పముతో కుమార స్వామిని వర్ణించిన పద్యము :

సీ॥ అయ్యగ్ని సంభవు, నాయతోన్నత బాహు,
నా ముక్త కవచుఁదేజో మహిష్ఠుఁ
నా లోహితాంబరు, హారి కుండల కర్ణుఁ
గనక రత్నోజ్జ్వల ఘన కిరీటు,
సంపూర్ణ యౌవను, సర్వ లక్షణ యుక్తుఁ
గని యనురాగిల్లి కమల నిలయ
సాకారయైవచ్చి యఖిలంబుఁజూడంగ
సిత పద్మ హస్తయై యతనిఁబొందె
ఆ॥ శ్రీ సమేతుఁడై విశేష కాంతి స్ఫూర్తి
నొలసి, పూర్ణచంద్రు చెలువు దాల్చి
యున్నవానిఁజూచి రుత్ఫుల్లలోచన
కుముదులగుచు మునులు నమర వరులు!

—పంచమాశ్వాసము - పద్యం 221

మూలమును అతిక్రమింపలేదనగా, అసలే యతిక్రమింపలేదని గాదు. శివుడు రంగమునకు వచ్చినపుడెల్ల శంభుదాసుని యెద పొంగి ప్రవహించిన పట్టులు కొన్ని గలవు. వానిని చూపించుటయే యిప్పటి పరమార్థము.

1. ఈశ్వరుడు కుమారస్వామి యొద్దకు వచ్చినప్పుడు, మూలమున - "పార్వతీ సహితుడై పరమేశ్వరుడు వచ్చి" అన్న ఒక్క వాక్యమే గలదు. దానిని గ్రహించి ఒక అమూలకమైన పద్యమే వ్రాసినాడెఱ్ఱన

మూలము : "ఆగమ్య, మనుజ వ్యాఘ్ర! సహదేవ్యా పరంతప!"

అనువాదము : "నానా సిద్ధగణంబు గొల్వఁబరమానందంబునం జంద్రరే
ఖానవ్యాంచిత మౌళి, భూరిభుజగాకల్పోజ్జ్వలాకారుఁడీ
శానుండానత శంకరుండు గిరిజా సంయుక్తుఁడై వచ్చెఁద
త్సేనానిం బ్రియ సూను షణ్ముఖుని వీక్షింపంగడుం బ్రేమతోన్
ఆ. 5 - పద్యం 238

2. మహిషాసురుడు మహేశ్వరుని రథమును నిరోధించినప్పుడు శివుడా తనిని తానే వధింపక అందులకు కుమారస్వామిని ప్రేరేపించెను. ఇక్కడ మూల మున శివుడు కుమారుని స్మరించెను" అని యున్నదేగాని ఆతనితో మాటలాడినట్లు లేదు. ఎఱ్ఱన, మాటలాడినట్లుగా మార్చి ఒక అమూలక మనదగిన పద్యమును వ్రాసెను.

మూలము : "తథా భూతే తు, భగవాన్ నా వధీన్మహిషం రణే
సస్మారచ తదా స్కందం మృత్యుంతస్య దురాత్మనః

అనువాదము : మందహాస భాసుర ముఖుడై పురారి నిజ సూనుఁగుమారుని
జూచి యిట్లనున్ - 280.

ఉ॥ చూచితె, వీని సాహసము! శూరత మద్రథరోధి యయ్యె ని
న్నీచుఁగృతాపరాధు, నవినీతు, గతాయువు మృత్యుదేవికిన్
గోచరుఁజేయు మీవు రణకోవిద! నావుడు షణ్ముఖుండు గో
త్రాచల సన్నిభుండు మదనాంతకు మాటకుఁ బొంగియుక్కునన్
—ఆ. 5 - పద్యం 281

3. ఈశ్వరుడు కుమార సహితుడై భద్రవటమునకు పయనమై పోవు నప్పుడు మూలమునందలి భావమును పెంచి వ్రాసిన దీ పద్యము :

మూలము : తదా సంప్రస్థితః శ్రీమాన్ హృష్టో భద్రవటం హరః
రథేనాదిత్య వర్ణేన పార్వత్యా సహితః ప్రభుః

అనువాదము : తనయుం కౌగిటఁజేర్చుచున్ వరుస మూర్ధ ఘ్రాణముంజేయుచున్
జనితానంద మనస్కుడై గిరి సుతాసంయుక్తుఁడీ శానుఁడ
య్యనఘుందోడ్కొని భద్రకేసరి సహస్రాంచద్రథారూఢుడై
చనియెన్ భద్రవట స్థలంబునకు నైశ్వర్యంబవార్యంబుగన్
—ఆ. 5 - పద్యం 263

తనయున్ కౌగిట జేర్చుచున్, వరుసమూర్ధ ఘ్రాణమున్ చేయుచున్, అయ్యనఘుందోడ్కొని - మొదలగునవి యన్నియు అమూలకములు.

4. కుమారస్వామి సప్తమాతృకలను బాలగ్రహములుగా చేసిన సందర్భమున

ఈ గ్రహముల వలన ఎవరెవరికి ఎట్టి పీడ గలుగునో వివరించి, భక్తులైన వారిని, మహేశ్వరుని గ్రహములు స్పృశింపజాలవు అని చెప్పిన సందర్భమున మూలమునకు అనువాదమునకు గల తారతమ్యమును కనుగొన వచ్చును.

మూలము : నస్పృశంతి గ్రహా భక్తాన్ నరాన్ దేవం మహేశ్వరమ్

అనువాదము : ఆది దేవుడగు మహాదేవు మీద నె
వ్వాని మనసు భక్తి వైభవమున
నుల్లసిల్లు, నతని నెల్ల కాలముల డ
గ్గఱదు సూవె గ్రహ వికార వితతి.

—ఆ. 5 - పద్యం 257

5. బ్రహ్మ కుమారస్వామిని అభినందించి అంతకు మున్న అక్కడ సన్నిహితుడై యున్న మహాదేవు చెప జూపి పలికిన మాటలలో మూలమునందు కంటె పెంపుదల కాన్పించుచున్నది. మూలమున లేని, తల్లియగు పార్వతి ప్రసక్తి అనువాదమున నున్నది.

మూలము : తతో బ్రహ్మ మహాసేనం ప్రజాపతి రథాஉబ్రవీత్
అభిగచ్ఛ మహాదేవం పితరం త్రిపురార్దనమ్

అనువాదము : అనఘ! యితడె త్రిపుర హరుడు త్రిలోచనుఁ
డిదె త్రిలోకమాత హిమ నగేంద్ర
తనయ! వీరు నీకుఁదల్లియుఁ దండ్రియుఁ
జువ్వె! వీరిఁగొల్వు సుచిర భక్తి!

—ఆ. 5 - పద్యం 261

ఇట్లు అచ్చమైన శైవ ప్రపంచమగు కుమారస్వామి యవతార ఘట్టమట్లుండ, తదితర వృత్తాంతముల యందు, ప్రాసంగికముగ సూచనా మాత్రముగ తటస్థపడు శివసంబంధ విషయములందు కూడ ఎఱ్ఱనగారి శైవము విజృంభించిన సందర్భములు కొన్ని గోచరించును.

6 షష్ఠాశ్వాసమున భీమార్జునుల చేతిలో సైంధవ పరాభవము ముగిసిన పిమ్మట నాతడు గంగాద్వారమునకు పోయి, రాబోవు యుద్ధమున పాండవులను జయించునట్టి వరమును పొందుటకుగాను, శివుని గూర్చి తపము చేయును. ఈ సందర్భమున మూలమునందు "అతడు శివుని గూర్చి తపస్సు చేసెను" అని మాత్రమే ఉండగా అనువాదమున ఎఱ్ఱన ఎన్నో విశేషణములతో శివుని వర్ణించి, సైంధవుడు తపము చేసిన విధానమును చెప్పుచు ఒక అమూలకమైన పద్యమును వ్రాసినాడు :

మూలము : స దేవం శరణం గత్వా విరూపాక్ష ముమాపతిమ్
తపశ్చచార విపులం.......................

అనువాదము : శా॥ ఆదిత్యార్చిత పాదపద్మ జగదేకాధీశు, నీశుం ద్రిలో
కాదిం, గ్రామ విభేది, బర్వత సుతాహ్లాదైక సంపాది నిః
భేదుండై శివునాత్మలో నిలిపి యక్షీణ వ్రతారూఢతం
బాదాంగుష్ఠము నేల మోపి తపమొప్పంజేసె సద్భక్తిమైన్
-పద్యం 25-4

7. షష్ఠాశ్వాసమున, ప్రాయోపవిష్టుడైన దుర్యోధనుని, కృత్య పాతాళమునకు కొనిపోయి దైత్యులకు సమర్పించగా వారు దుర్యోధనుని ఊరడించి యాతనికి తన పూర్వజన్మ ప్రకారము చెప్పు సందర్భమున ఎఱ్ఱన అనువాదమునందు శివుని గూర్చి ఒక అమూలకమైన పద్యమును వ్రాసినాడు. మూలమున "పూర్వము మేము తపస్సుచేసి మహేశ్వరుని వలన నిన్ను పొందితిమి" అని "మహేశ్వరాత్" అన్న ఒక్క మాట చెప్పబడినది. ఆ మహేశ్వరునకు ఎన్నో విశేషణములను తగిలించి ఎఱ్ఱన పద్యమును వ్రాసినాడు :

మూలము : "పురా త్వం తపసాఽ స్మాభిః లబ్ధో రాజన్ మహేశ్వరాత్"

అనువాదము : ఉ॥ ఏము తపంబుసేసి పరమేశ్వరు నీశ్వరుఁబార్వతీ మనః
కాముకుఁ గామవైరి నవికారుఁబురాంతకుఁ బ్రీతుఁజేసినం
గామితదాయియైన శితికంఠుఁడు నిన్ను సృజించి యిచ్చెను
ద్దామ దయావిధేయుఁడు ముదంబున మాకు నధీశ్వరుండుగాన్
-పద్యం 43

8. ఇదిట్లుండ, అసలు బొత్తిగా, శైవము ప్రసక్తము కాని సందర్భము నందు కూడ, నేదో ఒక అవకాశమును చూసుకొని తన శివభక్తిని ప్రదర్శించిన పట్టు కూడ గలదు. మార్కండేయుడు ధర్మరాజునకు వైవస్వత వృత్తాంతమును చెప్పును.

ఇందలి కథాంశమిది: ప్రళయము దాపురించనున్నది. అప్పుడు వైవస్వతుడొక పెద్ద ఓడను సిద్ధము చేసుకొని, దానికొక త్రాడును కట్టి, సముద్రము కడ వేచియుండి, మున్ను తాను సహాయ మొనర్చిన మత్స్యమును స్మరించును. అది వచ్చుట తోడనే దాని తలపై నున్న కొమ్మునకు ఈ ఓడ యొక్క త్రాడును బిగించును. ఆ మత్స్యమా యోడను సముద్ర గర్భమున కీడ్చుకొని పోవును. ఇంతలో సముద్రముప్పొంగి ఆ యోడ చిత్రవిచిత్రముగ కదలుచు, ఆడుచు తిరుగుచుండును. ఇప్పట్టున మూలమిట్లున్నది:

"సంయతస్తేన పాశేన మత్స్యః పరపురంజయ!
వేగేన మహతానావం ప్రాకర్షల్ల వణాంభసి
సచతాంస్తారయన్ నావా సముద్రం మనుజేశ్వర!
నృత్యమాన మివాంభోభిర్గర్జమాన మివాంభసా
క్షోభ్యమాణామహా వాతైఃసా నౌస్తస్మిన్ మహోదధౌ
ఘూర్ణతే చపలేవ స్త్రీ మత్తా పరపురంజయ!
నైవ భూమి ర్న చదిశః ప్రదిశో వా చకాశిరే
సర్వమాంభస మే వాసీత్ ఖంద్యౌశ్చ నరపుంగవ!
ఏవం భూతే తదాలోకే సంకులే భరతవర్షభ!"

ఎఱ్ఱన మూలమును కించిదన్యథాకరించి యీ పద్యమును వ్రాసినాడు:

సీ॥ గరుసులు గడవంగఁగదలి యల్లల్లన
యొత్తుచు నెడముల నుత్తరించి
వేడుకఁజేతులు పీచి యాడెడునట్లు
లోలోర్మి పంక్తులఁగ్రాల్చి క్రాలి
ప్రమదహాస స్ఫూర్తి పచరించు విధమున
నురుఫేన రోచులఁదెరలు గలిగి

యురువడి వర్ధిల్లు చున్న జలంబుచేఁ
బొంగారిదెసలెల్ల మ్రింగి కొనుచుఁ

ఆ॥ ప్రబల విలయ కాల పటురయ బహుళ స
మీరణౌఘ దుర్నివార మగుచు
నుగ్ర భంగిగాఁ బయోనిధు లొక్కటఁ
బెల్లురేగిఁజగము వెల్లివాడిచె

—ఆ. 4 - 228

ఇట్లు మూలభావము నన్యథా కరించుటయేగాక "ఉగ్రభంగిగాన్" అన్న అమూలకమైన క్రొత్తకల్పన చేసినాడు. ఉల్లోల కల్లోలముగ విజృంభించిన సముద్ర తాండవమును శివతాండవముతో పోల్చుటయు, ఉరుఫేన రోచులను అట్టహాసముతో పోల్చుటయు నద్భుతమైన కల్పన. పరమశివుడు లయకారుడేగాక లయస్వరూపుడుగూడ. ఈతత్త్వము యొక్క భూమికపై ఈ పద్యమును వ్రాసినా డెఱ్ఱన.

## శంభుదాస బిరుదము సాహిత్య సంబంధమైనది ।

ఇట్లు అచ్చమైన శైవఖండమగు కుమారస్వామి యవతార కథను నిర్వహించుటలోగాని, తదితర కథలయందు ప్రాసంగికముగ తటస్థపడు శివసంబంధములగు నంశములను నిర్వహించుటలోగాని ఈతడు ఉప్పొంగిపోవు విధమునుబట్టి యీ శంభుదాస బిరుదముయొక్క పరమార్థమును భావింపవచ్చును. దీనినిబట్టి అరణ్యపర్వ శేషరచన వల్లనే ఇది వచ్చియుండునని చెప్పవచ్చును. ఇది కేవల మాతని ఆధ్యాత్మిక జీవన ప్రవృత్తికి సంబంధించిన బిరుదముగా మాత్రమేగాక అతని సాహిత్య జీవన ప్రవృత్తికి సంబంధించిన బిరుదముగా కూడ భావించుట లెస్స. "వరలు జటాటవిన్" అను పద్యము దీనికి మూలబంధము. నృత్తావసానమున పదునాల్గు పర్యాయములు ఢక్కను ప్రయోగించి ఉణాది సూత్రములను పుట్టించి శబ్దశాస్త్ర నిర్మాణమునకు మూలకారణుడైన నటరాజ రాజు - శంభుడు - శంభుదాసునకారాధ్య దైవమనుటలోని రహస్యమిది! అంతేగాని కేవల మత పరముగ కరుడుగట్టిన శైవుడు గాడితడు. స్మార్త సంప్రదాయమునకు చెదింన

వాడు. అద్వైత పథగామి. హరిహరుల యందు భేదములేని భక్తి గలవాడు. తాత ఎఱపోత సూరి మనుమని ప్రశంసించిన పద్యమిది :

క॥ గిరిశ పదభక్తి రస త
త్పర భావము కలిమి శంభుదాసుండనగాఁ
బరగియు గోవింద గుణా
దర సౌభృత సౌమనస్య ధన్యుడ వెందున్

—నృ. పు. అవతారిక - 18



# సర్వమార్గేచ్ఛా విధాతృండు

ఋషివంటి నన్నయ్య రెండవ వాల్మీకి
తిక్కన్న శిల్పపుఁదెనుగు తోట
ఎఱ్ఱన్న సర్వమార్గేచ్ఛా విధాతృండు

—రామాయణ కల్పవృక్షము - అవతారిక

ఇది కీ. శే. విశ్వనాథ సత్యనారాయణగారు ప్రబంధ పరమేశ్వరునకు భక్తిభావమున సమర్పించిన బిరుద బిల్వము. దీనిని గూర్చి డాక్టర్ శలాక రఘునాథశర్మగా రిట్లనిరి :

"ధీర విచారుడగు నెఱ్ఱయ నన్నయ కవితా రీతియు గొంత దోప దద్రచనయ కానారణ్యపర్వ శేషమును బూరించెను. ఇది యాతని వినయ గరిమను, మహానుభావతను వెల్లడించును. "ఇట నుండి ఎఱ్ఱాప్రెగ్గడ కవిత్వము" అను వాక్యమును, పర్వాంతమందలి యెఱ్ఱయ రచనను బ్రతిపాదించు మూడు పద్యములును లేనిచో నీ భాగమన్యకర్తృకమను నభిప్రాయము స్థూలముగా సిద్ధింపదు. హరివంశ నృసింహ పురాణములందలి శైలికంటె మహాభారతము నందలి యీతని శైలి విలక్షణము. ఇట్లు పూర్తిగా దన కవితాశైలిని పెడ ద్రోసి మఱియొక కవిశైలిలో సుమారు పదునాఱు వందల పద్యములు వ్రాయుట సాధారణ విషయము కాదు. కావుననే శ్రీ విశ్వనాథ వారు "ఎఱ్ఱన్న సర్వమార్గేచ్ఛా విధాతృండు" అని కొనియాడిరి. (భారత ధ్వని దర్శనము, శ్రీ మహాభారతము - ఎఱ్ఱాప్రెగ్గడ, పుట : 286)

## నన్నయ తిక్కన కాళిదాస మార్గములే సర్వ మార్గములు :

ప్రాధాన్య వివక్షచేత ఈ క్రొత్త బిరుద పరమార్థమును ఇట్లు నన్నయ మార్గము వఱకే పరిమితము చేయుటకు వీలున్నను 'సర్వ' శబ్ద ప్రయోగమును బట్టి మఱికొంత విశాలార్థమున తిక్కన మార్గమునకు కూడ వర్తింపజేయుట సమంజసము. శ్రీ విశ్వనాథవారు చేసిన నిష్కర్షను బట్టి "నన్నయ్యను పోలిన

వాడు సృష్టిలో మఱియొకడుండడు; తిక్కన లేనిచో తెలుగు కవిత్వము లేదు. నన్నయ నెవ్వడు అనుసరించలేడు; తిక్కన్నను ప్రతిభావంతుడనుసరింప వచ్చును."[1] అంతటి మహితాత్ముడగు నన్నయ్యను అనుసరించుటకు ప్రయత్నించి కృతకృత్యుడైన మహనీయు డెఱ్ఱన. అటనట తిక్కన్నను కూడ ననుసరించిన వాడగుట వలన ఈ సర్వమార్గములలో నాతని మార్గమును కూడ చేర్చుట సమంజసము. కొన్ని తావులలో నీతడు కాళిదాస మార్గమును కూడ ననుసరించి నట్లు గోచరించును. ఇట్లు సర్వమార్గేచ్ఛా విధాతృడగు నెఱ్ఱన, నన్నయ తిక్కన్న లను గూర్చి పెక్కుసారులు స్మరించినాడు.

1. సకల లోకైక విదితుఁడైన నన్నయభట్ట మహాకవీంద్రు సరస
   సారస్వతాంశ ప్రశస్తి తన్ను చెందుటయు
   -అరణ్య. ఆ. 7 - పద్యం 469

2. అబ్జాసన కల్పులందలతు నాద్యుల నన్నయ తిక్కనార్యులన్
   -నృ. పు. - ఆ. 1 - పద్యం 9

3. ప్రౌఢాంచిత శబ్దసారులు మహాకవులాద్యులు
   -నృ. పు. - 2.1 - పద్యం 13

4. తా నన్నయభట్ట తిక్కకవినాథుల కెక్కిన భక్తి పెంపునన్
   -నృ. పు. - ఆ. 1 - పద్యం 17

5. నన్నయభట్ట తిక్క కవినాథులు చూపిన త్రోవపావనంబు.
   -హరి. ఆ. 1 - పద్యం 42

ఇవిగాక హరివంశావతారికలో వీరిని స్తుతించిన పద్యము లివి :

ఉ॥ ఉన్నత గోత్ర సంభవము నూర్జితసత్త్వము భద్రజాతి సం
   పన్నము నుద్ధతాస్య పరిభావిమదోత్కట మున్నరేంద్ర పూ
   జోన్నయ నోచితంబు నయి యొప్పెడు నన్నయభట్టకుంజరం
   బెన్న నిరంకుశోక్తి గతి నెందునుఁగ్రాలుట ప్రస్తుతించెదన్
   -ఆ. 1 - పద్యం 8

---

1. "పూర్వాంధ్ర సాహిత్యము" 'ఆంధ్రప్రదేశ్' ప్రభుత్వ తెలుగు మాస పత్రిక. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర 20వ వార్షికోత్సవ ప్రత్యేక సంచిక, నవంబరు 1976.

మ॥ తన కావించిన సృష్టి తక్కొ్కరుల చేతంగాదు నానేముఖం
బున దాఁబల్కిన పల్కులాగమములై పొల్పొందు నా వాణి భ
ర్తను నీతండొకరుండ నాఁజను మహత్త్వప్రౌఢిఁ గవిబ్రహ్మనా
వినుతింతున్ కవి తిక్కయజ్వ నఖిలోర్వీ దేవతాభ్యర్చితున్
-ఆ. 1 - పద్యం 9

ఇంత తపించి జపించిన వ్యక్తికి వారి గుణములెట్లు రాకుండును? ఎఱ్ఱన శబ్దగతియందు నన్నయ్యను భావగతి యందు తిక్కన్నను అనుసరించి నాడని విమర్శకుల సిద్ధాంతము. శబ్దగతి యనగా శైలీపాకరీతులతో నేర్పడిన అవ్యక్త మధురమైన ఒకానొక నాదము. దీనినే "ప్రౌఢాంచిత శబ్దసారులు మహాకవులాద్యులు" అన్నచోట "శబ్దసార" ప్రయోగముచే సూచించినాడెఱ్ఱన. మాట వరుసకిది నన్నయ తిక్కనలిర్వురకు కలిపి చెప్పినదేయయ్యును ఈ శబ్దసారము ప్రధానముగా నన్నయగారి సొత్తు. నన్నయ దీనిని సంస్కృత పదబాహుళ్యముచేత సాధించినాడని భావింపవచ్చును. ఇక భావగతి యన్నది తిక్కనగారి సొమ్ము. దీననీతడు సంభాషణల యందలి నాటకీయ శిల్పము చేతను, పాత్రల మనః ప్రవృత్తి చిత్రణచేతను, తెలుగు పలుకుబడులను విరివిగా వాడి పాము మెలికవలె పద్యమును నడిపించుట చేతను సాధించినాడని భావింపవచ్చును. ఈ రెండింటి యందును వీరి ననుసరించుటలో ఎఱ్ఱన చేసినదేమన సంస్కృతాంధ్ర పదప్రయోగములకు సమ ప్రాధాన్యము నిచ్చి తనదైన శైలినొకటి నిర్మించుకొనుట. కామరూపధరుడై ఒకచోట నన్నయ వలెను, కొండొకచోట తిక్కన వలెను భాసించుచు కొన్ని యెడల నిజరూపమున ప్రత్యక్షమగుట. ఇది యెఱ్ఱనార్యుని ప్రత్యేకత. ఇది యితని సర్వ ప్రబంధములందును కానవచ్చు సర్వసాధారణ రచనా విధానము. ప్రకృతాంశమగు నరణ్యపర్వ శేషమునకు సంబంధించినంత వఱకు "తత్కవితారీతియు కొంత దోప దద్రచనయ కాన్" అన్న ప్రతిజ్ఞ చేసి నిర్వహించినాడు గావున నన్నయగారికే పట్టాభిషేకము. ఇట తిక్కన స్థానము దిఙ్మాత్రము. రేఖామాత్రముగ నటనట కాళిదాస విలాసము కూడ స్ఫురింపును. వరుసగా కొన్ని యుదాహరణములు :

## ఎఱ్ఱయలో నన్నయ :

ఈ క్రింది పద్యములందెఱ్ఱన్నలో నన్నయ సాక్షాత్కరించును :

1. చం॥ వినుత భవన్నియోగమను వేల యలంఘ్యము గాన యిమ్మెయిన్
ఘన భుజ వీచి విభ్రమ వికాసముఁజూపక సిల్చె గాక స
జ్జనసుత చూడ నీయనుజ సాగరముల్ దళితోద విద్విష
జ్జన లయకారులై కడఁగి సర్వ జగంబుల నాక్రమింపవే
-ఆ. 4 - పద్యం 159

శ్రీకృష్ణుడు సత్యభామాసమేతుడై కామ్యకవనమునందున్న పాండవుల యొద్దకు వచ్చినప్పుడు ధర్మజుని ఓదార్చుచు ఆతని యాజ్ఞాబద్ధులగు తమ్ముల పరాక్రమమును వర్ణించు సందర్భమిది. మంచి యాలంకారిక రచన గల పద్యము.

2. మ॥ శితభల్ల ద్వితయంబునం గడు వెసంజేవోయి ఖండించి ఖం
డిత గోత్రాచల తుంగశృంగ శతకోటి స్ఫార ఘోరానల
ద్యుతి సాంద్రంబగు శాతభల్ల మొకటం ద్రుంచెం గనత్కుండలా
న్వితమై యొప్పు నిశాచరేంద్రుశిరమున్ వీర క్రియాదక్షుడై
-ఆ. 7 - పద్యం 185

రామోపాఖ్యానములోని పద్యమిది. లక్ష్మణుడు ఇంద్రజిత్తును చంపిన సందర్భము నందలిది.

3. చ॥ అతులిత పుష్ప పల్లవ ఫలాన్విత భూరుహ భూరి వల్లరీ
వితతముఁజారు కైరవ నవీన సరోరుహషండ మండలా
యత సరసీ మనోహరమునైన పురోపవనంబునన్ సము
న్నత విభవుండు వాసభవనంబు లొనర్పఁగఁబంచి యిమ్ములన్
-ఆ. 4 - పద్యం 326

పరిక్షితుడను రాజు సుశోభన యను సుందరితో విహారార్థమున కేగు సందర్భమున పురోపవనమునందు వాసభవనము లేర్పాటు చేయించును. ఆ పురోపవన వర్ణన పద్యమిది.

4. ఉ॥ చామర పుండరీక విలసత్సితచారు పతాకలంగురు
గ్రామణి యాత్ర యెంతయును గాంచి వహించె నభంబు శారదో
ద్దామ మరాళ మండల సిత స్ఫుట పద్మవనీ పరిస్ఫుర
త్తామర సాకరంబున విధంబున భూజన నేత్రపర్వమై
-ఆ. 6 - పద్యం 59

దుర్యోధనుడు ప్రాయోపవేశము మాని యింద్ర ప్రస్థమునకు తిరిగివచ్చు సందర్భములోనిది. నన్నయ శబ్దగతి యెఱ్ఱయ ఉక్తివైచిత్రి మిళితమైన మనోహరమైన పద్యము.

## ఎఱ్ఱనలో తిక్కన :

ఈ క్రింది పద్యము లందెఱ్ఱన్నలో తిక్కన భాసించును :

1. చ॥ ఇది దగునే? దశానన ! మహేంద్రుడు లోనగు దేవతా తతిం
గదనములో జయించి త్రిజగంబులఁబేర్కొని యున్న నీకు ని
మ్మదిత వధింతునంట గడు మోసము గాదొకొ? యెప్పుడేనినే
పొదవగ రాఘవున్ గెలువు ముగ్మలి జంపినఁబెంపుగల్గునే
-ఆ. 7 - పద్యం 140

లక్ష్మణుని చేతిలో నింద్రజిత్తు మరణించెను. శోకక్రోధోద్దీపితుడైన రావణుడు ఆ పగ తీర్చుకొనుటకు సీతను చంపుటకు చంద్రహాసము చేబట్టెను. అప్పుడు వయోవృద్ధుడైన యవింధ్యుడు అతనిని వారించు పలికిన మాటలివి. "ఇది తగునే దశానన" అన్న ఎత్తుగడ "ఇటు తగునే సుయోధన" అన్న శల్య పర్వమునందలి పద్యపుటెత్తుగడను పోలియున్నది. -9.267

1. చ॥ ఎఱుగక తప్పుగా మెలఁగెనేనియు దానికి సైచిఁనేఱుపున్
గఱపి ప్రియంబుతోఁ గొలువ గైకొనఁగాఁదగు మీకు; బాలురుం
దెఱవలు వృద్ధులుం, దమకుఁదెల్లమ, దప్పులు సేసిరేనియున్
మఱతురు గాని యల్గరు సమగ్రశమాన్వితులైన తాపసుల్
-ఆ. 7 - పద్యం 320

కుంతిభోజుడు, కూతురు కుంతిని దుర్వాసముని పరిచర్యకు నియోగించి

యామె నాతని కప్పగించు సందర్భములోని పద్యమిది. తెలుగు పలుకుల పొలుపు తిక్కన ముద్రను పుణికిపుచ్చుకొనుట గమనింపవచ్చును.

## ఎఱ్ఱన ప్రజ్ఞానేత్రము :

ఇప్పుడు ఎఱ్ఱనార్యుని ప్రజ్ఞానేత్రము విప్పారిన ఘట్టములలోని కొన్ని పద్యములు. ఇవి యాతని స్వీయ వ్యక్తిత్వమును చాటుచున్నవని గ్రహింప వలెను.

చ॥ అలస విలాస లాలస రసాన్వితలైన నితంబినీ జనుల్
వలసిన భూరి విస్ఫురిత వస్తు సమగ్రములైన గ్రామముల్
వలసిన నుల్లసన్మణి సువర్ణ విభూషణ గోధనావళుల్
వలసిన గోరు మిచ్చెద ధ్రువంబుగ నావుడు నాతడిట్లనున్
-ఆ. 7-559

కవచకుండలముల కొఱకు కపట విప్రవేషమున వచ్చి 'భిక్షాందేహి' అని యడిగిన నింద్రునితో కర్ణుడు పలికిన మాటలివి. అర్థసమర్థకములయిన మధుర శబ్దముల కూర్పుగల పద్యమిది. శైలిలో నెఱ్ఱన వ్యక్తిత్వము రూపుగట్టును. ఇట వృత్త్యనుప్రాస శబ్దాలంకారము.

క॥ తాలైలాగురు సాల ర
సాల తమా లామ్ర నింబ జంబూ జంబీ
రాలంకృత లంకావన
జాలంబుల విడిసె వృక్షచర సైన్యంబుల్
-ఆ. 7 - పద్యం 55

రాముడు వానర సైన్యయుక్తుడై వారధిని దాటి లంకను ప్రవేశించును. అప్పటి లంకా వర్ణనమిది. ఈ చిన్ని పద్యము ఎఱ్ఱన యొక్క ప్రతిభావంతమైన ధారావైచిత్రికి నిదర్శనమనుట ఏపాటి మాట. తాల + ఏలా = తాలైలా. ఈ వృద్ధి సంధిచేత 'లై' అని చదివినప్పుడు తాలవృక్షముల ఔన్నత్యము కండ్ల యెదుట సాక్షాత్కరించు రచనాశిల్పము.

షష్ఠాశ్వాసములోని సైంధవ పరాభవ ఘట్టమునందు ద్రౌపది సైంధవు నితో నిష్ఠురోక్తులు పలికిన పద్యములు కీచక వధలోని పద్యములనో శ్రీకృష్ణ

రాయబారములోని పద్యములనో తలపించుచుండునని కొందరు అభిప్రాయపడిరి. ఇవి యా పద్యములను తలపించుట సహజమేగాని యిక్కడ తిక్కనగారి వన్నె చిన్నెలు బొత్తిగా లేవనుట నిష్కర్ష. ఈ విషయమున ఎఱ్ఱన చాల జాగ్రత్తపడి నట్లు గమనింపవచ్చును. అసలీ పదములు, పదబంధములు, సమాసపు కట్టు బడులు విలక్షణములై ఎఱ్ఱనగారి వ్యక్తిత్వమునకు పరమోదాహరణములుగ నున్నవి. ఆ పద్యములివి :

చ॥ ప్రకటిత శౌర్యసారుల నభగ్న పరాక్రమ నిర్జితాహిత
ప్రకరులఁబాండు నందనులఁబాండు యశస్కుల నాత్మలో దలం
పక నను ధిక్కరించెదు; నృపాలకులాధమ ! నీదు గర్వదు
ర్వికసన మింతఁబోదు, తుది వేఁగగుఁదక్కుము దుష్ప్రలాపముల్

మ॥ హిమవత్పాద వనాంత కేళిరతిమై నే పారి కోపారుణ
క్రమ నేత్రాంచలమై ప్రభూత మదరేఖంబైన గంధద్విపేం
ద్రముఁడాయంజని సిఖ్ల సూపుట సుమీ ధర్మాత్మ సత్యోగ్ర వి
క్రము గౌంతేయ వరిష్ఠు నీవు దొడరంగాఁ జూచుటూహింపగన్

ఉ॥ శాతనఖాగ్ర ఖండిత లసన్మద కుంజర కుంభముక్త ము
క్తాతత శైలకందర గుహాంతర సుప్తమృగేంద్ర కేసర
వ్రాతము వేడ్క నూచికొన వారక చేరుటగాదె, క్రోధ ని
ర్ఘాత మహోగ్రభీముఁజెనకం దలపోయుట నీకు నెమ్మెయిన్

మ॥ చల జిహ్వాగ్ర విలీఢ విస్ఫురిత దంష్ట్రా భీషణంబైన బె
బ్బులిఁగోలం గొని వ్రేసి తొలగం బో వచ్చినన్ వచ్చు గా
క లసత్క్రూరతరాగ్ని దుస్సహుని నగ్గాండీవి నల్గించి యె
వ్వలనన్ మాన ధనాఢ్యులై బ్రతికి పోవన్ వచ్చునే యేరికిన్

ఉ॥ ఘోరవ విస్ఫులింగములు వొడ్మగ, నుగ్ర విషంబుగ్రక్కుచుం
గ్రూర విచేష్ట నాలుకలు గ్రోయు మహోరగరాజయుగ్మముం
జేరి పదాహతిం గినియఁజేయఁదలంచుట గా నెఱుంగు దు
ర్వారులు మాద్రి పుత్రుల కవజ్ఞ యొనర్పఁదలంచు చేర్పడన్

ఉ॥ ఆలములోన వీఁకనమరాసుర కోటికినైన దుర్జయుల్
వాలిన వీరుల వ్వీఁభులు; వారికి నెగ్గొనరించిపోయి పా
తాళము సొచ్చి డాఁగినను దప్పదు మృత్యువు; నీకు నక్కటా!
కాలము నిండె; నీవశము గాదు విధాతృని చెయ్విఁత్రోవగాన్

## శంభుదాసులో కాళిదాసు :

శంభుదాసుని కవితలో నటనట కాళిదాస కవితావిలాస విన్యాసములు కొన్ని స్ఫురించుచున్నవి. కీ. శే రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, కీ. శే కాటూరి వేంకటేశ్వరరావుగారలు శంభుదాస కాళిదాసుల సాత్త్వికతను గూర్చి, కవితాతత్త్వమును గూర్చి అందు కానవచ్చు సామ్యసౌమ్య భావములను గూర్చి చెప్పిన మాటలు వేరొకచోట ప్రస్తావించబడినవి (చూ. శంభుదాస లక్షణాభిధేయము) ఇప్పట్టున ఒకటి రెండుదాహరణల ద్వారా నా విషయము పరామర్శింపబడును. కాళిదాస కవిత కేవల సంస్కృతము. శంభుదాస కవిత సంస్కృతాంధ్ర సమ్మిశ్రితము. కావున శయ్యాపాకాదులను గూర్చి సూటిగా ముచ్చటించుట వలను పడదు. కాని అచ్చ తెనుగు పద్యమనదగిన నొకదానిని సన్నివేశమునకు తగినట్లు గ్రహించి యొకచోట, భావ ముద్రకు సంబంధించి యొకచోట రెండంశములు ప్రతిపాదింప బడుచున్నవి.

శాకుంతల ప్రథమాంకమున మృగయా వినోదియగు దుష్యంతుడు వెంబడించిన లేడి పరుగుల చౌకళింపులను కాళిదాసు వర్ణించిన విధమును చూడుడు :

గ్రీవాభంగా భిరామంముహురను పతతి స్యందనే బద్ధదృష్టిః
పశ్చార్ధేన ప్రవిష్టః శరపతన భయాద్భూయసాపూర్వకాయమ్
దర్భైరర్ధావలీఢైః శ్రమ వివృత ముఖ భ్రంశిభిః కీర్ణ వర్త్మా
సద్యోదగ్ర ప్లుతత్వాద్వియతి బహుతరం స్తోకముర్వ్యాం ప్రయాతి
—శ్లోకం : 7

ఇందలి యర్థావబోధకు పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని శృంగారశాకుంతలము నుండి యీ క్రింది యనువాదము :

చ॥ విలుఁగొని వెంటవెంటపృథివీపతి రా శరపాత భీతి దా
ల్పలఁగి మలఁగి కన్గొనుచు మార్గము క్రేవకు నడ్డగించుచున్

నిలుచుచుఁ గొంతగొంత గమనించుచు నర్ధము మేసిమేసి ద
ర్భలు వివృతాస్య పార్శ్వముల రాలగ మింటికి చౌకలించుచున్
—11.19

పినవీరన వంటి వాడుకూడ మూలమునందలి "గ్రీవాభఙ్గాభిరామం" "పశ్చార్ధేన ప్రవిష్టః" "భూయసా పూర్వకాయం" అను మూలవాక్యములను అనువదింపలేక విడిచిపెట్టినాడు. అట్టిది కాళిదాసుని వాక్యరచనా విన్యాసము. "ఊహలుగల చిత్రకారునకు మనశ్చిత్రకారులగు సహృదయుల"కు మాత్రమే అర్థము కాగల కాతర విహ్వలయైన హరిణ భంగిమలను ఆ ప్రయోగములలో కాళిదాసు చూపించినాడు. ఇదిట్లుండనిచ్చి, అరణ్యపర్వ శేషాంతర్గతమగు రామాయణోపాఖ్యానమున సీత కోరికపై రాముడు వెంబడించిన మాయలేడియొక్క దువాళింపులను శంభుదాసు వర్ణించిన రీతిని గమనింపుడు :

పఱచు-దవ్వుల జేయలంతి నిలుచుం ఒట్టిక యాసాసలం
బిఱువోవుం బొదలందు డిందుఁ బొడమున్ బిట్టుల్కి వే దాటుగ్ర
మ్మఱి చూచుంజెవిఁదార్చి నిల్చుమలయున్ మట్టాడు గోరాడు నే
మఱినట్లుండు తృణంబు మేయు నెలయున్ మాయామృగంబిమ్మెఁ న్
—షష్ఠాశ్వాసము—పద్యం - 327

బాహ్యదృష్టికి కాళిదాస శ్లోకమునకు శంభుదాస పద్యమునకు సంబంధము బొత్తిగా కన్పింపదు. ఎవరిదారి వారిదిగా తోచును. ఎట్టిన్న కాళిదాసుతో తుల తూగజాలడు. కాని సంస్కృతమున కాళిదాస శ్లోకమెంత లోకోత్తరమైనదో, తెలుగున శంభుదాసుని పద్యమంత లోకోత్తరమైనది. ఎట్టిన, కాళిదాస హరిణము యొక్క గతిస్ఫురణములను భావించి యందలి తత్త్వమును మరొక విధముగ పక్వమునకు తెచ్చుకొని తన పద్యమును చదివిన తనే కాళిదాస శ్లోకము తలపునకు తెప్పించుచు నౌరా ! యని తలయూచునట్లు వ్రాసినాడను నిశ్చయమునకు రావచ్చును. సంస్కృత హరిణము అమాయిక. కాతర విహ్వల ! తెలుగు లేడి మాయావి ; కథా సందర్భమునుబట్టి యీ వ్యత్యాసమున్నది. ఈ వ్యత్యాసమును చూపి చుచూ తన లేడిని కాళిదాసు లేడితో సమానముగ పరుగెత్తించుటకు ఎట్టిన ప్రయత్నించినట్లు గోచరించును. కాని రెండు మూడు వంతులు మాత్రమే కృతకృత్యుడు కాగల్గెను. అంతకు మించుట యెవ్వరితరము కాదన్నచో నతిశయోక్తి లేదు !

ఎఱ్ఱన పద్యములో "తృణంబు" "మాయా మృగంబు" అన్న రెండు సంస్కృత పదములు దక్క తక్కిన పద్యమంతయు అచ్చతెనుగుల పోహ శింపే. అలతి యలతి తునియలుగా నున్న మాటల ప్రతి విఱుపులోను లేడి యొక్క ఒక్కొక్క చౌకళింపును, భంగిమను ఒద్దికగా నిముడ్చి చూపించుట మహాశిల్పము! చిత్రిక పట్టినట్లుండి బొంగరము వలె గిరగిర తిరుగుచున్నట్లుండిన ఆ యచ్చ తెనుగుల నిగారింపులు పద్యమున కింతటి మేలిమిని చేకూర్చినవి. ఈ పద్యమునందలి భాషను జానుతెనుగన వచ్చును. కాళిదాస శ్లోకము నందలి భాషను, అందునను- "గ్రీవాభఙ్గాభిరామం" "పశ్చార్ధేన ప్రవిష్టః" "భూయసా పూర్వకాయం" వంటివి "జాన సంస్కృత" మనవలయును. (జాను సంస్కృతము). సంస్కృత భాషలో గూడ నాయా యుగధర్మములను బట్టి చూచినచో భాస కాళిదాసులనాటి భాష "జాన సంస్కృతమ"ని నిష్కర్ష చేయవచ్చును. ఇట్లు భాషాభావగతులు భిన్నముగ గోచరించినను వాని తత్త్వమునందు శంభుదాసుని తెనుగు కవితా హరిణము కాళిదాసుని సంస్కృత కవితా హరిణముతో సమానముగ సాగిపోగలదని భావింపవలయును.

ఒక చిన్న పదచిత్రణతోగాని, వాక్యచిత్రణతో గాని పాత్రల యావేశము నొక్కుమ్మడి పొంగించి, ఆ యూపులో ఆంగిక విచేష్టితమును గూడ యుగపదుద్భూతము గావింపగల నేర్పు, వర్ణనా చమత్కారము కాళిదాసునకు వలె కొద్దియో గొప్పయో శంభుదాసునకు కూడ కలదు. కుమార సంభవము చతుర్థ సర్గలో రతీవిలాప ఘట్టమున ఆమెను ఓదార్చుటకు వసంతుడు రాగా అతనిని చూచి-

> తమవేక్ష్య రురోద సా భృశం స్తన సంబాధ మురో జఘాన చ
> స్వజనస్య హి దుఃఖ మగ్రతో వివృత ద్వారమివోప జాయతే
>
> -శ్లోకము 26

రతీదేవి స్తనములకు బాధ కలుగునట్లు ఱొమ్ములను బాదుకొనుచు ఏడ్చెనదట! అయిన వారి యెదుట దుఃఖము తలుపులు తెఱచుకొని (కట్టలు త్రెంచుకొని) వెలికి ఉరికిపడును గదా! యను నర్థాంతరముతో కవి సమర్థనము. ఇందు "స్తన సంబాధమురో జఘాన" అన్నది వాక్య చిత్రణము. దీనితో నుద్భూతమగుచున్న రతీదేవి యొక్క ఆంగిక విచేష్టితమును తద్వాక్యశ్రవణ మాత్రమున ప్రత్యక్షముగ జూడగలము,

అరణ్యపర్వశేషాంతర్గతమగు రామోపాఖ్యానమున నింద్రజిత్తు లక్ష్మణుని చేతిలో మరణించినాడని విని :

> తనయుని మరణం బేర్పడ
> విని దశకంధరుఁడు శోక వివశుఁడై బో
> రన బాష్పము లొలుకగ హా!
> యనుచుం బదినోళ్లఁదెఱచి యఱచెం బెలుచన్
>
> —సప్తమాశ్వాసం - పద్యం 137

ఇచ్చట "హా! యనుచుం బది నోళ్ల దెఱచి యఱచెన్" అన్నది వాక్య చిత్రణము. తదనుగుణమగు నాంగిక చేష్ట ఒక్కుమ్మడి కండ్లకు కట్టినట్లుండుట స్పష్టము. పది భావములను పెట్టుట, పది పద్యములను వ్రాయుట వంటి విస్తరణ విధానము సాధారణముగా కాళిదాస శంభుదాసులలో కానరాదు. ఒక్క భావములో నొక్క మెఱుపును పుట్టించుట వీరి కవితాతత్త్వము యొక్క మూల సూత్రము. ఈ విషయమున తెలుగు కవులలో నెఱ్ఱన్నకు ప్రధాన మార్గదర్శి మహర్షి నన్నయ. ఆ పిమ్మట తిక్కన మనీషి.

## కవిత్రయము వారి ఏకాత్మకత :

మూర్తిత్రయము స్థూలదృష్టికి మువ్వురే గాని వారి తత్త్వమొక్కటే యన్నది వేదాంత విదుల నిరూపణ. అట్లే భిన్నులుగ కాన్పించిననూ కవిత్రయములో నేకత్వమున్నదని కవిత్వ తత్త్వవేదుల నిరూపణ. కీ. శే. డాక్టర్ పాటిబండ మాధవశర్మగారు ఈ క్రింది యెఱ్ఱన పద్యమునందు కవిత్రయమును దర్శించి చెప్పిన వాక్యము లివి :

> ప్రీతుండై చనుదెంచె నాశ్రిత జనాభీష్ట క్రియాశీలుడు
> ద్గీతామ్నాయుఁడు, నిర్విధూత దురిత క్లేశుండు, యోగామృత
> స్ఫీత స్వాంతుఁ డనంత సంతత సమావిర్భూత కారుణ్య ధా
> రా తోయ స్నపనైక శీలుఁడగు పారాశర్యుడచ్చోటికిన్
>
> —షష్ఠాశ్వాసము - పద్యం 103

"ఈ పద్యమునందలి ధార నన్నయది. విఱుపులు తిక్కన్నవి. పదము లిరువురివి. కూర్పు ఎఱ్ఱనది. ఈ పద్యమున కవిత్రయమున్నది. కవిత్రయమున కాశ్రయుడైన వేదవ్యాసుడున్నాడు." ఇది తెలిసెనచో నిదియే యెఱ్ఱనగారి సర్వ మార్గేచ్ఛా విధాతృత్వము !



# లక్ష్య లక్షణ కళాభిజ్ఞుడు

మన లాక్షణికుల దృష్టిలో ఎఱ్ఱనార్యునకు మహోన్నతమగు స్థానమే లభించినది. ప్రాయికముగ ప్రతి లాక్షణికుడును ఈతని కృతుల నుండి యెన్నియో పద్యములను లక్ష్యములుగ నిచ్చియున్నారు. ఈ విషయమున నీతడు నన్నయ తిక్కనలతోపాటు సరిగద్దెనే యెక్క గలిగెను. క్రీ. శ. 1600 నాటి వాడగు ఆంధ్రకవి రామయ్య తన విష్ణుకాంచీ మాహాత్మ్యమున ఎఱ్ఱన్నను 'లక్ష్య లక్షణ కళాలంకార సౌభాగ్య సత్కావ్య విన్యాస శంభదాసు దలతు' అని కీర్తించి యుండెను. కీ. శే. మానవల్లి రామకృష్ణకవిగారు ఒకప్పుడు ఎఱ్ఱన్న వైదుష్యమును గూర్చి ప్రస్తావించి "కవిత్రయము వారిలో నన్నయ సరళ ప్రసన్న శైలికిని, తిక్కన లోకజ్ఞతకును, ఎఱ్ఱన బహుశాస్త్ర పాండిత్యమునకును పేరు గాంచినవారు" అని వాక్రుచ్చియుండినట్లు ఆచార్య డాక్టర్ దివాకర్ల వేంకటావధానిగారు పేర్కొనిరి. (నృ. పు. పీఠిక - ఆం ప్ర. సాహిత్య అకాడమి ప్రచురణ). ఇంతటి లక్ష్యలక్షణ కళాభిజ్ఞత, బహుశాస్త్ర పాండిత్యము గల వాడుగనుకనే యెఱ్ఱన లాక్షణికుల దృష్టిని బహుళముగ నాకర్షింప గలిగినాడు.

ఏ కవిగాని లాక్షణికుల దృష్టికెక్కనిచో వచ్చు లాఘవము లేదు గాని ఎక్కినచో లభించు గౌరవము గౌరవమే యని చెప్పక తప్పదు. తెలుగుకవులలో పోతనకున్న స్థానము జగద్విదితము. కాని యాతని కవితలో లక్షణ దృష్టి తక్కువయని లాక్షణికులు భావించినట్లు అప్పకవి చెప్పిన యీ పద్యము వలన తెలియగలదు :

> బమ్మెర పోతరాజకృత భాగవతంబు సలక్షణంబుగా
> కిమ్మహి నేమిటం గొదువ యెంతయు నారసి చూడ గాను రే
> ఫమ్ములు ఱాలునుం గలసి ప్రాసములైన కతంబునం గదా
> యిమ్ముల నాది లాక్షణికు లెల్లరు మాని రుదాహరింపగన్

ఈ వరుసలో నన్నెచోడుడు, పాల్కురికి సోమనాథుడు మొదలగు మఱి

కొందరు మహాకవులుకూడ వెనుకబడిపోయిరి దీని వలన వారికి వన్నెయు వాసియు తగ్గదు కాని అదొక వెలితియని చెప్పక తప్పదు. సంస్కృత లాక్షణికులు భట్టనారాయణుని వేణీ సంహార శ్లోకములను బహుళముగా నుదాహరించిరట. అదొక గొప్పగా నా భాష చదివినవారు చెప్పుదురు. కవిత్రయమువారు మనకు మూర్తిత్రయమువంటివారు. అయినను విష్ణుమహేశ్వరులకు జరుగు పూజాపురస్కారములు బ్రహ్మకు లేకపోవుట యున్నది. ఆ వరుసలో నెఱ్ఱన్నను వెనుకకు నెట్టు వారుండకపోరు! ఇట్లు జరుగలేదనియు ఎఱ్ఱన్నకు వారి దృష్టిలో సముచిత స్థానమే దక్కినదనియు నిరూపించుటకే యీ ప్రకరణము.

తెలుగున ఛందో వ్యాకరణాదిశాస్త్ర విషయక గ్రంథములెన్నో వెలసినవి. కాని వానిలో చాలవరకు పఠనపాఠన భాగ్యమునకు నోచుకొనక మూలబడిపోయినవి "పుణ్యైర్యశో లభ్యతే" అన్నట్లు అప్పకవీయము, బాల ప్రౌఢ వ్యాకరణములు విశేష ఖ్యాతినార్జించుకొని ప్రచారములో నున్నవి. ఈ మూడింటిలో కవిత్రయము వారికి లభించిన స్థానము మహోన్నతమైనది. వీరిలో ఎఱ్ఱన స్థానమును గుర్తింతుముగాక.

## అప్పకవీయము నందెఱ్ఱన స్థానము :

అప్పకవీయము క్రీ. శ. 1675లో వెలసినది. ఇందుదాహరింపబడిన గ్రంథములు మొత్తం 76. వీనినుండి గ్రహింపబడిన మొత్తం పద్యముల సంఖ్య 816. ఇవిగాక 29 చాటుపద్యములున్నవి. అనగా మొత్తం 845 పద్యములు. వీనిలో మూడవవంతు పద్యములు అనగా 115 కవిత్రయమువారివే. ప్రాయికముగ లాక్షణికు లెల్లరూ ప్రయోగ ప్రామాణ్యమున కవిత్రయమున కిచ్చిన ప్రాధాన్యము ఇతరుల కివ్వలేదనుట గ్రహింపవలెను. అప్పకవి యిచ్చిన కవిత్రయ పద్యముల వివరములివి :

నన్నయ భారతము - 28; తిక్కన భారతము - 60; నిర్వచనోత్తర రామాయణము - 2, విజయసేనము - 1; మొత్తము 63. ఎఱ్ఱన భారతము- 7, నృసింహపురాణము - 17; మొత్తము 24. కవిత్రయమువారు ఎవరికి వారు వ్రాసిన గ్రంథములలోని పద్యగద్యముల సంఖ్యతో అప్పకవి ఉదాహరించిన, వారి వారి పద్యముల సంఖ్యను పోల్చి శాతము గట్టి చూచినచో ముగ్వురికి ఇంచుమించు

సమాన ప్రాతినిధ్యము లభించినట్లు తోచును. అరణ్యపర్వమున ఎఱ్ఱనగారి పద్య గద్యల సంఖ్య 1595. ఇందుండి యేడు పద్యములను లక్ష్యములుగా నిచ్చుట గొప్ప విషయమని భావింపవచ్చును.

ఆ పద్యములను, లక్ష్యలక్షణ సమన్వయ పూర్వకముగను, పనిలో పనిగ సందర్భసహితముగను అనుశీలనము గావింపవలసి యున్నది :

1. అప్పకవీయము. ఆ 2. ట వర్గాక్షర భేదంబులు. పద్యం 148.

తే. డంభ డిండీర డోలికా దాడి మాది శబ్దములకాది వర్ణంబు సంస్కృతమున నుపరివర్గ తృతీయమై యొప్పునట్లు తెనుఁగున దకారము దవర్ణ మొనరుచుండు.

వ. డంభ డిండీరాది శబ్దములవలెనే యన్నందు చేతను రెండునుగలవు. గనుక దకారమునకు.

అరణ్యపర్వమునందు. ఆ. 7-290.

క. జగములనెల్లను నిండిన, పొగడిత గడు వెలితిచేసి పొల్ల యొదలికై
తగునే జన్మవ్రతమిటు దిగవిడువగ నిపుడు నాకుఁ ద్రిభువన దీపా!
డిగ విడువగ - దిగ విడువగ అని గ్రహింపవలెను.

ఇంద్రుడు వచ్చి కవచకుండలముల నడుగగలడు. ఈ వందని చెప్పినే సూర్యునితో కర్ణుడు పలికిన మాటలివి. కర్ణుని దానశీలము చక్కగ ప్రతిపాదింప బడినది. "పొల్లయొదలికి" వంటి తెలుగు పదముల పోహళింపు హృద్యముగ నున్నది.

2. అప్పకవీయము - ఆ. 2. కుఱుచలమీద ఱ కారమునకు రూపములు. "క్రమ్మఱకు" ప్రయోగము.

అరణ్యపర్వమునందు. ఆ. 6. 327.

మ॥ పఱచం దవ్వుగఁజేయలంతి నిలుచుంబట్టిక యాసాసలంత
బిఱువోవుం బొదలందు డిందుఁబొద ముం బిట్టుల్కి- వేదాటు గ్ర
మ్మఱతి చూచుం జెవిదార్చినిల్చు మలయున్ మట్టాడుఁ గోరాడు నే
మఱతి నట్టుండుఁ దృణంబులాను నెలయుం మాయామృగంబిమ్ములన్

రామోపాఖ్యానమున మాయా మృగము చౌకళించిన విధమిది. ఇందు తృణంబు, మాయా మృగము అన్నవి రెండు మాత్రమే సంస్కృత పదములు. తక్కిన పద్యమంతయు అచ్చ తెనుగుమయము. ఒక్కొక్క పదములో నొక్కొక్క చౌకళింపు కండ్లకు గట్టినట్లున్నది. శాకుంతలము, ప్రథమాంకమున "గ్రీవాభంగాభిరామం" అన్న శ్లోకమునకు దీటైన హరిణ వర్ణనా పద్యమును తెనుగున చూపింప వలయునన్న దీనిని చూపింపవలయును. స్వభావోక్తిలో నున్న గొప్ప పద్యము.

3. అప్పకవీయము - ఆ. 3. 'నిత్య సమాస విశ్రాంతులు' లేక అఖండ యతులు. జనార్దన శబ్దమునకు :
అరణ్యపర్వమునందు - ఆ. 4-397
చ॥ నగినగి యేనియున్ విను జనార్దన యెన్నడు బొంకు పల్కమ
త్య గణిత విక్రమోరు బలధైర్యసమగ్రుల మట్లుగాక తా
లగతి దొంగ(ద్రోవఁగఁ దలంబగునే యగు గాక నీకు మె
చ్చగ నిదె ప్రాణ మిచ్చెదము స్రుక్కము చావున కాత్మ నేమియున్

శ్రీహరి మధు కైటభులతో మీరు నా చేత చావవలయును. ఇదియే నేను కోరు వరము అన్నప్పుడు వారు మాటకు కట్టుబడి మరణమునకు సంసిద్ధతను ప్రకటించు సందర్భమిది. రాక్షసులయ్యును కొన్ని నీతి నియమములకు కట్టుబడి వర్తించు వారి పాత్రల చిత్రణ రమ్యముగ ప్రదర్శితము.

4 అప్పకవీయము - ఆ. 3. దేశ్య సమాస విశ్రాంతులు. (దేశ్యా ఖండములు) లక్షణము. దేశ్య నిత్య సమాస సంధికి బొసంగు వడి స్వరంబైన వ్యంజన వర్ణమైన.
అరణ్యపర్వము - ఆ. 6. 345.
క ఎఱుకలు గల కులశైలము తెఱగు మెఱయ నంత నతఁడు
దివికి నెగసి బి
ట్టుఱుము జలధరము క్రియ నుక్కఱఁదద్వన మెల్ల న్రదువ
నార్చుచుఁ గడిమిన్

రామోపాఖ్యానమున రావణుఁడెత్తుకొనిపోవు సీతయేడ్పును విని యామెను రక్షించుటకు గిరి కుహరములో నున్న జటాయువు ఆకసమున కెగిరిన నప్పటి

వర్ణన. జటాయువు కులశైలముతో పోల్చబడినది. మూలమున నిట్లు లేదు. దీని వలన జటాయువు యొక్క ఔన్నత్యము, వ్యక్తమగుచున్నది.

5. దేశ్య నిత్యసమాన విశ్రాంతుల సందర్భమునందే 'క్రచ్చఱ' శబ్దమునకు. అరణ్యపర్వము - ఆ. 7-367.

చ॥ ఎఱిగితి నిన్ను నేను విబుధేంద్రుఁడ వీవు జగత్త్రయంబు గ్ర
చ్చఱ భవదీయ రక్షణము నంద వెలుంగుచు నుండు నట్టి ని
న్నఱవుగ నేను వేఁడుకొనయుక్తుఁడ గాక మొఱంగి నన్ను న
క్కఱ పడి నీవు వేఁడుటది కర్జమె నిర్జిత దైత్య చెప్పుమా!

కవచకుండలములు దక్క మఱేదియు నొల్లనని పట్టుబట్టిన కపట బ్రాహ్మణు డింద్రుడని గుర్తించి కర్ణుడు పలికిన పలుకులివి.

6. ఇదే ప్రకరణమున అరణ్య. 6-357.

చ॥ ఉరమున రెండు గన్నులు పృథూదర దేశమునందు నోరు ప్ర
స్ఫురిత భుజ ద్వయంబును సముజ్జ్వల దున్నత భావముం గరం
బరుదుగ నుగ్రమైన వికృతాకృతి తోఁడ నశేష సత్త్వ సం
హరుఁడగు చున్న వాని దివిజారిఁగబంధుని గాంచి రచ్చటన్

రామోపాఖ్యానమున కబంధుని వర్ణనము.

7. అప్పకవీయము. ఆ. 3. ప్రాసభేదములు, స్వవర్గజ ప్రాసము.

తే. గ్రంథమంథ శబ్దంబులఁగల ద్వితీయ వర్ణములు రెండును
నఘోష వర్ణములగు
నైన నిజవర్గ భవ చతుర్థాక్షరములఁగలియుఁ బ్రాసంబులను
స్వవర్గజములనగ

వ. .........గ్రంథి శబ్దమునందు రెండవ ప్రాఁతు తవర్గమునందు ద్వితీయాక్షరమైనగాని ప్రాసములందు చతుర్థాక్షరములకు మహాకవి ప్రయోగములు గలుగుట వలనను చెల్లును.

అరణ్యపర్వము నందు - ఆ. 4.160.

ఉ॥ అంధక వృష్ణి భోజ కుకురాన్వయ భూపతులెల్ల నీ దెసన్
బాంధవ సౌహృద ప్రణయ భక్తివిశేషము లొప్ప నీ మనో
గ్రంథి యడంగఁజేయు నెసకంబునఁ బూనిన వారు లోభమో
హాంధులు ధార్తరాష్ట్రులు నయమ్ము మెయిన్ మనకుర్వి యిత్తురే.

శ్రీకృష్ణుడు సత్యభామా సమేతుడై కామ్యక వనమునందున్న పాండవుల కడకు వచ్చిన వారి పరామర్శించు సందర్భమున నుడివిన మాటలివి.

పూర్వ కవులనేకులు ఎఱ్ఱన్నను నిజనామముతోగాక బిరుద నామముల తోనే పేర్కొనుచుండు పరిపాటి యున్నదని వెనుక నొకచో చెప్పబడినది. ఈ విషయమున అప్పకవి అగ్రగణ్యుడనిపించును. కవిత్రయములో చిన్నవాడైనను ఎఱ్ఱన చెన్ను మీరిన వాడని యీతని అభిప్రాయము చూడుడు :-

1. పదములలో వ్యంజన లోపమునకు; పొనరె - ఒనరె ఇత్యాది - పకారము లోని స్వరమే నిల్చినందుకు ప్రబంధ పరమేశ్వరుడు చెప్పిన అహోబల మాహాత్మ్యమునందు. (ఆ. 2).

2 పొందెననుటకు శంభుదాసుని లక్ష్మీనృసింహావతార కథయందు (ఆ. 2).

3. నృసింహపురాణము నందు "శ్రీకి నిరంతరంబని" ప్రబంధ పరమేశవి భుండును.

4. ఆరణ్యపర్వావశిష్టంబునందు భీమకవి శాపథయంబున జయముగోరి "స్ఫుర దరుణాంశు రాగరుచి" యని శంభుదాసుండును. ఇత్యాది

## బాలవ్యాకరణము నందెఱ్ఱన స్థానము :

ఘను నన్నయ భట్టుఁ ది
క్కన నేర్పెగడఁ బొగడి యలికంబున యె
ఱ్ఱని డాఁచినట్టి సర్వ
జ్ఞుని నాచన సోమనాథు స్తుతి యొనరింతున్

—నీతిచంద్రిక - పీఠిక 4

చిన్నయ సూరి తన బాల వ్యాకరణమున భారత కవులను, వారి యను యాయులను మాత్రమే ప్రమాణముగ శిరసా వహించినాడు. ఈ బహుళాం ధ్రోక్తిమయ ప్రపంచమున కీ నల్గురు నొక దేవత యొక్క నాల్గు ముఖములని కాబోలు వీరిని మాత్రమే స్తుతించుట. ఈతడు చేసినదేమన పాణిన్యాది సంస్కృత వ్యాకర్తల మార్గము ననుసరించి ఆయా కవుల కావ్యముల నుండి పద్యములకు పద్యములే యుదాహరింపక కొన్ని పదములనో, పదబంధములనో, వాక్యము లనో, క్వాచిత్కముగ పద్యపాదములనో పరిగ్రహించి లక్ష్యములుగ ప్రదర్శిం చుట. అట్టి వానిలో నేఱ్ఱాప్రెగడవి కొన్ని గలవు. వానిని గుర్తుపట్టవలయును:-

1. సూత్రము- అవసానంబునందు ద్రుతస్వరంబునకేని ద్రుతంబునకేని లోపంబు బహుళంబుగా నగు. సంధి-20

ఈ లోపంబు పద్యాంశముల యందు గణానుసారంబుగ వ్యవస్థితంబై యుండు. గుర్వవసాయి యగు పద్యంబు తుదను స్వత్వంబు లేదు.

లక్ష్యము - అతిశయముగ బుద్ధిమంతుడగు బుధసేవన్.

ఇది అరణ్య - ఆ. 7. యక్ష ప్రశ్నలలోనిది. యక్షుడు ధర్మజునడిగిన రెండవ ప్రశ్న పద్యమిది:

క॥ ఏమిట శ్రోత్రియుఁ డనఁజను?
నేమిటఁగడు మహిమ వడయు నిమ్మగఁబురుషుం?
డేమిట సహాయయుతుఁడగు?
నేమిట నగు బుద్ధిమంతుఁడేర్పడఁ జెపుమా? 426

ధర్మజుడు చెప్పిన సమాధాన పద్యమిది:

క॥ శ్రుతము వలన శ్రోత్రియుఁడగు;
నతుల తపోయుక్తిఁగడు మహత్త్వము వడయున్
ధృతిచే సహాయ యుతుఁడగు;
నతిశయముగ బుద్ధిమంతుడగు బుధ సేవన్ 428

కందమున నున్న ప్రశ్నకు కందములోనే సమాధానము. ఇదొక శిల్పము. అన్నియు నిట్లుండునని భ్రమపడరాదు. కొన్నిమాత్ర మిట్లుండును.

2. సూత్రము - ఓరి యోసి మైత్రి యందుం గలవు. తత్సమ-16.

ఓరి చిన్నికృష్ణ! ఓసి ముద్దుబాల! ఓయి మొదలగు వానికి స్వతంత్ర ప్రయోగముం గలవు.

లక్ష్యము - ఓరోరి యింకెందుఁబోవ వచ్చు. అరణ్య. ఆ. 6-245.

ఇది సైంధవ పరాభవ ఘట్టములోనిది. యుద్ధమున పరాజితుడై పఱచు చున్న సైంధవుని వెంబడించిన భీమార్జునులు వాని జూచినవ్వుచూ పలికిన మాటలివి :

> వానిఁ జూచి నగుచు వార "ఓరోరి! యిం
> కెందుఁబోవవచ్చుఁబంద! నిలువు
> మిట్టి కడిమి నమ్మియే ప్రల్లదంబులు
> సేయఁదొడగి తనుచు డాయుటయును.

ఎఱ్ఱన గారివి మఱికొన్ని పదములు, పదబంధములు లక్ష్యములుగా నివ్వ బడినవి. అవి కవిత్రయ ప్రయోగ సాధారణములగుట వలన ఎఱ్ఱన పరముగా విశేషించి చెప్పవలసినది లేదు. చిన్నయసూరి బాలవ్యాకరణమున పేరుపెట్టి పేర్కొన్న దొక్క వాగను శాసనులను మాత్రమే. తిక్కన వారికా గౌరవము లభించలేదు. ముగ్గురు నల్గురు కవుల పద్యముల నుండి ఒకటి రెండు పాదములకు పాదముఁనే పరిగ్రహించి ఉదాహరించినాడు. అట్టి వారిలో నెఱ్ఱనార్యుడొకడు!

## ప్రౌఢ వ్యాకరణము నందెఱ్ఱన స్థానము :

బాలవ్యాకరణము వెంట ప్రసిద్ధినందినది ప్రౌఢ వ్యాకరణము. దీనిని నిర్మించిన బహుజనపల్లి సీతారామాచార్యుల వారు తమ శబ్ద రత్నాకరమున ఎఱ్ఱన్నను గూర్చి యిట్లు ప్రశంసించిరి!

"ఇతడు ప్రబంధ పరమేశ్వరుడని బిరుదు వహించిన దొడ్డకవి.............. ................................భారతము నందు నన్నయ భట్టారకుని కవిత్వమున నాంధ్ర పదంబులు కొన్ని సంస్కృత పదంబులు మెండు. తిక్కన సోమయాజి కవిత్వమున సంస్కృత పదంబులు గొన్ని యాంధ్ర పదంబులు మెండు. ఎఱ్ఱా ప్రెగడ కవిత్వమున సంస్కృతాంధ్ర పదములు రెండును మణిసరంబు గుచ్చి

నట్లు సమముగా నుండును. ఈ మూటికిని శాకభేదంబును గలదు. వీరి కవిత్వ ములు సర్వవిధంబుల చేతను మిక్కిలి శ్లాఘనీయములనుట విశేషము గాదు. (పుట. 42).

ప్రౌఢ వ్యాకరణమున గురుపీఠము నధిష్ఠించిన గ్రంథము నన్నయ భార తము. ఇందుండి 180 పద్యము లుదాహరింపబడినవి. తిక్కన నిర్వచనము నుండి 29, భారతము నుండి 48, మొత్తము 77 పద్యము లుదాహృతములు. ఈ వరుసలో మామూలుగా మూడవ స్థానము నాక్రమింపవలసిన వా డెఱ్ఱన. కాని యిది పింగళి సూరన్నకు దక్కినది. ఈతని కళాపూర్ణోదయము నుండి 58, ప్రభావతీప్రద్యుమ్నము నుండి 5, రాఘవ పాండవీయము నుండి 3, మొత్తము 66 పద్యము లుదాహరింపబడినవి. పిమ్మటి స్థానము ఎఱ్ఱన్నది. ఈతని హరివంశము నుండి 43, నృసింహ పురాణము నుండి 4, అరణ్యపర్వ శేషము నుండి 13, వెరసి 60 పద్యములు లక్ష్యము లయినవి. అనగా ఎఱ్ఱన్నవి కంటె సూరన్నవి 6 పద్యము లధికము. ఈ కొద్దిపాటి వ్యత్యాసము నంగీక రించుచు ఎఱ్ఱన్న స్థానము ఎఱ్ఱన్నకు పదిలముగ భద్రపరుపబడినదని భావించుట లెస్స. అరణ్యపర్వ శేషము నుండి గ్రహింపబడిన 13 పద్యములకు సందర్భ సహితముగ లక్షణ సమన్వయము :

1. సూత్రము - విశేషణంబులు కొన్ని యెడల విశేష్య లక్షకంబులగు.
—శబ్దపరిచ్ఛేదము - 12

ఉదా :- బెట్టిదంబులం గాని చక్కంబడడు (బెట్టిదంబులన్ + బెట్టిదపు మాటలచే)

వచనము- అనిన నయ్యంగన క్రోధ కలుషితాంతరంగయై యిప్పాపా త్ముండు ప్రియవచనంబులన్ బోవడు. బెట్టిదంబులంగాని చక్కంబడడని తలంచి యిట్లనియె. (ఆ. 6-173).

సైంధవుడు ద్రౌపదితో వావి వరుసలు దప్పి వదఱు మాటలాడుచుండగా నామె తనలో ననుకొన్న వాక్యములివి.

2. సూత్రము- ఉదంతములగు నమహత్తుల కందు వర్ణకము పరంబగునేవు డును నగాగమంబు కొన్నియెడల గానంబడియెడి.
—శబ్దపరిచ్ఛేదము - 21

ఉదా :- దేవ, నీ వనిమిషనాయకత్వమున యందభిషిక్తుడవై ముదంబుతో
నను బనిగొమ్ము - (ఆ. 5-226)

ఇంద్రుడు కుమారస్వామిని ఇంద్ర పదవి నధిష్ఠింపుమని ప్రార్థించు సందర్భములోనిది.

3\. సూత్రము- సంబంధంబున యుష్మదస్మచ్ఛబ్దంబులకుం గొన్నియెడల
బహుత్వంబగు.

—శబ్దపరిచ్ఛేదము - 46

ఉదా :- మాయత్త పృథ్వీ సమాన పృథాదేవి. (ఆ. 5-306)

సత్యాద్రౌపదీ సంవాదములోనిది. ద్రౌపది తన యత్త కుంతీదేవి గుణ గణములను పొగడి ఆమె యొక్క, తన భర్తల యొక్క అభిమానమును చూఱ గొనుటకు తానెట్లు వారికి పరిచర్యలు సేయుచుండునో సత్యభామకు వివరించు చున్నది.

4\. సూత్రము- మహద్విశేషణ సంఖ్యావాచకంబులకుం గొన్ని యెడల
నమహత్కార్యంబు చూపట్టెడి.

—సర్వనామ ప్రకరణము - 104

ఉదా :- 1. జనవంద్యుడు ధర్మతనయుని బంతి నిత్యంబు బసిండి
పళ్లెరంబులఁ గుడ్చు బ్రాహ్మణులతి పుణ్యులెనిమిది వేలు
సమిద్ధమతులు యతులు బదివేలు వారల కనుదినంబు నన్న
పానంబులందు సహాయనగుదు. (ఆ. 5-306).

2\. కనకభూషణాలంకృతులయిన పరిచారకులు నూఱువేలు.

—ఆ. 5-307

ఈ రెండును సత్యాద్రౌపదీ సంవాదము నందు పూర్వోక్త సందర్భము లోనివి.

5\. సూత్రము- షష్ఠీ స్థానికంబగు కువర్ణకం బొక్కచో ద్వితీయాది విభక్త్యులకు
మాఱుఁగా ద త్తదర్థంబులం జూపట్టెడి.

—కారక - 18

ఉదా:- ద్వితీయకు ! వేటకుఁబోయిరి, పక్షంబున వేటఁబోయిరి.

ధర్మజుఁడు దూర్పు, భీముఁడు దక్షిణంబు
నర్జునుఁడు పడమర గవలర్థి నుత్త
రంబుగా వేటఁబోయిరి, రాజ ముఖ్యు
లనఘు లింతకు వత్తురు వినుత బలులు

—ఆ. 6-158

సైంధవుని పనుపున నాతని సఖుడగు కోటికాస్యుడు ద్రౌపదిని సమీపించి మాటలాడుచుండ నాతని దుర్బుద్ధిని పసిగట్టిన ద్రౌపది తన విషయము కొంత చెప్పి పతుల విషయమును గూర్చి చెప్పు సందర్భము.

6. సూత్రము- కొన్నియెడల నజడంబు ద్వితీయకును ప్రథమ కానంబడి యెడి. —కారకము 19

ఉదా :- తన వారణేంద్ర మక్కురుకులవీరు మీద నెసకొల్పిన.
ఆ. 6 - 228

ఇది యుద్ధ సమయమున సైంధవుని సైనికుడు సురథుడను వాడు తన గజమును నకులునిపై నుసిగొల్పిన సందర్భము.

7. సూత్రము- ఒక్కచో సమాసాంతర్గత విశేష్యంబుల కగు విశేషణంబుల షష్ఠికిని ప్రథమ చూపట్టెడి.

—కారక. 21

ఉదా :- పార్థివ ప్రాగ్రసరుండు ధర్మసుతు పన్పిది నీకు నలంఘ్యము.
—ఆ. 6-416

గంధర్వ వీరుల బంధనము నుండి దుర్యోధనుని విడిపించుటకు భీమార్జునులు వచ్చిరి. దుర్యోధనుని విడిపించుట తమ ధర్మమని, ధర్మజు నాదేశము మేఱకు దుర్యోధనుని విడిచిపెట్టుడనియు అర్జునుడు వారికి చెప్పు మాట.

8. సూత్రము- తమ్ముగుఱ్ఱలు చిలుక మొకరి యిత్యాదులు విశేష్య పూర్వ పద కర్మధారయంబులు.

—సమాన పరిచ్ఛేదము 16

ఉదా :- "తమ్మగుఱ్ఱలు నీవుఁదగ విప్లినంబున కరిగితిరి"
—ఆ. 7-113

యక్షప్రశ్నల ఘట్టము. కొలని నీరు త్రాగి తమ్ములు మరణించిరి. వచ్చునప్పుడు అందరము కలిసివచ్చితిమి; ఇప్పుడు నేనొంటరిగా నింటికిపోయి, తమ్ములేరని తల్లియడిగిన ఏమి చెప్పుదును? అని ధర్మజుడు విలపించు సందర్భము.

9. సూత్రము- అట్లుపోలె బలె వలె శబ్దంబు లివార్థకంబులు..........అట్లు కరణ్యాదులకు గ్రాహకము.

—సమాస పరిచ్ఛేదము - 38

ఉదా :- భీరుల వోలె నేల వెలిపించెదు మాటల మమ్ము.

—ఆ. 6-182

ద్రౌపది సైంధవునకు వాతబెట్టినట్లు నిష్ఠురోక్తులాడగా నాతడు నవ్వుచు నామెతో పలుకు పలుకులివి.

10. సూత్రము- కొన్నియెడల భావార్థక రూపము నుశబ్దపరకంబయి యానం తర్యార్థకంబయ్యెడి.

—క్రియాపరిచ్ఛేదము - 12

ఉదా :- అనుటయు లుబ్ధకుండిట్లనియె.

—ఆ. 5-32

కౌశికుడు జీవహింస చేసి జీవించుట ధర్మమా యని ప్రశ్నించి యిట్టి పాపకర్మమునకు తాను మిక్కిలి దుఃఖించుచున్నానని పలుకగా ధర్మవ్యాధుడు చెప్పబోవు సమాధానమునకు సూచనా వాక్యమిది.

11. సూత్రము- అన్ప్రత్యయాంతమగు నగు ధాతువు కొన్నియెడలఁ బెక్కుచోట్ల కొక్కటియు నగు. —క్రియా. 30

ఉదా :- ధర్మజుడు తూర్పు, భీముడు దక్షిణంబు. —ఆ. 6-158

ఈ పద్యము వెనుక నొకచో నుదాహరింపబడి వివరింపబడినది.

12. సూత్రము- కొన్నియెడల నవయవ కర్తృక క్రియ తదవయవికర్తృకంబగు. —వాక్యపరిచ్ఛేదము - 17

ఉదా :- తేకువసెడియె నీపాఱుండు. (చెడియెన్ చెడుట కలవాడాయె నని యర్థము). —అ. 4-358

ఇది వామ్యాశ్వహరణ ఘట్టములోనిది. శలుడు వామదేవుని యశ్వములను తిరిగి యివ్వకపోయెను. వామదేవుడాతని కడకుపోయి తన యశ్వములనిమ్మని యడుగ శలుడు దురహంకారముతో వామదేవునకు హానికలిగించుటకు తలపెట్టును. ఆ సంభాషణాక్రమమును తెలుపు సందర్భము.

## ప్రౌఢవ్యాకరణమునందెఱ్ఱనకు లభించిన ప్రత్యేకమైనగుర్తింపు :

ప్రౌఢ వ్యాకరణమున ఎఱ్ఱనార్యుని లాక్షణికతను నిరూపించుటకే యన్నట్లు అతని కొక్కనికొరకే కొన్ని సూత్రములు వ్రాయబడి యాతని గ్రంథములనుండి మాత్రమే యుదాహరింపబడిన పట్టులుగలవు. పై నుదాహరించినవానిలో 11, 12 సంఖ్యలుగలవి రెండున్నవి. అవిగాక, అరణ్యపర్వ శేషములోనివి కాకపోయినను అతని హరివంశములో నుండి యీయబడిన వానిని లక్ష్య లక్షణపూర్వకముగ నిట పేర్కొనుట విషయనిరూపణ కొరకు ఆవశ్యకము :

1. సూత్రము - ఒకొక్కచో విశేష్య విశేషణంబులు వ్యత్యస్తంబులు నగు.
—శబ్దపరిచ్ఛేదము - 9

ఉదా : - నీమారు దల్లి త్రిభువన భామారత్నంబు గంధవతిపై.
—హరి. పూ. అ. 2 - 170

2. సూత్రము - విశ్వకర్మ దనియు రూపంబు.
—శబ్దపరిచ్ఛేదము - 27

ఉదా - విశ్వకర్మని కూఁతు విశదలావణ్య సముజ్జ్వలఁజేకొని మూరిబోయి.
—హరి ఉ. అ. 4 - 45

3. సూత్రము - ఉద్దేశార్థమునందు ద్వితీయకు గుఱిచియునగు.
—కారక - 2

ఉదా : - "మము గురిచి నామగోత్ర, క్రమమున మీరర్చసేయగా"
—హరి. పూ. ఆ. 2 - 9

4. సూత్రము - అయ్యది వ్యవహితంబునగు.
—కారక - 8

ఉదా : - సీ. అబ్జాసనుఁడు తన్నునర్థితో గుఱిచి యజించుటగోరి సృజించె సురల.
—హరి. పూ. ఆ. 2 - 98

పఠన పాఠనములలో ప్రచారమునందున్న ముఖ్యములయిన యీ మూడు లక్షణగ్రంథములనుండి మాత్రమే యిట నుదాహరింపబడినవి. అందునను ప్రస్తుతాంశమున కవసరము గాన నరణ్యపర్వ శేషము నుండి మాత్రమే లక్ష్యములు పరిగ్రహింపబడినవి. ఈ మూడింటిలోనేగాక, తక్కిన లక్షణ గ్రంథములలో నీతని యెల్ల గ్రంథములనుగూర్చి చాలినంత లభించును. లక్ష్య లక్షణ కళాలంకార సౌభాగ్య సత్కావ్యవిన్యాసు శంభుదాసుదలచి విరమించటమైనది.



# అనుక్రమణిక

# చిత్రకవిత్వ వాగ్వైభవ జృంభణము

ఉ॥ ఈత్రయిఁదాఁ ప్రబంధ పరమేశ్వరుఁడై విరచించె శబ్దిపై
చిత్రి నరణ్యపర్వమున శేషము శ్రీనరసింహ రామ చా
రిత్రములన్ బుధవ్రత గరిష్ఠత నెఱ్ఱయ శంభుదాసుఁడా
చిత్ర కవిత్వ వాగ్వైభవ జృంభితుఁగొల్చెద భక్తియుక్తితోన్

—జక్కన, విక్రమార్క చరిత్ర - అవతారిక - 14

"పరిఢ వింతు ప్రబంధ పరమేశ్వరుని శేవ సూక్తి వైచిత్రి నొక్కొక్క మాటు"

—శ్రీనాథుడు - కాశీఖండము - ఆ. 1-13

ఇట్లు ఎఱ్ఱన కవితలో జక్కన "చిత్ర కవిత్వ వాక్యాను" "శబ్దవైచిత్రి"ని శ్రీనాథుడు "సూక్తి వైచిత్రి"ని కనిపెట్టిరి. జక్కన తాను కనిపెట్టిన యీ కవితా లక్షణములను తన కవితలో పరిఢవింతునని చెప్పలేదు. శ్రీనాథుడు చెప్పినాడు; ఈ భేదమును గమనింపవలెను. ఇంతకును, అటు జక్కనగాని, ఇటు శ్రీనాథుడు గాని యీ 'చిత్ర' 'వైచిత్రి' పదములను ఎక్కడనుండి కొనితెచ్చిరి? ఎఱ్ఱన రాజరాజును సంబోధించుచు ఈ పద్యములను వ్రాసినాడు :-

కం. శ్రీలలిత మూర్తి! సుమహా
చ్చాళుక్య వరేణ్య! పుణ్యచారిత్ర! విచి
త్రాలంకా రోజ్జ్వల కవి
తాలాప కలాప సంతతానంద మతీ!

—అరణ్య. ఆ - 6-1

కం. శ్రీకర సోమాన్వయ ర
త్నాకర హిమధామ! ధార్మికాంచిత వినయో
త్సేక! భువనైక వీర! మ
హాకావ్య రసప్రయోజనా రూఢమతీ!

—అరణ్య. ఆ. 7-1

ఇందలి "విచిత్రాలంకారోజ్జ్వల...." "మహాకావ్య రసప్రయోజనా...." అనునవి భంగ్యంతరముగ ఎఱ్ఱన కవితాలక్షణములుగ భావింపవచ్చును. ఈ 'విచిత్ర' పదమును పరిగ్రహించియే జక్కన 'శబ్దవైచిత్రి' అనియు, శ్రీనాథుడు 'సూక్తివైచిత్రి' యనియు ప్రయోగించిరని చెప్పవచ్చును. ఈ రెండింటిని గూర్చియు రాబోవు ప్రకరణములందు పరిశీలింతుము. ఇప్పటి మన ప్రతిపాద్య విషయము "చిత్ర కవిత్వ వాగ్వైభవ జృంభణము" అన్నది. జక్కన యొక్క వక్కణను బట్టి యెఱ్ఱనగారి ప్రబంధములలో- అరణ్యపర్వ శేషమునందు సైతము - చిత్రకవిత్వముండి యుండవలెను. చిత్రకవిత్వము, బంధకవిత్వము, గర్భకవిత్వము - ఈ మూడును ఒక్కటి కాదనియు, వేఱు వేఱు విధములనియు తొలుత గ్రహింపవలయును !

## అరణ్యపర్వ శేషమున చిత్రకవిత్వము లేదు

అప్పకవి చతుర్థాశ్వాసమున 362వ పద్యములో పదిహేడు తెలుగుల చిత్రకవిత్వమును గూర్చి చెప్పి అన్నింటికి లక్ష్యముల నిచ్చి యుండెను. వానిలో ఒక్క తెలుగు చిత్రకవిత్వముకూడ అరణ్యపర్వ శేషమున కానరాదు. నృసింహ పురాణ హరివంశములందు కూడ పరిశీలించిన మేఱకు నట్టి కవిత్వము లేదనియే చెప్పవలయును. ఆయా ప్రబంధములను క్షుణ్ణముగ నధ్యయనమొనర్చి పరిశోధనలు సల్పిన మహనీయులెవ్వరుగాని అసలా విషయమునే స్పృశింపకపోవుట వలన ఇప్పటికి నిర్ణయమునకు రావచ్చును. ఎఱ్ఱన తొలికృతియగు రామాయణ ప్రబంధము నందైనను, ఇట్టి కవిత్వముండి యుండునా? అది యలభ్యమగుట వలన నిర్ణయము కడు దుర్లభము!

ఇప్పటికి చేసిన యీ పరామరికను బట్టి యెఱ్ఱనగారి యితర ప్రబంధముల విషయ మటుండనిచ్చి, అరణ్యపర్వ శేషములో నీ చిత్ర కవిత్వము లేక పోవుటకు కారణ మిట్లూహింపవచ్చును :-

ఉదాత్తమైన నన్నయగారి భారతమున రసపుష్టిలేని యిట్టి చిత్ర కవిత్వమును ఊహించుటకు సైతము వీలులేదు. "తత్కవితారీతియు కొంతదోప తద్రచన యకాన్" పూరింపబడిన అరణ్యపర్వ శేషమున దీనికి తావెట్లు వచ్చును? అప్పకవి మాటలలో నిది "తెలివి మీఱిన" కవిత్వము. రానురాను పెంపొంది

తరువాతి కవుల నాకర్షించినది కావలయును. అగ్రశ్రేణికి చెందిన ప్రాచీనాంధ్ర మహాకవుల నాటికిది అస్తిత్వము లేని, అనపేక్షితమైన, ఉపేక్షిత కవిత్వమన వలయును. ఇది సాధారణ నిర్ణయము.

## అలంకార ప్రయోగ వైచిత్రియే చిత్రకవిత్వ వాగ్విభవము

మఱి యీ "చిత్రకవిత్వ వాగ్విభవ జృంభితునకు" అన్న మాట కర్థ మేమో పరిశీలింపవలయును. ఎఱ్ఱనకు ఏకలవ్యుని వంటి శిష్యుడనదగిన జక్కన వంటి మహాకవి తన గురువును గూర్చిన యింతటి ప్రశంస ఊరక చేయదుగదా! దీని సార్థక్యమేమి?

ఎఱ్ఱన రాజరాజును "విచిత్రాలంకారోజ్జ్వల కవితాలాపకలాప సంతతా నందమతీ" అని సంబోధించెననియు, ఇది భంగ్యంతరముగ నెఱ్ఱన కవితా లక్షణ మునకు సూచకముగ భావింపవచ్చుననియు పూర్వోక్తము. దీనిని బట్టి అలంకార ములను చిత్రముగా వాడుటయే "చిత్రకవిత్వ వాగ్విభవము" అని భావించుట సమంజసము. దీనికితోడు "మహాకావ్య రసప్రయోజనారూఢమతీ" యన్న మఱొక సంబోధనను గూడ నిచ్చట అనుసంధించుకొనవచ్చును. అప్పుడు అలం కారములు, రసము, తక్కిన కవితాగుణములు ఒక పరిధిలోనికి వచ్చి, యీ సర్వమును చిత్రవిచిత్రముగా రంగరించి పోయుటయే చిత్రకవిత్వ వాగ్విభవమని తేలును. ఈ "చిత్రవైచిత్రి" పదములు ఎఱ్ఱన కవితను తక్కిన మహాకవుల కవితాగుణముల కంటె భిన్నముగ, వేఱు చేయుచున్నవని గ్రహింపవలెను!

## చిత్రశబ్ద ముద్రిత పద్య సప్తకము:

ఎఱ్ఱన అరణ్యపర్వ శేషములోని కొన్ని పద్యములలో 'చిత్ర' 'విచిత్ర' శబ్దములను ముద్రించి అందలి భావమును రసప్రవణముగ, చిత్రముగ వ్యక్తము చేయుచుండును. ఇది ప్రత్యేకముగ గమనింపవలసిన విషయము. కొందఱు కవులు కొన్ని పద్యములలో ముద్రాలంకారములను వాడుట కలదు. ఆ పద్ధతిలో కావలయును, ఎఱ్ఱన "ముద్రాశబ్దములను" ప్రయోగించు చుండును. వానిలో 'అద్భుత' 'విస్మయ' 'చిత్ర' 'విచిత్ర' శబ్దములు ప్రముఖముగ నుండును. ఇవి యాతని యితర ప్రబంధములలో గూడ గోచరించుచున్నవి. అరణ్యపర్వ శేషములో 'చిత్ర' 'విచిత్ర' శబ్దములెట్లెట్లు ముద్రింపబడినవి! దానినిబట్టి

యాతని "చిత్ర కవిత్వ వాగ్విభవ" మెట్లు సార్థకమగుచున్నది! అను విషయ మును పరిశీలించవలయును. ఈ శబ్దములు ముద్రింపబడిన తావులందు మాత్రమే యట్టి వాగ్విభవమున్నదనియు, లేనిచోట్ల లేదనియు ననుకొనరాదు. ఇట్టి ముద్ర లున్న తావులందు కంటె నొక్కొక్కప్పుడు లేని తావులందే యెక్కువ 'చిత్ర' లక్షణములుండుటయు కద్దు. ఇదంతయు ఒక 'నమూనా'ను సమర్పించి, ఒక దృక్పథమును కలిగించుటకు చేయు ప్రక్రియగా మాత్రమే పరిగ్రహించుట లెస్స.

1. ఉ॥ పెల్లునఁగూలు తజ్జలము పెక్కువ నొక్కట నమ్మహానలం
బెల్లను నాఱిపోవుఁ బృథివీశ్వర! యేఱులు నబ్ధులున్ వెసం
దొల్లిటియట్లనిండుఁ బటతోయద సంఘములంతఁబోక గ
ర్జిల్లుచు వెండియుం గురియుఁ జిత్రముగాగ ననేక కాలముల్
—అ. 4-247

మార్కండేయుడు తొల్లి తాను చూసిన ప్రళయ ప్రకారమును ధర్మజు నకు వివరించు సందర్భమిది. అద్భుతావహమగు నొకానొక విషయమును స్వయముగ చూచునప్పటి కంటె, ఇతరులకు వర్ణించి చెప్పునప్పుడు వక్తకును శ్రోతకును కలుగు నాశ్చర్యమునకు మేఱలుండవు. వక్త తాను చూసిన దృశ్య మును శ్రోత కండ్లకు కట్టించుటకు ప్రయత్నించును. అప్పుడా భాషలో నొక వైచిత్రి వచ్చిపడును. ఇంతకన్న వర్ణించుటకు వీలులేదన్న పరిస్థితిలో కొన్ని పడికట్టు పదచిత్రముల నుపయోగించును. అందువలన వస్తుస్థితి యొక్క స్వభా వము "ఇట్టే" మనోగోచరమై ఆశ్చర్యానందములు కలుగును. ఈ పద్యమున "చిత్రము గాగన్" అన్న మాట యీ సర్వమును నెఱవేర్చుచున్నదని గ్రహింప గలము! "పెల్లునగూలు"- అన్న యనుకరణ ధ్వని శబ్దయుక్తమగు నెత్తుగడతో ఒక్కుమ్మడి క్రమ్ముకొని వచ్చిన జలప్రళయము అంతలోనే అద్భుత రస ప్రళయముగ మాఱి సుడులు తిరుగుచు వచ్చి "చిత్రము గాగన్"అన్న మాటలో చిత్రముగ పర్యవసించినట్లు చెప్పుట మహాశిల్పము! ప్రళయ తత్త్వము యొక్క స్వభావమును స్వభావోక్తితో రమణీయ మొనర్చుట యీ పద్యమునందు చిత్ర శబ్దముద్ర యొక్క ప్రయోజనము!

2. వ॥ "నారాయణాభిధానుండనైన యేను బాలరూపంబున శంఖ చక్ర గదాధరుండనై యేకార్ణవంబునందు మహాయుగ సహస్రమయంబయిన కాలంబున యోగనిద్రా పరవశుండనై యుండుదు. నిట్టి దారుణ కల్పాంతంబు సూచి నీవు భీతుండవగుటెఱింగి నీకులని యనుగ్రహంబున నాత్మగుప్తంబులైన సకల లోకంబు నీకుం గనునట్టి తెఱంగులు గావించితి; నింక నిశ్శంక హృద యుండవయి వలసిన యెడం జరియింపుము; మదీయ నాభి కమల కర్ణికాశయ నుండయి యున్న చతురాననుండు మేల్కాని సృజియించు లోకంబు లేర్పడం జూచెద"వని యానతిచ్చి యద్దేవుండంతట నంతర్హితుండయ్యె; నత్యంత "విచిత్రంబైన" యీ వృత్తాంతంబంతయు నాకు ననుభవ గోచరంబైనయది" –ఆ. 4-281.

మున్ను సంభవించిన ప్రళయ ప్రకార కాలమున నారాయణుడు మార్కండేయునకు తన ప్రభావమును చెప్పెను. అది యిప్పుడాతడు ధర్మజునకు వివరించుచున్నాడు. సృష్టి ప్రళయములు పర్యాయ క్రమములో జరిగిపోవుచుండును. ఇప్పుడు ప్రళయము జరిగినది. ఇకముందు సృష్టి జరుగబోవుచున్నదట! ఈ జరుగబోవు సృష్టి ప్రకారమును మార్కండేయుడు చూడగలడని నారాయణుడు సెలవిచ్చెను. ఈ వృత్తాంతంబంతయు మార్కండేయునకు "విచిత్రంబై" అనుభవగోచరమైనదియట! వెనుకటి పద్యమున "ప్రళయప్రకారము "చిత్రముగ" తోచినది. ఈ వచనమున సృష్టిప్రకారము "విచిత్రంబై" అనుభవ గోచరమైనది. ఇచ్చట అత్యంత విచిత్రంబైనది యీ వృత్తాంతమే గాదు; ఎఱ్ఱనార్యుని వచన రచనా రంగవల్లీ విన్యాసము కూడ మిక్కిలి విచిత్రముగ నున్నది!

3. కం॥ ఆ దివ్యాస్త్రజ్వలనము
ధూదిగ్గగనములు నిండి పొదివి మహోగ్రం
బై దానవు ఘన దేహము
బూదిగ నొనరించెఁ జిత్రముగ నొకమాత్రన్
—ఆ. 4-412

కువలాశ్వుడు ధుంధుడను దానవునిపై బ్రహ్మాస్త్రమును ప్రయోగించెను. దాని నుండి వెలువడిన జ్వలన జ్వాలలు భూనభోంతరాళముల నావరించి యాతని ఘన శరీరమును ఒక్క త్రుటిలో చిత్రముగ బూడిద చేసినవట!

బ్రహ్మాస్త్ర జ్వాలలు ఒక్కుమ్మడి వెలువడుటయు, భూనభోంతరాళములు ఆవరించుటయు, దానవ దేహమును సురసురమని కాల్చి మసి చేసి, గుప్పున ఆరిపోవుటయు – ఈ సర్వ ప్రక్రియ ఎప్పుడెట్లు జరిగిపోయినదో గమనించుటకు వీలుకానంతటి క్షణములో, చిత్రములో చిత్రముగ పూర్తియైనదట! అంతలోనే మన కండ్ల యెదుట పిడికెడు బూడిద కుప్పబోసినట్లుండుటయు నద్భుతమగు దృశ్య ప్రకారము! ఇది చిత్రము!

ఇచ్చట 'చిత్ర' శబ్దము లేకపోయినను ఈ ప్రక్రియ యొక్కయు, వస్తు స్థితి యొక్కయు అద్భుతము రూపుకట్టును. మఱి దానిని ప్రయోగించుటలో గల విశేషమేమి! అన్నది ఒక్క క్షణమాలోచింపవలెను.

శ్రీమహావిష్ణువే లోకకల్యాణము కొఱకు ఈ రాక్షసుని చంపించుటకు ఉదంకుడను ముని ద్వారా బృహదశ్వుని కుమారుడగు కువలాశ్వుని ప్రేరించెను. అందుకొఱకు, కువలాశ్వునికి యోగబలమును కూడ ప్రసాదించెను :- "అన్నరేం ద్రుండు మత్ప్రసాద లబ్ధంబైన యోగబలంబున.... అయ్యసురం బరిమార్ప సమర్థుండగు" (వచనం - 379. ఆ. 4). ఈ యోగ విద్యాప్రభావము చేతనే కువలాశ్వుడీ రాక్షసుని హతమార్చగలిగెను. కాగా, ఈ 'చిత్ర' శబ్దము వెనుక యోగ విద్య గుప్తమై యున్నదని గ్రహింపవలెను!

ఇది కంద పద్యము. ఈ చిన్న పద్యమునందున్న శబ్దములు, వానినుండి వెలువడిన భావజ్వాల! ఇది.

4\. ఉ॥ పాప వినిశ్చయుండు సతి పయ్యెద కొంగు గడంగి పట్టినం
గోపముతో నుదల్చికొని కోమలియున్ వెసవాని ద్రేయుడుం
బోపడి వాడు చిత్రముగ భూమి తలంబున ద్రెళ్లె మారుతా
క్షేప విభగ్న మూలమయి చెచ్చెరఁ ద్రెళ్లు మహీరుహంబునాన్

—ఆ. 6-190

సైంధవుడు ద్రౌపదినీ బలాత్కారముగ నెత్తుకొనిపోవు సందర్భమిది. సైంధవుడు సింహబలుడు! ద్రౌపదియో కోమలి! వాడీమె కొంగును పట్టు కొనెను. ఆమె వానిని ఒక్కతోపు త్రోసినది. వాడు, గాలితాకిడికి త్రెళ్లిపడిన

వృక్షమోయన్నట్లు చిత్రముగ త్రెళ్లి నేల గూలినాడు. అలంకారము హేతూ త్ప్రేక్ష.

ఇచట ఊర్జస్విదలంకారము కూడ నున్నది. భావమునకు రసాభాస భావాభాసములు అంగమయ్యేనేని ఊర్జస్విదలంకారము. ఇచట సైంధవుడు ద్రౌపది పయ్యెద కొంగుపట్టుకొనగా నామె యాతనిని నేలకు త్రోసినది! ఇది యీ పద్యము యొక్క భావము. ఇందు రతిరూప భావము ఆభాసమై అంగమగు చున్నది.

చెట్టు నేలపై త్రెళ్లినప్పుడు ఫెళఫెళమని మ్రోతపుట్టును. సైంధవుడు నేలకు త్రెళ్లినప్పుడు అట్టి యాక్రోశపు టార్భాటము చేసి యుండునను వస్తు ధ్వని యిట ప్రతీయమానమగు చున్నది.

"మారుతాక్షేప విభగ్నమూలమయి...." అన్న తావున ఈ 'మారుత' శబ్దము చిత్రముగ ప్రయోగింపబడినది. దీని వలన ద్రౌపదియొక్క చిత్రమైన, ఒకానొక మానసిక స్థితి ప్రతీయమానమగుచున్నది ఈ 'మారుత'ము వాయు పుత్రుడగు భీమునకు సూచకముగ నున్నట్లు స్ఫురించుచున్నది. ద్రౌపదకి ఇట్టి కష్టములు దాపురించినప్పుడెల్ల నామె సాధారణముగ మనసులో భీముని తలచుకొను చుండును. అది యామెకు నూరట మాత్రమే గాక గొప్ప మనోబలమును కూడ నిచ్చుచుండును. అట్టి యావేశమేదియో ఇప్పట్టున కొంత పని చేసియుండును. కావుననే కాబోలును, ఆమె ఒక్క త్రోపుతో చెట్టంత మనిషిని అలవోకగ నేల బడగొట్టినది. అంతేగాదు; రాబోవు కథాక్రమమున భీముడే సైంధవునకు బుద్ధి చెప్పును. ఇన్ని యర్థములను ధ్వనింపజేయుచున్న హేతూత్ప్రేక్షయిది!

ద్రౌపదికిది మూడవ పరాభవము. మొదటిసారి దుశ్శాసనుని చేతను, రెండవసారి కీచకునిచేతను పరాభవింపబడినది. మూడవసారి సైంధవుని బారి పడినది. లోగడ జరిగిన రెండు పరాభవములనుండి, ఇట్టి కష్టస్థితిని తప్పించు కొనుటకు చాలినంత యనుభవమును గడించినది కాబోలు! మంచి ఒడుపుతో ఒక్కత్రోపు త్రోసినది. అతడు నేలబడినాడు. సైంధవుడు కామాంధుడు; ఒళ్లు తెలియని మత్తులో పైపైని తేలిపోవుచు ఉన్మత్తస్థితిలో నున్నవాడు. అట్టివాడొక చిన్నత్రోపుకే తేలికగ పడిపోవుట అబ్బురముకాదు. అయితే, ఇట్టి కారణములెన్ని చెప్పికొన్నను అంతటి బలవంతుడు కోమలియొక్క త్రేటునకు చిత్రముగ నిట్టి

పడిపోయినాడనుట వింతగనే తోచును. వీడింత చిత్రముగ పడిపోవుట కేదేని బలీయమైన కారణముండి యుండును, బహుశః ఇదికావచ్చును:

సైరంధ్రి వేషముననున్న ద్రౌపది కీచకునింటికి కల్లుదేర పోవుటకుముందు దినకరుం గనుంగొని "కీచకుని దెస నన్నొక కీడు తెఱువు నొరయకుండంగ రక్షింపు కరుణతోడ" అనుచుంగేలు మొగిచిన:

కం॥ తరణియు దుఃఖిత యగు న
త్తరుణిం గాచుటకు నత్యుదగ్ర భుజావి
స్ఫురణాఢ్యు నొక్క రక్కసుఁ
గరుణార్ద్ర మనస్కుఁడగుచు గ్రక్కున బనిచెన్

—విరాట. ఆ. 2-110

వ॥ వాడునుం బనిపూని యంబరతలంబున నదృశ్యాకారుండై వచ్చి నిలిచె- అని చెప్పబడినది. కీచకుడు ద్రౌపదిని కూల దాచినప్పుడు :

వ॥ "అట్టి యెడఁ బాంచాలీ రక్షకుండైన రాక్షసుండతని దొల్ల వేసిన" కీచకుడు వేటు వడినాడట ! —129

ఇదంతయు సమన్వయించి చూడగా ఈ రాక్షసుడే అదృశ్యాకారుడై సైంధవుడు ద్రౌపది పయ్యెద కొంగుపట్టినప్పుడు, ఆమెచేత వేటుపడి చిత్రముగ త్రెళ్లుటకు కారణభూతుడై యుండును!

ఎఱ్ఱనగారు వాడిన 'చిత్రముగ' అన్న శబ్దము వెనుకనిట్టి చిత్రమగు కథాంశము దాగియున్నదనియు, అది అదృశ్యశక్తి తత్త్వగర్భితమనియు తెలియవలెను.

5. ఉ॥ వీరుఁడు చిత్రయోధి దృఢవేధి గృతాస్త్రుడు భూరి బుద్ధి వి
స్ఫారుఁడు వాగ్విశారదుఁడు పార్థుల కూరిమి తమ్ముఁడుజ్జ్వలా
కారుడు ధర్మదక్షుఁడవికారుడు ప్రౌఢ పతంగ తేజుఁడ
ద్ధీరుఁడు పాండవుండు సహదేవుడు దేవ నిభుండు పెంపునన్

—ఆ. 6-214

పాండవులేవురు సైంధవునిపై యుద్ధమునకు వచ్చుచుండిరి. "ఆ వచ్చువారు నీ మగలు కాబోలు, వారిలో నెవ్వడెట్టివాడో చెప్పుము" అని సైంధవుడడుగను. అప్పుడు ద్రౌపది అనాదర క్రోధఘూర్ణితయగుచు నతనికి తన భర్తల గొప్ప తనమును వీర రసాత్మకముగ వర్ణించి చెప్పును. ఇచ్చట ఎఱ్ఱన ధర్మజునకు రెండు, భీమునకు రెండు, అర్జునునకు రెండు, నకులున కొక్కటి, సహదేవునకు రెండు చొప్పున మొత్తము తొమ్మిది పద్యములను పోతపోసినాడు ఇది సహ దేవుని వర్ణించు పద్యమనుట స్పష్టము.

ఇది ప్రథమావిభక్త్యంత పద్యము. పద్యమంతయు విశేషణములే. ఇందు "చిత్రయోధి" "దేవ నిభుండు" అన్నవి ముఖ్యములు. ఇతడు సహదేవుడు. పేరుకు తగినట్లు దేవనిభుండు! ఇతడు 'చిత్రయోధి' చిత్రముగ యుద్ధము చేయువాడు! ఇప్పట్టున వ్రాయబడిన పద్యములలో తక్కిన పాండవులెవ్వరికి, ఇట్టి విచిత్ర విశిష్ట విశేషణములు వేయబడలేదు. ఈ రెండింటికి ఒకానొక అంత స్సూత్రత గోచరించుచున్నది. ఎక్కడ దేవత్వముండునో అక్కడ చిత్రత్వ ముండును కాబోలు! కావుననే సహదేవుడు చిత్రయోధి! దేవసన్నిభుడు! విశే షణములను వేయుటలో ఎఱ్ఱనగారి మెలకువ గమనార్హము.

6. మ॥ కృతహస్తుండు ప్రహస్తుడాహవ కళాకేళి విదగ్ధుండు ద
ర్పితుడై తాకె విభీషణుం గడకమైఁ బెంపారి వారిద్దఱున్
శితశల్యోగ్ర మయూర పత్ర విశిఖశ్రేణీ శతచ్ఛన్నులై
ధృతి యొప్పారిరి చిత్ర వారిధర పంక్తిచ్ఛన్న శైలాకృతిన్
ఆ. 7-82

ఆహవ కళాకేళి విదగ్ధుడగు ప్రహస్తుడు రావణపక్షమువాడు. విభీషణుడు రాముని పక్షమువాడు. ఇర్వురు రాక్షసులే. కావున ఉత్తాలదేహులు. వీరు పర స్పరము విజృంభించి నెమలి కన్నులు కట్టిన వాడియైన వందలాది బాణముల పరంపరలను ఒకరిపై నొకరు వేసికొనిరి. వాటిచేత కప్పబడిన దేహములు గల వారు; చిత్రములైన మేఘ సమూహములచేత కప్పబడిన పర్వతముల వలె నొప్పారిరను ఉపమ అద్భుతరమణీయముగ నున్నది. ఇందలి సంస్కృత సమా సముల కట్టుబడియు విలక్షణ సుందరమైనది!

మయూరము చిత్రవర్ణము గలది. నెమలి కన్నులు పలురంగులతో చిత్రముగ మెఱయుచుండును. మేఘ సమూహములు పలురకములైన వన్నెచిన్నెల డాగులతో చిత్రముగ ప్రకాశించుచుండును. ఇరువురి కడనున్న ధనుస్సులు ఇంద్రధనుస్సులనుటను భావింపవలెను. ఈ ధనుస్సుల వలన కూడ ఈ చిత్రత్వము అధికతరముగ నున్నదని యూహింపవచ్చును.

ప్రకృతి వర్ణనమున ఎఱ్ఱన మించిన వాడని పలువురు విమర్శకుల నిర్ణయము. ప్రకృతి గతమగు చిత్రత్వమును, దేహధారుల తత్కాల స్థితియందు ప్రతిపాదించుటలో నెఱ్ఱనగారి నేర్పు మిక్కిలి కొనియాడదగినది!

7. ఉ॥ జైత్రులు గోత్ర భూమి ధరసారులు సాగరధీరు లుల్లస
చ్చిత్ర ధనుఃకళావిదు లజేయులు భూరిజయార్థులప్డు సౌ
మిత్రియు మేఘనాదుఁడు నమిత్ర విభేదులుఁదాకి రార్చి లో
కత్రయ భీకర ప్రధన కౌతుక వేగిత చిత్తవృత్తులై

—ఆ. 7-118

ఇందు "ఉల్లస చ్చిత్రధనుః కళావిదులు" అన్నది ముఖ్యము. ఇంద్రజిత్తు ఇంద్రజాల శీలుడు; మాయా యుద్ధము చేయును. లక్ష్మణుడు దివ్యాస్త్ర విద్యావిదుడు; మాయా యుద్ధమును ఛేదింపగలడు. ఈ 'చిత్ర' శబ్దము అటు ఇంద్రజిత్తు యొక్క శాంబరీ విద్యోపాసనను, ఇటు లక్ష్మణుని యొక్క దివ్యాస్త్ర విద్యోపాసనను గర్భీకరించుకొన్నదని గ్రహింపవలెను. "కౌతుక వేగిత చిత్తవృత్తులై" అన్న అను ప్రాసాత్త వాక్యపరణి రమణీయమైనది. తక్కిన పద్యమందలి సొగసు సుస్పష్టము. "జైత్రులు" అన్న యెత్తుగడయే చిత్రముగ నున్నది!

ఎఱ్ఱనార్యుడు ఈ చిత్రవిచిత్ర శబ్దములను ముద్రించి రచించిన పద్యములు అరణ్యపర్వ శేషమున ఈ యేడు మాత్రమే కాన్పించుచున్నవి. వీనిలో మొదటి పద్యమున ప్రళయ ప్రకారము 'చిత్రముగ' తోచిన విధము వర్ణింపబడినది. రెండవదగు వచనమున సృష్టి ప్రకారము 'విచిత్రంబై' అనుభవగోచరమైన విధము సూచింపబడినది. మూడవ పద్యమునందలి చిత్ర శబ్దము వెనుక యోగవిద్యా ప్రభావము గుప్తమొనర్చబడిన విధము గ్రహింపబడినది. నాల్గవ

పద్యమునందలి చిత్రశబ్దము అదృశ్య శక్తి ప్రభావమును గర్భీకరించుకొన్న విధమూహింపబడినది. అయిదవ పద్యమందలి చిత్ర శబ్దమునకు, దేవశబ్దము నకు అంతస్సూత్రత గోచరించు విధమూహింపబడినది. ఆరవ పద్యమునందలి చిత్ర శబ్దము ద్వారా ప్రకృతి గతచిత్రత్వము దేహధారుల తత్కాల స్థితియందు పోల్చబడిన విధము గుర్తింపబడినవి. ఏడవ పద్యమందలి విచిత్ర శబ్దము శాంబరీ శక్తిని, దివ్యశక్తిని గర్భీకరించుకొన్న వైనము గమనింపబడినది.

దీనినిబట్టి యెఱ్ఱన ఈ చిత్ర విచిత్ర శబ్దములను ఏదియో ఒకానొక అద్భుతతత్త్వమును ప్రతిపాదించుటకు ప్రయోగించినట్లు చెప్పవచ్చును. అంతే గాదు, ఒక విషయమును ఇంతకంటె మించి చెప్పుటకు సాధ్యముకాదు అని తోచి నప్పుడు ఈ శబ్దములను ప్రయోగించి ఆపైని మన యూహకే వదలివేయుచున్నా డనియు ననిపించును. అతని యితర ప్రబంధములలో గూడ, ఈ ప్రయోగము లున్నట్లున్నవి. వానిని కూడ గుర్తించి యాతని 'యలౌకిక' చిత్ర కవిత్వ తత్త్వము "లోనారయుట" ఆవశ్యకము.

ఈ పద్యములందు ప్రయోగింపబడిన 'చిత్ర' శబ్దముల ద్వారా ఎఱ్ఱన వట్టి తత్త్వమునే గాదు ప్రతిపాదించుట; ఆ ప్రాతిపదికపై గొప్ప భావ సంపద, అలంకార సౌభాగ్యము, ధ్వని సౌందర్యము రచనాశిల్పము మొదలుగాగల కావ్య కళాతత్త్వమును గూడ ప్రదర్శించిన విధమును కొంత గమనించితిమి. దీనితో పాటు గ్రహింపవలసిన విషయము మఱొక్కటి గలదు. ఈ యేడు పద్యము లలో నీతడు నాల్గింటిని ఉత్పలమాలా వృత్తములలో వ్రాసినాడు. తక్కిన మూడింటిలో నొకటి వచనము, మఱొకటి కందము, ఇంకొకటి మత్తేభము. కాగా ఎక్కువ పద్యములను ఉత్పలమాలా వృత్తములలో వ్రాయుటకొక చక్కని కారణము నూహింపవచ్చును. నృసింహ పురాణము అవతారికలో 'వఱలు జటాటవిన్' (పద్యం - 4) అన్న పద్యములో "శివేందు చంద్రికల్ నెఱయగ బ్రోచు మన్మఖ మనీషత కావ్యకళా కుముద్వతిన్" అని యావాహన చేసినాడు. మఱి ఇందుచంద్రికలు వికసింపజేయునది ఉత్పలములనే గదా! ఈ యేడు పద్యములకు మనము కల్పించిన విశిష్ట స్థానమునుబట్టి యీ ఊహ మిక్కిలి సమంజసమైనదే యని భావించుట లెస్స.

చిత్రకవిత్వ వాగ్వైభవ జృంభణమనగా అలంకారములను చిత్రవిచిత్రముగా వాడుటయే యనియు, ఎఱ్ఱన రాజరాజును గూర్చి చేసిన "విచిత్రాలంకారోజ్జ్వల కవితాలాప కలాప సంతతానందమతీ!" "మహాకావ్య రసప్రయోజనారూఢమతీ!" అను సంబోధనల సమన్వయ స్వరూపమే యీ లక్షణ మనియు పూర్వోక్తము. ఈ విషయము చిత్రశబ్ద ముద్రిత పద్య సప్తకమునందు దిఙ్మాత్రముగ స్పృశింపబడినది. దీనిని మఱికొంత తీవెలు సాగించుటయే ప్రస్తుతాంశము.

ప్రబంధ పరమేశ్వరునకు శబ్దాలంకారముల మీద కంటె నర్థాలంకారముల మీద మక్కువ యెక్కువ. అతని యొక్క సర్వవిధ కవితా వైచిత్రికి ఉపమ, ఉత్ప్రేక్ష, రూపకము, శ్లేష, స్వభావోక్తి, అర్థాంతరన్యాసము మొదలగు నర్థాలంకారములే యాటపట్టులు. ఇది కవిత్రయ మార్గము. అట్లని శబ్దాలంకారములను అసలే వాడలేదనిగాదు. కాని వాటిపై 'క్రీడ' మాత్రము చేయలేదు. దిఙ్మాత్రముగ వాడినాడు. అతనిది వ్యామోహరహితమైన, సంయమ ప్రధానమైన, సహజ సుందరమైన కవిత. "లక్ష్యలక్షణ కళాలంకార సౌభాగ్య సత్కావ్య విన్యాసు శంభుదాసు దలతు" అని కీర్తింపబడిన మహనీయుడాతడు. అతని యలంకార సౌభాగ్యమును అరయుదము!

## అర్థాలంకార ప్రయోగ వైచిత్రి :

1. వ॥ ఇట్లు కౌంతేయుల చేతం బీడితులై గంధర్వులు దుర్యోధనాదులం జెఱలేమఱక కొనుచు గగనంబునకు నెగసి, త్రోసిపోవ నుంకించిన నెఱింగి సవ్యసాచి రయంబున నతి నిబిడ బాణంబులంజేసి దిఙ్నభో మార్గంబులు నిరంధ్రంబులు గాఁగప్పిన నగ్గగనచరులు వలలోనం జిక్కిన పులుగులుం బోలెఁబోవనేఱక శరపంజరంబు జిక్కియు నుక్కసెడక యన్నలువుర మీద వివిధాయుధ పరంపరలు ప్రయోగించిన. —ఆ. 5-422

ఘోషయాత్రా ఘట్టమిది. గంధర్వవీరులు దుర్యోధనుని చెఱబట్టి పాండవుల కనుగప్పి ఆకాశమున కెగిరిపోవ నుంకించిరి. అది పసిగట్టిన సవ్యసాచి బాణ పరంపర చేత ఆకాశమును, దిగంతములను కప్పివేసెను. గంధర్వులు వలలో జిక్కిన పక్షుల వలె శరపంజరములో చిక్కుపడిరి.

ఇచట "అగ్గగన చరులు వలలోనం జిక్కిన పులుగులుంబోలెఁ బోవనేరక శరపంజరంబునం జిక్కిరి" అన్నది చిత్రమైన ఉపమాలంకారము.

పక్షులకు పర్యాయముగ "పులుగులు" అనుట గొప్ప చమత్కారము. ఇదొక శబ్దచిత్రము. అర్జునునకు పర్యాయముగ 'సవ్యసాచి' యనుట సందర్భోచిత పదప్రయోగ వైచిత్రికి తార్కాణ.

1. కం॥ పరువడి మొత్తములై బం
దుర ఘోషంబెసఁగఁ బొంగితోఁచెంచు హరీ
శ్వర బలమునందు ఘన సా
గర వీచి వికాస రేఖ గానగనయ్యెన్ —ఆ. 7-65

వానర సైన్యము లంకను చుట్టుముట్టి ఆహవకేళికి సంతన కట్టిన సందర్భమిది. గుంపులు గుంపులుగా వచ్చిపడుచు, ఆనంద కోలాహల ఘోషతో పొంగుచున్న వానర సైన్యమునకు సముద్ర తరంగముల పొంగులతో పోల్చిక చెప్పుట అచుంబిత రమణీయముగ నున్నది.

ఇదే ఉపమానము ఈ పద్యమునకు కొంత ముందటిదగు నీ క్రింది వచనమునందు కూడ చెప్పబడినది :

వ॥ ఇట్లు నడచి యెడనెడం బ్రభూత వన్యఫల జలాశయంబులగు ప్రదేశంబుల విడియుచుం, గపి సైన్యంబు గతిపయదినంబులకు దక్షిణోదధి తీరంబు సేరి, రెండగు వారాసియుం బోలె ఘూర్ణిల్లుచుండె....
—ఆ. 7-48

ఇందలి సామాన్య భావమే పై పద్యమున విచిత్ర రామణీయకతను సంతరించుకొన్నది. "ఉపమా కాళిదాసస్య" అన్నట్లు "ఉపమా శంభుదాసస్య" అని చెప్పదగినంత మనోహరములయినవి యీతని ఉపమాలంకారములు.

3. వ॥ ఇవ్విధంబున గంధర్వులు బెట్టిదంబుగా గిట్టి నొప్పింపందొడంగినం గలంగి దుశ్శాసనాది కౌరవులు ససైన్యంబుగాఁ దెరలి దుర్యోధను చేరువకుం బఱచిన కర్ణుండొక్కరుండ సుస్థిరుండై నిలిచి గంధర్వుల నిలువరించి భల్లార్ధచంద్ర ప్రముఖ ఖహుల బాణ పాతంబులందద్దీయ

దేహంబులు ఖండించుచు నిమిష మాత్రంబున చిత్రసేను సైనిక శతంబుల రూపుమాపుటయు మఱియుం బైపై గంధర్వులు శతసహస్ర సంఖ్యలు తోఁ తెంచినం బృథివి యెల్లను గంధర్వమయంబైనట్లుండె నప్పుడు. —ఆ. 5-392

ఘోషయాత్రా ఘట్టమిది. గంధర్వ వీరులొక్కుమ్మడి గగనము నుండి దిగివచ్చి కురు రాజ సైన్యమును తాకిరి. ఆ పిమ్మట జరిగిన యుద్ధ ప్రకారమిది. ఇచ్చట "పైపై గంధర్వులు.... పృథివి యెల్లను గంధర్వ మయంబైనట్లుండె" అన్న ఉత్ప్రేక్ష మిక్కిలి చమత్కారముగ నున్నది. ఈ ఉత్ప్రేక్ష కవి చేసినదా? కర్ణుడు చేసినదా? అన్నదొక విచికిత్స. కర్ణుడు చేసినదే అయినచో నిది మతి యొక చమత్కారము. ఒక పాత్రచేత ఒక యలంకారమును ప్రయోగింప జేయుట చిత్రమే!

4. వ॥ తాను దేవ దానవ గంధర్వాది భూత వర్గంబుల నెల్ల జయించియుం గందర్ప దర్పంబు వారింప నోపక, యాక్షణంబ దివ్యమాల్యాంబరాభరణ భూషితుండై, సంచారశీలంబైన కల్పపాదపంబునుం బోలె నొప్పియుఁ దనయొప్పుఁ బిత్పవనంబు నందలి వట భూరుహంబు సొంపునుంబోలె నతి భీషణంబగుచుండ, నశోక వనమధ్యంబు సొత్తించి, రోహిణి సమీపంబునకు వచ్చు శనైశ్చరుండుం బోలె జానకిం జేరఁజనుదెంచి ప్రణయపూర్వకంబుగా నిట్లనియె.

—ఆ. 6-408

రావణుడు "దివ్యమాల్యాంబరా భరణ భూషితుండై సంచారశీలంబైన కల్ప పాదపంబునుంబోలె నొప్పియు" ననుట చిత్రమైన హేతూత్ప్రేక్షగా భావించుట లెస్స. తరువాతి యలంకారములు రెండును ఉపమలు.

మహాకవి యర్థాలంకార ప్రయోగ వైచిత్రిని గూర్చి యితర ప్రకరణములలో నటనట ప్రసక్తమగుట వలన నిట దిఙ్మాత్రముగ నుదాహరింపబడినవి. ఈ ఉదాహరింపబడినవి ఒక ప్రత్యేకమైన కోవకు చెందినవి. ఇక శబ్దాలంకార ప్రయోగ వైచిత్రి నరయుదము;

## శబ్దాలంకార ప్రయోగ వైచిత్రి :

1. మ॥ దేవతాయతనంబులున్ జగతీసురావసథంబులున్
   భావనాశ్రమ భూములుం జెడి పొదగున్; శుభవృక్ష వ
   ల్లీ వనంబులు నాశమొందఁ గలిప్రచారము నందు దు
   ష్ట్రీ విహారము మద్యపానముఁ జెల్లుపెల్లుగ నెల్లెడన్

—అ. 4-805

ఇందు "చెడిపొదగున్" "నాశమొందు" అను మాటలతో వస్తుస్థితి కండ్లకు గట్టి ధర్మప్రియుల హృదయకోశము ప్రిదిలిపోవును. "చెల్లుపెల్లుగ నెల్లెడన్" అన్న మాటలు కశాఘాతము వలె ఛెళ్లున తగిలి చుఱుకు పుట్టును. "చెడిపొద గున్", "చెల్లుపెల్లుగ నెల్లెడన్" అన్న తావులందు దకార లకారముల వృత్త్యను ప్రాసము, ఆ పదముల కూర్పు, అటు రచనాకళకు ఇటు భావకళకు పరమో దాహరణములుగ నున్నవి. మొదటి పాదమందలి పూర్వోత్తర ఖండముల ముగింపు ఒకే తీరుగ నుండి యనుక పేదవైచిత్రిని సంతరించుకొని రమణీయ ముగ నున్నది.

2. తే॥ అని విచారించు నెడఁ గొందఱధిపు జూచి
   జలధి బలితంపు దెప్పల కడత మనిరి
   ఘనకలంబులు సమకట్టి కడత మనిరి
   కొందఱంతయు విని రఘునందనుండు —అ. 7-45

కపి సైన్యముతో సాగర తీరమునకు వచ్చిన రాముడు సాగరమునెట్లు దాటవలయునో ఉపాయము చెప్పుమని సుగ్రీవునడిగెను. కపివీరులు ఎవరికి తోచిన ఉపాయమును వారు చెప్పు సందర్భమిది.

ఇందు ద్వితీయ తృతీయ పాదాంతముల యందు "కడతమనిరి, కడత మనిరి" అని రెండుమాఱులు ఆవృత్తమైనవి. ఇది 'యమక' భేదము. ఈ మాట జానపదుల పలుకుబడి వలెనున్నదనుట స్పష్టము. ఈ పలికినది; వానరములు గదా మఱి! ఆ పలుకునప్పుడు వాని యాంగిక విచేష్టితములు గూడ మన కండ్లకు గట్టి నట్లుండుట వలన ఈ యావృత్తిలో నొక విధమైన వైచిత్రి గోచ రించుచున్నదని భావింపవచ్చును.

8. చ॥ వ్రతము ధరించి నిష్ఠనుపవాసవిధిం గొలుతున్ సముద్రు దు నా
కితడు ప్రియంబు తోడఁదెఱువిచ్చుట యంతన కల్గనేని మీ
లితరునిగా ననుందలచెనేని నమానుష రోష వేగదీ
ప్రిత శరవహ్ని నిజ్జలముఁ(బీల్చ్రెద(ఁ ప్రేల్చెద నొక్క వ్రేల్మిడిన్
—ఆ. 7-47

సాగరమును దాటుటకు వానరములు చెప్పిన ఉపాయములు రామునకు నచ్చలేదు. ఆ నచ్చకపోవుటను ఒక కమ్మని సీస పద్యములో (46) బహు చమత్కారముగ చెప్పించినా డెట్టన! రఘునందనుడు: "అల్లన నగుచు నిట్లనియె" అని ప్రారంభమైన ఆ సీసపద్యము "నా మనసు నిశ్చయంబు వినుడు మీరు" అన్న ప్రతిజ్ఞాసూచక వాక్యముతో ముగియును. ఈ ప్రతిజ్ఞా సూచక వాక్యముతో వానరముల దృష్టి రామునిపైపు నాకృష్టమై యాతడు సెలవిచ్చు మాటలను వినుటకు చెవులు రిక్కించుకొని సిద్ధపడుదురు. ఆ తరువాతి పద్యమే యిది.

రాముడు తాను ఉపవాస వ్రత నిష్ఠబూని సముద్రుని ప్రార్థించునట. అతడు ప్రియముతో తనకు త్రోవ నిచ్చునట! ఇవ్వనిచో "అమానుష రోష వేగదీపిత శరవహ్నిచేత" తజ్జలమును పీల్చివేయునట! ఇచ్చట "పీల్చెద ప్రేల్చెద నొక్క వ్రేల్మిడిన్" అన్న శబ్దాలంకారము మిక్కిలి చిత్రముగ నున్నది. వానరముల స్థాయికి తగినట్లు, వారి యుత్సాహమును ఉద్దీప్తమొనర్చుట కనుగుణమైన భాషలో 'గమ్మత్తు'గా నున్నది. ఈ గమ్మత్తును ఇట్లూహింప వచ్చును:

ఈ పద్యము యొక్క నడక ఇందలి ప్రతిపాద్య వాక్యాంశములను బట్టి నాల్గుచోట్ల ఒక్క క్షణమాగి యాగి మరల సాగిపోవుచుండును. మొదటి పాదమున "సముద్రు" కడ, రెండవ పాదమున "మేలు" కడ, మూడవ పాదమున "తలంచెనేని" కడ, నాల్గవ పాదమున "శరవహ్ని" కడ నాగుచు వచ్చి చివరికి ముగియును.

దీనిననుసరించి ఈ ప్రతిజ్ఞ యొక్క స్థాయి క్రమక్రమముగ ఒక్కొక్క మెట్టు పైకి పెరిగి "పీల్చెద ప్రేల్చెద నొక్క వ్రేల్మిడిన్" అన్న తాళబద్ధములగు మాటలతో నొక్కుమ్మడి ముక్తాయింపునకు వచ్చును! ఈ క్రమపద్ధతి ననుసరించి

చెవులు రిక్కించుకొని వినుచున్న కోతుల ఔత్సుక్యము కూడ క్రమక్రమముగ పైకి పెరిగి ఈ తాళబద్ధములగు ముక్తాయింపు మాటలకు నా వానరములు ఒక్కుమ్మడి తబ్బిబ్బులు పడుచు అవితర్కితముగ నా తాళమున కనువుగ గంతులు వేయుచు ఆడుటకు మొదలుపెట్టును! ఇచ్చట కొద్దిపాటి శబ్దాలంకారమున్నది. అది తాళగతికి ననువుగ నున్నది రాముడు దానిని పలుకవలసినట్లు పలికినాడు. వానరములు ఆడినవి! ఇది ఇక్కడి 'గమ్మత్తు'. ఇది ప్రబంధ పరమేశ్వరుని చిత్ర కవిత్వ వాగ్వైభవ జృంభణమునందొక రేఖామాత్రము! "అమానుష", "రోషవేగ" అను తావున 'ష'కార వృత్త్యనుప్రాసయు కొంత చమత్కారముగ నున్నది!

4. మహాస్రగ్ధర- కని ధూమ్రాక్షుండు విశ్వ
గ్రసనలసత్కాలమేఘంబ పోలెన్
ఘన గర్జాఘోష మొప్పం
గడగి శరశతాకల్పితాసార దుర్ద
ర్శన వీరారంభుడై సన్
సకల హరిచమూ సంఘముఁ విహ్వలంబై
చనఁదూలెం, గూలె, లావుం
జలమును జెదరన్ సంగడిన్ విచ్చెనొచ్చెన్

—అ. 7-87

అనిల తనూజ ధూమ్రాక్ష రక్షిత సైన్య యుగ్మమునకు నుగ్ర సమరమయ్యెను. వానర సైన్యము విజృంభించి రాక్షస సైన్యమును తుత్తునియలు చేయుచుండెను. అది చూసి ధూమ్రాక్షుకు స్వయముగ రంగమున నుఱికి వానర సైన్యమును చెల్లచెదఱు చేయు సందర్భమిది.

ఇందు ధూమ్రాక్షునకు విశ్వగ్రసన లసత్కాల మేఘముతో పోలిక చెప్పబడి, తదనుగుణముగ తక్కిన విశేషణములతో పద్యము సుందరముగ నిర్మింపబడినది. ధూమ్రాక్షుడు విజృంభించెను. సకల హరిచమూ సంఘములు చెల్లాచెదరైనవి.

ఇచట విశేషమేమన, ధూమ్రాక్షునకు సంబంధించిన వర్ణనమంతయు సంస్కృతములో చేయబడినది. హరిచమూ సంఘములు చెల్లాచెదరగుట అచ్చ

తెనుగు పదములతో చేయబడినది. "చనెఁదూలెం గూలె లావుం జలమును, జెద రన్ సంగడీన్ విచ్చె నొచ్చెన్" "తూలెంగూలె" అనుచోట శబ్దాలంకారము ఆకర్షకముగ నున్నది.

5. లయగ్రాహి॰ దారుణ దవానల శిఖారుణ శిరోరుహు గ
భీర ఘనకర్బుర శరీరుఁడటు రోష
స్ఫూర్ర నయనాంత గళితోరుతర వహ్ని కణ
ఘోర ముఖు, దంతవలయారభస దంశో
ద్గారి రుధిరాధరు నుదార భుజ సారణ వి
దూరిత దిగంతుఁబద భారవిన మద్భూ
భారుఁ ద్రిజగద్విజయ భూరి బలు, నద్ధనుజ
వీరుఁగని యచ్చెరువుఁగూర గపి వీరుల్

—ఆ. 7-97

రావణ ప్రబోధితుడైన కుంభకర్ణుడు యుద్ధమునకు వచ్చెను. అతని యాకారా గమనములను వర్ణించు పద్యమిది. పద్యమంతయు ఆపాదమస్తకము సంస్కృతమయము; రచనాకళ రమ్యముగ నున్నది. మొదటి నాల్గు పాదము లందు ఆతని భీకరాకారము, అయిదారు పాదములందు ఆతని "ఉదార భుజ సారణ విదూరిత దిగంతత్వము", "పద భార వినమద్భూమి భారము", ఏడవ పాదమున నాతని త్రిజగద్విజయ భూరిబలము. వర్ణింపబడినది. ఎనిమిదవ పాదమున నిట్లు చిత్ర విచిత్రముగ నొక "బూచివాడు" వలె నడచి వచ్చుచున్న యాతనిని చూచి తమ సహజ చపలత్వమును ఒక్క క్షణము వీడి అచ్చెరువుతో చూచుచున్న కపి వీరుల నిశ్చలస్థితి వర్ణింపబడినది. ప్రతిపాదమునందును తీగెలు సాగుచున్నట్లున్న దీర్ఘాక్షరములచేత రమ్యమైన గతిస్ఫురణము గల పద్యమిది. ఇందలి అర్థాలంకారములు ఉపమా స్వభావోక్తులు. పలుమాఱులు ఆ వృత్తి చేయ బడిన అక్షరము రేఫ మఱియు మఱికొన్ని యక్షరములున్నవి. ఇదొక రమ్య మైన వృత్త్యనుప్రాస శబ్దాలంకారము !

6. చ॥ అలస విలాస లాలస రసాన్వితలైన నితంబినీ జనుల్
వలసిన భూరి విస్ఫురిత వస్తు సమగ్రములైన గ్రామముల్
వలసిన నుల్లసన్మణి సువర్ణ విభూషణ గోధనావళుల్
వలసిన గోరుమిచ్చెద ధ్రువంబుగ నావుడు నాతడిట్లనున్

—ఆ. 7-259

కవచకుండలముల కొఱకు విప్రవేషమున వచ్చిన ఇంద్రునితో కర్ణుడు పలికిన మాటలివి. ప్రతిపాదము "అలస", "వలసిన" అను మాటలతో ప్రారంభమగుటయు, ఏ పాదమున కాపాదముగ ప్రతిపాదిత వాక్యార్థము ముగి యుటయు, పాదాంతము లన్నియు నొకే తీరుగ పరిసమాప్తి నందుటయు మంచి రచనా శిల్పమునకు తార్కాణ. నాల్గుపాదములందును క్రమముగా 'ల' 'గ్ర' 'ఱ' 'డ' అను నక్షరములు పునరావృత్తమై మనోహర వృత్త్యనుప్రాసమును సంతరించుకొన్న పద్యమిది. ఏది కావలసినను ఇత్తునని పలికి హృదయమును దూసిపోసిన కర్ణుని దాన ధారాప్రవాహముచే తడిసిన పద్యమిది. అంతకంటె, ప్రబంధ పరమేశ్వరుని సహజ వాక్ప్రవాహమునకు వివృతద్వారమనదగిన పద్యమని చెప్పుట లెస్స!

7\. ఉ॥ లోహిత రత్న భూషణుడు, లోహిత మాల్యధరుండు విస్ఫుర
ల్లోహిత లోచనుండు ననలోహిత వస్త్రుడు లోహితాస్యుడై
యాహవకేళికిం గడగునప్పుడు సూడగ నొప్పె లోక ని
ర్వాహ సమిద్ధ నూతన పతంగుఁడ బోలె రథాధిరూఢుడై
—ఆ. 5-282

మహేశ్వరుని యాదేశముపై మహిషాసురుని మర్దించుటకు వెడలిన కుమార స్వామి యవతార వర్ణనమిది. చిత్రవర్ణ వాహనుడైన యా కుమారస్వామి దేవ రను చిత్రముగ వర్ణించిన ప్రబంధపరమేశ్వరుని చిత్రకవిత్వ వాగ్వైభవ జృంభణమిట్టిది!



# శబ్దవైచిత్రి

ఎఱ్ఱన తన కవితా లక్షణములను గూర్చి తానుగా కంఠోక్తిగా ఎచ్చటను పేర్కొనలేదు. కాని యాతని కవితలో జక్కన 'శబ్దవైచిత్రి'ని శ్రీనాథుడు 'సూక్తివైచిత్రి'ని గుర్తించి యుండిరి. ఈ రెండును ఒక్కటి యగునా? లేక భిన్నములా? అన్నదొక విచికిత్స. నిదానించి చూడగా మొదటిది భాషాపరము గను రెండవది భావపరముగను గోచరించుట వలన భిన్నములని భావించుట మేలు. అందువలన ఎఱ్ఱన కవిత్వమును భిన్న దృక్పథములతో విశ్లేషణాత్మక ముగ పరిశీలించి చక్కగ సాక్షాత్కరింప చేసుకోగల లాభము చేకూరును. మన కిచ్చటి ప్రకృతాంశము శబ్దవైచిత్రి.

## శబ్దదీప్తి - శబ్దవైచిత్రి :

ఎఱ్ఱన హరివంశావతారికలో సరస్వతీదేవిని ప్రార్థించిన ఈ క్రింది పద్యము గమనింపదగియున్నది :

మ॥ వరవస్తు ప్రతిపత్తిధుర్యమగు నైశ్వర్యంబు పంచాశద
క్షర సంసిద్ధ సమస్త శబ్ద రచనా సంవ్యాప్తి సుద్దీప్తమై
పరఁగం గల్ప లతా సధర్మ యగుచుం బ్రజ్ఞా విశేషాఢ్యులన్
గరుణం బ్రోచు సవిత్రి వాణిఁ ద్రిజగత్కల్యాణిఁ బ్రార్థించెదన్ -౮

ఇందు కావ్యవస్తువు, తన్నిర్వహణమునకు కావలసిన పునాది భూతమగు వర్ణ, పద, సమాస, వాక్య రూపమున విలసిల్లు రచనాకళ - ఇవి వుక్కుటు బట్టి నట్లు సూత్రప్రాయముగ ప్రతిపాదింపబడినవి. ప్రజ్ఞా విశేషాఢ్యులగు మహాకవుల కడ వరవస్తు ప్రతిపత్తి ధుర్యమగు నైశ్వర్యముండునట. అది పంచాశదక్షర సంసిద్ధ సమస్త శబ్దరచనా సంవ్యాప్తిచేత సుద్దీప్తమగునట. అట్లగుట వలననది 'కల్ప లతా సధర్మ యగుచు, సర్వాభీష్ట ఫలప్రదాతయగుచు, పరగుచుండునట. ఇట్టి కావ్య ప్రపంచ నిర్మాతలును, ప్రజ్ఞా విశేషాఢ్యులును అగు మహనీయులను కరుణతో బ్రోచు త్రిజగత్కల్యాణి యగు వాణిని తానా వాహన చేయుచున్నా

డెఱ్ఱన. ఈ పద్యమునకు "పంచాశ దక్షర సంసిద్ధ సమస్త శబ్దరచనా సంవ్యాప్తి సుద్దీప్తమై" అన్న వాక్యము ప్రాణసారము.

భాషలో ఏబదియైదు వర్ణములున్నవి. వీటి కూడిక వలన శబ్దము లేర్పడును. మఱి యీ శబ్దములను ఏర్పఱుచు వారెవరు? కవియా? కాదు; కొన్ని శబ్దములను మాత్రము వ్యాకర్తలు సూత్రముల ద్వారా సృష్టించుట మనకు తెలుసు. కాని అన్ని శబ్దములను అట్లు గాదు. ఇవి పౌరుషేయము లనుడు, అపౌరుషేయములనుడు తమంత తామే యేర్పడినవని భావించుట లెస్స. ఇటు స్వయం సిద్ధములయిన శబ్దములను పరస్పరము పొందుపొసగునట్లు కూర్చుకొని రీతివృత్తి శయ్యాపాకాదులతో కూడిన కమ్మని రచనా కళను సంతరించుట కవి యొక్క సృష్టి యగుచున్నది!

ఎఱ్ఱన యిచ్చట చిత్రముగ "సమస్త శబ్ద" అని ప్రయోగించినాడు. దీనికి సకల శబ్దములు అను సామాన్యార్థమును మాత్రమేగాక సమసింపబడిన శబ్దములు అని కూడ చెప్పనొప్పును. కావ్యమున శబ్దములను విడివిడిగా పొడి పొడిగా ప్రయోగించుట ఒక పద్ధతి. అనేక పదములను ఏక పదముగా కలిపి సమసింపజేసి ప్రయోగించుట మఱియొక పద్ధతి. ఇది రసానుగుణముగ నుండును. ఈ రెండంశములను ఈ ప్రయోగము ద్వారా సూచించినా డెఱ్ఱన. ఇక్కడ మఱొక చమత్కారము కూడ భాసించుచున్నది. "సమస్త శబ్దరచనా సంవ్యాప్తి సుద్దీప్తమై" అని 'శబ్ద' 'ఉద్దీప్తి' పదములను ప్రయోగించినాడు. వీనిని మన ఊహా బలముతో "శబ్దదీప్తి" అని భావింపవచ్చును. ఇదియే "శబ్దవైచిత్రి!"

## శబ్దసారము - శబ్ద వైచిత్రి :

ఇప్పటికి చెప్పిన యీ సర్వ విషయమును ఎఱ్ఱన నృసింహపురాణ పీఠిక లోని ఈ పద్యమున భంగ్యంతరముగ ప్రతిపాదించిన వైనము గమనార్హము :

ఉ॥ మించిన వేడ్క వీనులకు మిక్కుటమై మధువృష్టి గ్రమ్మ రా
యంచలు గూయఁ గ్రౌంచమును నావల గూయఁదొడంగు భంగిఁ బ్రా
ఛాంచిత శబ్దసారులు మహాకవులాద్యులు కావ్య శయ్యఁగీ
లించిన కీర్తి సంగ సుఖలీలకు నేనును గాంక్షఁజేసితిన్

—నృ. పు. పీఠిక 13

నన్నయ తిక్కనలు తమతమ ప్రౌఢాంచిత శబ్దసారముల ద్వారా కల్పించిన కావ్యశయ్యలో తాను కూడ పాలుపంచుకొనుటకు కాంక్ష చేసినాడట. ఇచ్చట శబ్దసారమనగా శబ్దనాదమని యర్థము. ప్రతి శబ్దమునందును ఒకటి మొదలు ఏడెనిమిది యక్షరముల వఱకు నుండును. ఈ యక్షరముల ధ్వనులన్నియు నొకే విధముగ నుండవు. వీనియొక్క భిన్నభిన్న ధ్వనులన్నియు ఏక రస రంజితములై ఆ శబ్దమున నొక సవ్వడి చేయుచుండును. అట్టి పదములయొక్క పరా అన్యోన్య మైత్రియే శయ్య. నన్నయగారి శబ్దసారము ప్రధానముగ సంస్కృత సంబంధి. తిక్కన గారిది తెలుగు సంబంధియందురు. ఎఱ్ఱన సంస్కృతాంధ్ర పదములను సమానముగ పోషించి, ఆయా శబ్దముల సారమును సమ్మిశ్రితము చేసి, కవీంద్ర కర్ణపుటపేయముగ నొక క్రొత్త రసాయనమును తయారుచేసినాడు! ఇదియే శబ్దవైచిత్రి. శబ్దసారమనగా శబ్దము యొక్క అర్థమనియు చెప్పనొప్పును. రమణీయార్థ ప్రతిపాదకమగు రమణీయ శబ్దమే కావ్యమని ఆలంకారికుల వక్కాణ.

## అక్షర రమ్యత – శబ్దవైచిత్రి :

కీ. శే. డాక్టర్ పి. మాధవశర్మగారు : "శబ్దవైచిత్రి యనగా అక్షర రమ్యత. సూక్తి వైచిత్రి యనగా అర్థగతమైన ప్రౌఢత యని భావింపవచ్చును" అని చెప్పి అక్షరరమ్యత నిట్లు వివరించిరి :- పద సంఘటనా రూపమైన రీతి, వర్ణ సంఘటనారూపమైన వృత్తి; పదముల అన్యోన్యమైత్రీ రూపమైన శయ్య, పద పరివృత్త్యసహిష్ణుతారూపమైన పాకము- ఈ సర్వమును నన్నయ అక్షర రమ్యత అనెను.[1] ఎఱ్ఱన నన్నయ కవితారీతిని కొంత అనుసరించిన వాడగుట వలన ఈ అభిప్రాయము నంగీకరించుటలో విప్రతిపత్తి లేదు. "క్షురస్య ధార వలె" ఒక సూక్ష్మభేదమున్నది. నన్నయగారి అక్షరరమ్యత సంస్కృత పదముల సంఘటన, సమాసముల కూర్పు ద్వారా సంతరింపబడినది కాగా, ఎఱ్ఱనగారి శబ్దవైచిత్రి సంస్కృతాంధ్ర పదముల పోషింపు ద్వారా సాధింపబడినది. సూక్తివైచిత్రికి శబ్దవైచిత్రికి భేదములేదని భావించిన శ్రీ నాగళ్ల గురుప్రసాద రావుగారు ఇది సంస్కృతాంధ్ర భాషాపదములను సుందరముగా వాడుటలో జనించినదని చెప్పి నృసింహపురాణములోని "ఉన్నత సంస్కృతాది చతురోక్తి

1. అరణ్యపర్వ పీఠిక, పుటలు - 81, 55.

పథంబుల కావ్యకర్తవై" అన్న పద్యమును "ఉన్నత సంస్కృతాంధ్ర చతురోక్తి పథంబుల కావ్యకర్తవై" అని సవరించి ఇది మూలపాఠమై యుండునని యను మానించిరి.[1] ఇది చక్కని యూహయని భావింపవచ్చును. కాగా నన్నయ అక్షర రమ్యతకు ఎఱ్ఱన శబ్దవైచిత్రికి సూక్ష్మమైన భేదమున్నదని గ్రహింపదగును.

"మించిన వేడ్క పీనులకు మిక్కుటమై" అన్న పద్యమున నొక రహస్యము గర్భీకృతమైయున్నట్లు స్ఫురించుచున్నది. ఇది బాహ్యదృష్టికి నృసింహ పురాణము కావ్యరచనా ప్రస్తావనకు సంబంధించినదిగ కాన్పించుచున్నను అస లాంతర్యమున భారత రచనకు సంబంధించినదిగ తోచుచున్నది. నన్నయ, తిక్కనలతోపాటు తాను పంచుకొనగోరిన "కావ్యశయ్య కీలించిన కీర్తి సంగ సుఖలీల" భారత రచనకు సంబంధించినది కావలయునా? లేక నన్నయ తిక్కనలకు సంబంధములేని నృసింహ పురాణ రచనకు సంబంధించినది కావలయునా? అన్నది సందేహము! "చేసితిన్" అన్న భూతార్థద్యోతక క్రియా పదమును బట్టి భారత రచనకు సంబంధించినదే కావలయును. నృసింహమునకు చెందినదే అయినచో "కాంక్షచేయుదున్" అనియో మఱొక విధముగనో యుండుట సమంజసము. అరణ్యపర్వ శేషమున అవతారికను సంతరింపలేకపోవుట వలన జరిగిన కొన్ని కొఱతలను ఎఱ్ఱన నృసింహ పీఠికలో తీర్చుకొనుచున్నాడని గోచరించును. నృసింహ పీఠికయే అరణ్యపర్వ శేషమునకు గూడ పీఠిక యగు చున్నదని భావించుట యుక్తము!

ఇప్పుడు వివిధ దృక్పథములతో శబ్దవైచిత్రిని దిఙ్మాత్రముగ చవిచూతము గాక :

## ధ్వన్యనుకరణ శబ్దవైచిత్రి :

ఉ॥ ఆయత కుంత కార్ముక గదాసి పరశ్వధ శూల పట్టిసా
ద్యాయుధ ఘోర హస్తులు; గులాచల తుంగతనుల్, ప్రచండ తే
జోయుతులా వియచ్చరులు శూరతమై నడతెంచి బల్విడిం
గోయని తాఁకి రుగ్ర రణ కోవిదులై కురు రాజ సైన్యమున్

—ఆ. 5 - పద్యం 391

1. "ఎఱ్ఱన జయంతి" - ఉపన్యాసం - 1970, మార్చి 1. ఉదయం.

ఘోషయాత్రా ఘట్టమున గంధర్వ వీరులు దుర్యోధనుని సేనపై ఎత్తి వచ్చిన విధమును వర్ణించు పద్యమిది. ఇట దీర్ఘసమాస సంఘటనచేత గంధర్వుల యుద్ధ వీరోత్సాహము రమ్యముగ వర్ణింపబడినది. "నడతెంచి బల్విడిం గోయని తాకిరి" అన్న ఒక్క వాక్యము తప్ప తక్కిన పద్యమంతయు సంస్కృత మయమే. వారు "వియచ్చరులు". అక్కడ నుండి ఒక్కుమ్మడి నేలకు దిగవచ్చి "నడతెంచుట"తోబాటు భాష కూడ సంస్కృతము నుండి తెలుగునకు దిగ వచ్చుట రమ్యమైన రచనా శిల్పమునకు తార్కాణ! ఈ పద్యమున చప్పున స్ఫురించునటు "శబ్దవైచిత్రి" 'కో' యను అనుకరణ ధ్వని వాచక శబ్దమును ప్రయోగించుటలో నున్నది! ఇది యుద్ధోత్సాహమునందే గాక క్రీడోత్సాహము నందు గూడ సంకేతితమైన 'కూత' యనుట ఎల్లరకు అనుభవములో నున్న మాటయే. దీని ద్వారా గంధర్వులు ఈ యుద్ధమును క్రీడామాత్రముగ భావించి వచ్చిరను రమణీయమైన వస్తు ధ్వని యిట ప్రతీయమానమగుచున్నది. చివరి పాదమున 'కో' యను దానికి 'కౌ'యను నక్షరమె యతిస్థానమున నిలుపబడినది. 'కో' యను ఏకాక్షర ధ్వన్యనుకరణ శబ్దజనిత నాదము మధ్యనున్న దీర్ఘాక్షర ములను తాకుచుపోయి, యతిస్థానమునందలి 'కౌ'యను నక్షరమునకు కొట్టుకొని, తరంగితమై 'కురురాజు' యన్నచోట 'కు'లో పర్యవసించుచున్నది! భావము కూడ అట్లే పర్యవసించును గదా! ఇది మహాకవి శబ్దవైచిత్రి! మన యదృష్టము కొలది లభించిన అనుభవైక వేద్యత వలన ఇంకెన్నియో విధముల వైచిత్రిని ఈ పద్యమున భావింపవచ్చును.

## సంశ్లేష ఘటిత శబ్దవైచిత్రి :

ఉ॥ ఓరి దురాత్మ! యీ యబల నోడక యేటికిఁబట్టినాఁడ? వం
భోరుహ నేత్ర విద్వి! మెటపోయెదఁ బ్రాణము గొందు, నింక ప్ర
స్ఫార మహీధర ప్రకర భంగ విహార ధురీణముగ్రదై
త్యారుణ రంజితోగ్ర కులిశాస్త్రము సుమ్మిదె యంచు తాకినన్

—ఆ. 5 - పద్యం 179

కేశియను రాక్షసుడు దేవసేన యను కన్యను బలాత్కారముగ నెత్తుకొని పోవుచుండ నామె దీనాలాపములను విని దేవేంద్రుడు అతనిని నిలువరించి హత మార్చి యా కన్యను కాపాడు సందర్భమునందలి పద్యమిది. ఇందలి రీతి

మొదటి రెండు పాదములలో సంస్కృతాంధ్ర పదముల విఱువుల పోహళి పుతో నొక విధముగను, మిగిలిన రెండు పాదములలో కేవల సంస్కృత సమాస సంఘటనచేత మఱొక విధముగను సాగిపోవుచున్నది. చివరి రెండు పాదము లందలి ఓజో గుణము యొక్క తీవరింపు వజ్రాయుధము యొక్క అకుంఠిత మైన తేజమును వ్యంజించుచున్నది. రెండవ పాదమందలి 'విడ్వు'(ము) అన్న బెదఱింపు, నాల్గవ పాదమందలి 'సుమ్ము' అన్న హెచ్చరిక శబ్దవైచిత్రికి ప్రత్యేక నిదర్శనములు. ఓరి దురాత్మ! అన్న యెత్తుగడతోనే ప్రారంభమైన పద్యము యొక్క వేగము విడ్వు(ము) అన్న విదలింపు కడ ఒక్క క్షణమాగి, తృటిలో మఱల పుంజుకొని సంస్కృత సమాసపు నడకలో ప్రచండముగ సాగి 'సుమ్ము' అన్న హెచ్చరికతో తెగిపోవుట శబ్దవైచిత్రికి పరాకాష్ఠ!

రామోపాఖ్యానమున సీతనెత్తుకొనిపోవు రావణుని జటాయువు నిలువరించు సందర్భమున కూడ దాదాపు ఇదే పద్యమును మఱల వ్రాసినా డెఱ్ఱన. ఆ పద్య మిది :

ఉ॥ "ఓరి దురాత్మ! యీ యబల నోడక యేటికిఁబట్టినాఁడ? వం
భోరుహనేత్ర విడ్వు : మెటవోయినఁ బ్రాణముఁగొందు నింక ను
గ్రారి విభేది విక్రము జటాయు నెఱుంగవె" యంచు దర్పదు
ర్వారుఁడు వీఁక దాఁకె సురవర్గ విఘాతకు నద్దశాననున్

—ఆ. 6 - పద్యం 346

ఇచట పద్యమంతయు దాదాపు ఒకేరీతిలో నడచినది. 'విడ్వు' అన్న విదలింపుతోబాటు, ఎఱుంగవె? అన్న ప్రశ్నార్థక కాకువు చాల సొఁగసుగ నున్నది. ఎఱ్ఱన్నకు "విడ్వు" అన్న సంశ్లేష ఘటిత శబ్దప్రయోగమన్నచో మిక్కిలి యిష్టమైనదన్నట్లు కాన్పించును. ఘోషయాత్రా సందర్భమున గంధ ర్వులచేత బంధితుడైన దుర్యోధనుని విడిపించుటకు పూనుకొన్న అర్జునుడు వారితో నిట్లు పలుకును :

ఉ॥ అగ్రజు వాక్యముల్ దలఁచి యర్జునుఁడప్పుడు వారితోడ న
త్యుగ్రతఁ దక్కియెంతయుఁ బ్రియోక్తుల నిట్లను 'మీకు మా యెడన్
విగ్రహమేల? నెయ్యమున విడ్వుఁడు కౌరవ రాజుఁ బార్థివ
ప్రాగ్రసరుండు ధర్మసుతు పన్పది; మీకు నలంఘ్య మిత్త్రతన్

—ఆ. 5 - పద్యం 416

ఈ 'విడ్వు' ప్రయోగములో వెనుకటి పద్యములందున్న తీవ్రత లేదు. మెత్తని యదలింపు మాత్రమున్నది. ఒకే శబ్దమును వేలువేలు సందర్భములం దెటు వైచిత్రీ భరితముగ ప్రయోగింపవచ్చునో సూచించుటకే మూడు పద్యము లుదాహరింపబడినవి. 'విడువు' అనుటకు బదులు 'విడ్వు' అనుటలో అర్థ మాత్రా లాఘవమున్నది. దీనిని ప్రయోగించుట ద్వారా కేశి చేతిలో దేవసేనగాని, రావణుని చేతిలో సీతగాని గంధర్వుల చేతిలో దుర్యోధనుడు గాని, ఒక్క క్షణ మైనను చిక్కియుండుటకు వీలులేదన్నంత భరింపరాని ఉద్వేగము ఆ పాత్రల కున్నది. అర్థక్షణ మాత్రాలాఘవ సాధనకే కవి దీనినిట్లు ప్రయోగించెనని చమత్కరింపవచ్చును!

## క్రియాపద ప్రయోగ వైచిత్రి:

మ॥ "వినుఁడీ సర్వజనంబులుం గడిఁగి యీ విప్రున్ దురాలాపు దు
ర్జనునిం దున్మెద నస్మదీయ సుమహచ్చాపోగ్ర నిర్ముక్త బా
ణ నిపాత చ్ఛిదురాంగ రక్తజల శోణక్షోణి సంగస్థుఁగాఁ
గనుఁడీ యీ దురితాత్ము' నంచు నతిశీఘ్ర ప్రాప్త కోదండుడై

—అ. 4 - పద్యం 355

వామ్యాశ్వహరణ ఘట్టములోని పద్యమిది. వామదేవ మహర్షి దలుఁడను రాజుకడకేగ మున్నాతడు కొనిపోయిన తన యశ్వములను తనకిమ్మని యడుగ నాతడు కుపితుడై ఆ మహర్షిని వధించుటకు ధనుర్బాణములను తెమ్మని సారథి నాజ్ఞాపించును. అంత వామదేవుడు నవ్వుచు నన్ను చంపుటకు తెమ్మనిన బాణము అంతఃపురములో సంతసమున నున్న నీ కుమారుని హతమార్చుగాక యని శపించును. ఇంతలోనే ఆ బాణహతి చేత మరణించిన బాలుని తీసుకొని హాహాకారములు చేయుచు అంతఃపురము వారెల్లరు నచటికి వత్తురు. అది చూచి క్రోధోద్దీపితుడైన దలుడు తన దురాగ్రహమును విడువక సమీప వర్తులను చూచి పలికిన మాటలివి.

ఇందు వినుడీ...., కనుడీ...., అన్న శబ్దములు ప్రయోగ వైచిత్రీ ముద్రీతములు. ఒకే తీరు పలుకుబడి గల రెండు తెలుగు పదముల నడుమ, దాదాపు పద్యమంతయు నిండారునట్లు, ఓజోగుణ భరితమైన నొక పెద్ద సంస్కృత సమాసమును బిగించి ఒడ్డులొరసికొని ప్రవహించుచున్నదా అన్నట్లు రస

స్ఫూర్తిని కలిగించు చాతుర్యలీల యీ పద్యమున కానవగును. వినుడీ....అన్న యెత్తుగడతో తాను చేయబోవు ఘనకార్యము వైపునకు దృష్టిని లాగి, అదెట్టిదో ప్రళయముగ చెప్పి. కనుడీ.... అన్న ముగింపులో ఇదిగో, అన్నట్లు చేసి చూపెట్టు చున్నాను- అన్న దృశ్యాభాస స్ఫూర్తిని కలిగించు వైచిత్రీ శిల్పమిది. ఈ మధ్యనున్న సంస్కృత సమాసపు కట్టుబడిలో గోచరించు వన్నెచిన్నెలు, ముఖ్యముగ "నిపాతచ్ఛిదుర" అన్న తావున 'చ్ఛి' ద్విత్వాక్షరముగ వేయుటలో నున్న రమ్యత మన మహాకవి యొక్క శబ్దశాస్త్ర పరిజ్ఞానమునకు నిదర్శనము!

## క్రియా వ్యాపార శబ్దవైచిత్రి :

ఉ॥ కూడిన కొండముచ్చులను గ్రోఁతుల నుగ్రతముట్టి కిన్కఁజెం
డాడెద; నుజ్జ్వలోగ్ర వివిధాంబక జృంభిత దిఙ్ముఖుండనై
యాడెద వీర నృత్యము రయంబునఁ బార్థివ సూను లిద్దఱం
గ్రీడయ పోలెఁగిట్టి పెడకేల్గొగిఁగట్టెదఁ బట్టి తెచ్చెదన్
—అ. 7 - పద్యం 111

యుద్ధమున కుంభకర్ణుడు కూలెను దూషణానుజులు వజ్రవేగుడు, ప్రమాథియు మరణించిరి, అది విని రావణుడు దుఃఖించుచుండ ఇంద్రజిత్తు తండ్రిని సమీపించి ఓదార్చు సందర్భములోని పద్యమిది.

ఇదొక చిత్రమైన పద్యము. మొదటి పాదమంతయు తెలుగు పలుకుల కూర్పు గలిగి కొండముచ్చులను కోతులను చెండాడుట చెప్పబడినది. అట్లే చివరి పాదమంతయు కూడ, గుదిగుచ్చిన తెలుగు పొలుపులతో రామలక్ష్మణు లిరువురిని పట్టి తెచ్చుట చెప్పబడినది. ఇక మధ్యలోనున్న రెండు పాదములు సంస్కృత పదబంధ యుక్తములు. పద్యము యొక్క నడిబొడ్డున మణిపూస వలె "ఆడెద వీర నృత్యము" అన్న తెలుగు సంస్కృత మిశ్ర పదబంధము ప్రయోగింపబడినది. యుద్ధము చేయుదుననుటకు బదులు "ఆడెద వీర నృత్యము" అనుట ఎంత సొగసుగా నున్నది! ఈ వీర నృత్యమును "ఉజ్జ్వలోగ్ర వివిధాంబక జృంభిత దిఙ్ముఖుండనై" ఆడునట! ఈ సమాసమునకు రెండర్థములు స్ఫురించుచున్నవి. ఉజ్జ్వలములయిన, ఉగ్రములయిన, వివిధములయిన బాణముల చేత విజృంభించిన దిక్కుల ముఖములు గలవాడనై- అనగా దిగంతములు గలవాడనై- అను నర్థమొకటి. ఉజ్జ్వలములైన, ఉగ్రములైన అనేకములైన నేత్ర

ములచేత జృంభణముగా మిణుమిట్లు కొలుపబడుచున్న దిక్కుల ముఖములు గలవాడనై అన్నది మఱొకటి. అంబక, ముఖశబ్దములను ప్రయోగించుట చేత ఈ యర్థము తప్పక స్ఫురించును. దీనిని ఇట్లు సమన్వయించుకొనవలయును :

ఇంద్రజిత్తు యుద్ధరంగ మధ్యమున నిలబడి దిగంతములు కప్పునట్లు శరీరమును విదలించుచు వీరంగము వేయుచు, కన్నుల నిప్పులు రాల్చుచు ధనుస్సు నుండి బాణములను గుప్పించుచు విజృంభించి ఒకవైపు కోతి మూకలను బెదరాడును. మఱొకవైపు రామలక్ష్మణులను పెడకేళ్ల విఱిచి బంధించును. ఇంద్రజిత్తుకు తండ్రివలె అనేక శిరస్సులున్నవా? ఉన్నచో గదా అనేక నేత్రములుండుట? అన్నది ప్రశ్న. ఇది పరిశీలించవలసిన విషయము. ఇతడు మాయావిదుడనియు, ఇంద్రజాలశీలుడనియు తరువాతి కథాంశమున వర్ణింపబడినాడు. అన్ని తలలు లేకపోయినను మాయాజాలముచేత సర్వశక్తులను సమీకరింపగలడనుకొనవచ్చును. లేదా, రెండు కన్నులే చాలు; దృశ్యాదృశ్య భంగి విజృంభించి దిక్కులు పర్వునట్లు నిప్పులు రాల్చుటకు! మొత్తము మీద ఈ పద్యము సర్వ విధముల శబ్దవైచిత్రీ సంపద్భరితమైన మంచి రచనా శిల్పమునకు మచ్చుతునక.

## శబ్దనాద వైచిత్రి :

క॥ యముడంద్రడు నిన్ను నార్యులు
యమింతు భూతములనెల్ల; నట్లగుటఁదగున్;
శమనుండ వైతి కల్మష
శమనంబునఁజేసి నీవు జలజాప్త సుతా!

—అ. 7 - పద్యం 231

సావిత్రీ యముల సంభాషణ క్రమములోని పద్యమిది. యముని ప్రసన్నుని చేసికొనుటకు సావిత్రి పలికిన మాటలివి. ఇందు యమ శమన శబ్దములకు నిర్వచనము చెప్పబడినదనుట స్పష్టము. ఇట "యముడంద్రడు నిన్ను నార్యులు" అన్న వాక్యము వేదఋక్కు వలెనున్నదట! దీనికి కారణము "అంద్రడు" అన్న పదప్రయోగమే. దీనిని విడిగా ఉచ్చరించునప్పటి కంటె "యముడంద్రడు" అని కలిపి ఉచ్చరించునప్పుడు మఱింత నాదభరితమై నిగమనాదము వలె శ్రవణ తాడితమగుట గమనింపగలము. పద్యపఠనము ప్రారంభించగనే రెండు లఘ్వక్ష

రములకు పరిమితమైన యమ నామ శబ్దము కోమలముగ శ్రుతిగోచరమై 'అం|డు' శబ్దమునుచ్చరించుటతో, తన్నాదగాంభీర్యము యమ శబ్దమునకు సోకి సర్వము నాదమయమై 'నిన్ను' అనుటతో యమునియొక్క సరళ గంభీర మూర్తి కన్నులకు గట్టినట్లుండుట మహాశిల్పము! అదొక విధమైన శబ్దవైచిత్రి; అంతకంటె శబ్దనాద వైచిత్రి యనుట సమంజసము. చిన్నయసూరి బాలవ్యాకరణము, సంధిపరిచ్ఛేదము చివర "వాక్యావసానంబున సంధిలేమి దోషంబు గాదని యార్యులండ్రు" (55) అన్న సూత్రమును వ్రాసినాడు. ఈ సూత్ర రచనకు మూలము "యముడండ్రు నిన్ను నార్యులు" అన్న యీ వాక్యమే యనుట నిష్కర్ష!

## త్రికసంధి సహిత శబ్దవైచిత్రి :

క॥ తల్లడపడి యరదము డిగి
విల్లును నమ్ములును విడిచి; వెల్లనగుచు మే
నెల్లఁజెమర్పఁగ; నూర్పులు
పెల్లుగ నమ్మనుజ పశువు పెలుచం బఱచెన్

భీమార్జునులు సైంధవుని వెంబడించిరి. అర్జునుడు దూరాపాత విశిఖంబుల నాతని రథాశ్వములను కూలవేసెను. సైంధవుడు కింకర్తవ్యతామూఢుడై రథము దిగి అడ్డగోలుగ కాలినడకతో పాఱిపోవదొడగెను. "వానిజూచి నగుచు వారలో రోరి! యింకెందు బోవవచ్చు? పంద! నిలువు! అని వెంబడించుచునే యుండిరి. ఆ సందర్భములోని పదమిది. పద్యమంతయు అచ్చతెనుగుపదములే. 'అమ్మనుజ పశువు' అన్నదొక్కటే తెలుగు త్రికసంధి యుక్త సంస్కృతపదము. ఆ మనుజపశువు- అని వ్రాసినను సరిపోవును. కాని త్రికసంధి యుక్తముగ "అమ్మనుజ పశువు" అనుటలోనే యున్నది వైచిత్రి! "ఆ మనుజ పశువు" అని సంధి విరహితముగ నున్నపుడు 'ఆ' యన్నది కొంతదూరమును సూచించును. "అమ్మనుజ పశువు" అని సంధియుక్తముగ పలికినపుడు కబళించుటకు వీలుగ అందుబాటులోనున్నట్లు సూచించును! యీ కొంచెపాటి పనితనమువలన ఇంతటి వైచిత్రి సాధింపబడినది. ఇక మనుజపశువనుట సార్థకమైన ప్రయోగము. ద్రౌపది సైంధవునితో నీవు నాకు తోబుట్టువు వరుస వాడవన్నప్పుడు; వాడు, నాకు వావివరుసలతో పనిలేదు. రాజులకు వనితారత్నములెల్ల భోగమునెడ సాధారణములు అని ప్రత్యుత్తరమిచ్చెను ఇట్టి తుచ్ఛుడు మనుజ పశువుగాక మరేమగును? భీమార్జునులు వెంటబడినప్పుడు వాడు గుల్మమధ్యంబున దూరుటయు పశు

లక్షణమునే సూచించుచున్నది. సర్వ విధముల నిది సార్థక ప్రయోగమే. ఎట్టిన పద్యమంతయు తెలుగులో వ్రాసి ఒకటి రెండు సంస్కృతపదములను గాని, అట్లే పద్యమంతయు సంస్కృత పద బహుళముగ వ్రాసి ఒకటి రెండు తెలుగు పదములను గాని వేయుచుండును. అట్టి తావులలో కొన్ని విశేషాంశ స్ఫోరకము లుగ నున్నట్లు గుర్తింపవచ్చును.

ఎట్టిన త్రికసంధి సహిత శబ్దప్రయోగముచేత ఎంతయో శిల్పవైచిత్రిని సాధించిన పట్టులనేకములు గలవు ఒక్కటి యుదాహరింతును :

ఆ॥ అక్కబంధుఁడామిషార్థియై లక్ష్మణుఁ
బట్టి కొనియె బాహుబలమెలర్ప;
నతడు కడు విషణ్ణుఁడై "యన్న! ననుఁజూడు"
మనుచు రాముఁజూచి యనియె మఱియు

—ఆ. 6 - పద్యం 258

ఆ కబంధుడెట్టివాడో దీనికి ముందటి పద్యమున చెప్పబడినది. "అక్క బంధుడు........ లక్ష్మణుఁబట్టికొనియె" ఒక్క తృటిలో, ఒక్క దెబ్బలో, ఒక్క ఝట్టున, హఠాత్తుగ, కబళించిన వైనము ఈ త్రికసంధి ఘటిత శబ్దప్రయోగము వలన కండ్లకు గట్టుచున్నది !

## సంస్కృత శబ్దవైచిత్రి :

మ॥ ధరణీ రక్షణ మాచరింపక నృపుల్ దర్పంబునం బశ్యతో
హరులై, సాధుఁద్రోఁచి చేకుఱు తదీయ శ్రీధనక్షేత్రముల్
హరియింపంగలవారు; దారుణతరంబై పెల్లు చెల్లం బర
స్పర యుద్ధంబు ధరాతలేంద్రులకు విశ్వ ప్రాణి నాశంబుగన్

—ఆ. 4 - పద్యం 299

మార్కండేయుడు ధర్మరాజునకు కలియుగ ధర్మములు చెప్పు సందర్భములోని పద్యమిది. ప్రజలను రక్షించవలసిన రాజులు వారిని భక్షింతురట. కంచెయే చేను మేసిన చందమున ధర్మము దప్పి ప్రవర్తింతురట. పద్యమంతయు ఎట్టి క్లిష్టమైన సమాసములు లేక పొడిపొడి సంస్కృతాంధ్ర పదముల కలగలుపుతో సమతూకముగను, సమవేగముగను సాగిపోయినది. ఇందు

"పశ్యతోహరుల్లై" అన్నది అలుక్సమాసము. జాతీయమైన పలుకుబడి గల సంస్కృత శబ్దవైచిత్రికి తార్కాణ చూచుచుండగనే దొంగిలించువారని యర్థము. దొమ్మి, దోపిడీ చేయువారని చెప్పుట మఱింత సబబైన మాట. దీనినే "సాధుల ద్రోచి, చేకుఱ తదీయ శ్రీధన క్షేత్రముల్ హరియింపం గలవారు" అని వివరించినాడు. విశ్వప్రాణి నాశంబుగన్ పరస్పర యుద్ధంబులు పెల్లుచెల్లునట. ఈ "పెల్లుచెల్లు" అన్న కమ్మని తెలుగు ప్రయోగము కూడ సాలంకృతమైన శబ్దవైచిత్రికి నుదాహరణగ భావింపవచ్చును!

## సంస్కృత సమాస ప్రయోగ వైచిత్రి :

> చ॥ పతి విరహంబు దుస్సహము; భర్తృవినాకృతయైన కాంత దూ
> షితయగు సర్వమంగళ విశేషములందును; గాన మత్ప్రియుం
> డతులిత కీర్తిశాలి, సుగుణాఢ్యుఁడు, సాళ్వసుతుండు లబ్ధ జీ
> వితుడుగ నిమ్ము ధర్మ పదవీ పరిరక్షణ! పుణ్యవీక్షణా!
>
> —ఆ. 7 - పద్యం 249

సావిత్రి యమునితో పలుకు మాటలివి. సావిత్రికి యముడు ఇప్పటికి మూడు వరములు ప్రసాదించెను ప్రతి వరమునకు ముందు, సత్యవంతుని జీవితము దక్క మఱే వరమైనను కోరు మిచ్చెదనని యాతడు షరతు పెట్టుటయు, ఆ విధముగ నామె కోరగా నాతడిచ్చుటయు జరిగినది. నాల్గవసారి యట్టి షరతు పెట్టకయే వరము కోరుకొమ్మనును అది యవకాశముగ తీసుకొని యామె యీ వరమును కోరును.

ఇందు రెండవ పాదమున "కాన" నాల్గవ పాదమున "ఇమ్ము" అన్న తెలుగు శబ్దములు రెండును విరామ చిహ్నములుగ పనిచేసి పద్యమంతటిని మూడంశములుగ విరియజేయుట గమనింపగలము. ఈ రెండును దక్క తక్కిన పద్యమంతయు సంస్కృత పదపరీమళభరితమే. ఇచట "భర్తృ వినాకృతయైన" అన్నది ముఖ్యము. భర్త లేకుండా చేయబడినది అని యర్థము. భర్త లేనిది యనుటకు బదులు ఇట్లు చెప్పుట శబ్దవైచిత్రికి ఉదాహరణము. సత్యవంతునకిది కాలమృత్యువు కాదు; అకాలమృత్యువు. ఇది జరిగినట్లున్నను ఇప్పటికైనను జరుగనట్లు చేసికొనుటకు వీలున్నది. ఈ సర్వార్థమును సూచించు ప్రయోగమిది. ఇది మూలమున మూడుసార్లు ప్రయోగింపబడినది :

న కామయే భర్త్రా వినాకృతా సుఖం
న కామయే భర్త్రా వినాకృతా దివం
న కామయే భర్త్రా వినాకృతా శ్రియం
న భర్త్రా హీనా వ్యవసామి జీవితమ్

దీనిని ఎఱ్ఱన ఒక్క మాట మాత్రమే ప్రయోగించి తక్కిన భావమునంతయు "సర్వమంగళ విశేషములందు" అన్న వాక్యమున నిమిడ్చినాడు. మూలమున భర్తృశబ్దము నాలుగు మారులు ప్రయోగింపబడినది. రెండు, మూడు, నాల్గు పాదములందలి భర్త్రా శబ్దమును ఎఱ్ఱన తన పద్యమునందలి మూడవ పాదములో మూడు విశేషణములుగా అన్యథాకరించినాడు. "భర్త్రా వినాకృతయైన కాంత" అని ఒక్కమారు ప్రయోగించుట వలన, అది ప్రయోగించిన తీరును బట్టి "వైచిత్రి"ని సంతరించుకొన్నది ఎఱ్ఱనార్యుని యిట్టి ప్రయోగములను చూసియే కావలయును శ్రీనాథుడు శృంగార నైషధమున "గమికర్మీకృతనైక నీవృతా" వంటి మూల ప్రయోగములను తెలుగునకు దించుకొనినాడు !

## మిశ్రసమాస ప్రయోగ వైచిత్రి :

మ॥ జననాథోత్తమ! యేనుఁబూని భవదాజ్ఞాలీల చెల్వొంబు మ
జ్జనకుండైన సమీరదేవు కృపయున్ సత్త్వోన్నతుం జేయగా
ఘన వాస్తుంగ తరంగ సంగత మహోగ్రాహోరగాత్యుగ్ర ద
ర్శనమై పేర్చు పయోధి దాఁటితి జనాశ్చర్యైక సంపాదినై

—ఆ. 7 - పద్యం 25

హనుమంతుడు తాను సముద్రమును దాటిన విధమును రామునకు వర్ణించి చెప్పు సందర్భమిది ఇందు మొదటి రెండు పాదములందును అతడు సత్త్వ సంపన్నుడగుటకు రాముని ఆజ్ఞాలీల చెల్వము, సమీరదేవు కృపయు కారణములని పేర్కొనబడినది. మిగిలిన రెండు పాదములందు ఉత్తాల గభీర భీకర సముద్ర దర్శనము కళ్లకు కట్టింపబడి, జనుల కాశ్చర్యము గొలుపునట్లు దానిని లంఘించిన వైనము చెప్పబడినది. అలతి తెలుగు పదములతోను వలతి సంస్కృత పదములతోను పద్యము కట్టబడిన తీరు స్పష్టము.

ఇందు "ఆజ్ఞాలీల చెల్వొంబు" అన్నది శబ్దవైచిత్రి. 'చెల్వొంబు' అను తెలుగు మాట చాల అందమైనది. దీనిని 'ఆజ్ఞాలీల'తో కలుపుట వలన ఆ

మొత్తము ప్రయోగమునకు మఱింత అందము చేకూరినది. ఈ సమాసమున "చెల్వంబు" అను పదము సంస్కృతపదమువలె నతికి పోయినది. ఆజ్ఞయన వచ్చును; ఆజ్ఞాలీల యనవచ్చును. కాని "ఆజ్ఞాలీల చెల్వంబు" అనుచున్నాడేమి? ఇది శబ్దవైచిత్రితోపాటు అర్థవైచిత్రికి గూడ నుదాహరణముగ గ్రహింప వచ్చును. రాముని యాజ్ఞ ఇతరులకు ఆజ్ఞ మాత్రమే కావచ్చును. కాని హను మంతునకు మాత్రము అదొక లీల! లీల మాత్రమే గాదు; అదొక సౌంద ర్యానుభూతియట! ఇది సుందరకాండకు సంబంధించిన పద్యము (చెల్వంబు = సుందరము) కాగా తత్కాండ గత సౌందర్య సర్వస్వమునకు ఈ "చెల్వంబు" అను ప్రయోగము స్ఫోరకమై పద్యమంతయు సౌందర్యభరిత మగుచున్నది. సుందరుడగు హనుమంతునకు "రామాజ్ఞా లీల చెల్వంబు" సత్త్వమును సమ కూర్చి జనాశ్చర్యైక సంపాదిని చేయుచన్నటులో నాశ్చర్యమేమున్నది!

## గతి వ్యాపార సూచక శబ్దవైచిత్రి :

ఉ॥ కోటి సహస్ర సేన తగఁగొల్వఁగ, వానర సేనకెల్లఁదా
మేటి, మహాబలుండు, నిరమిత్రుఁడు, మిత్రసహాయుఁడై తగన్
పీటికి నుబ్బగాఁజటుల వేగ సముచ్ఛ్రిత పుచ్ఛ గుచ్ఛ వి
స్ఫోటిత దిగ్విభాగుఁడగుచుం జనుదెంచె సుషేణుఁడత్తఱిన్

—ఆ. 7 - పద్యం 87

హనుమంతుడు రామునకు సీతావృత్తాంతమును చెప్పినపిమ్మట సుగ్రీవుడు లంకపై దాడి వెడలుటకు నలుదిక్కుల నున్న వానర నాయకులను పిలిపించును. ఒక్కొక్క వానర నాయకుడు వచ్చిన విధమును ఒక్కొక్క పద్యములో రమ్య ముగ వర్ణించినాడు ఎఱ్ఱన. అట్టి పద్యములైదున్నవి. వానిలో తలమానిక మీ పద్యము. ఇట సుషేణుడను నాయకుని రాక వర్ణింపబడినది.

ఇటనొక చమత్కారమున్నది. మొదటిపాదమున సంస్కృతాంధ్ర పద బంధములు క్రమముగా నొకటి పిమ్మట నొకటి పేర్చబడినవి. రెండవ మూడవ పాదముల వరుసగా మూడు సంస్కృత పదబంధములు, ఆ పిమ్మట మూడు తెలుగు పదములు వేయబడినవి. మూడవ పాదమున నొక పెద్ద సంస్కృత సమాసము. దానికి తగినట్లు అవల మూడు నాల్గు తెలుగు పదములు ప్రయోగింపబడినవి. ఇట్లు ఉభయ భాషాపదములు పూసగుచ్చినట్లుండుట ఒక విధమగు రచనాశిల్పము.

ఇందు "చటుల వేగ సముచ్ఛ్రిత పుచ్ఛగుచ్ఛ విస్ఫోటిత దిగ్విభాగుడగుచున్" అన్నది సమస్త శబ్దవైచిత్రికి తార్కాణము. వానర సేనకెల్ల తామేటి. మహాబలుండు! దీనినిబట్టి యాతని భారీ శరీరము, తీరి యెట్లుండెనో ఊహించుకొనవచ్చును! అట్టి వాడు "ఉబ్బుగా" చనుదెంచెనట. ఆ ఉబ్బులో నాడించబడుచున్న తోకయొక్క కుచ్చు దిక్కులను చీల్చుచున్నదనుట స్వభావోక్తి సుందరమైన రచన. "పుచ్ఛ గుచ్ఛ"యను శబ్దాలంకారము శబ్దవైచిత్రిని ద్విగుణీకృత మొనర్చుచున్నది. దీనిని గతి వ్యాపార సూచక శబ్దవైచిత్రి యనవచ్చును.

## అచ్చతెనుగు శబ్దప్రయోగ వైచిత్రి :

ఇట్లు నానాదిక్కులనుండి వచ్చిన వానర నాయకు లొకచోట చేరిరి. ఆ కోతి మూకల జాతి లక్షణములను, చపలవర్తనములను ఎఱ్ఱన యీ క్రింది వచన మున చమత్కారముగ వర్ణించెను :

వ॥ "మఱియు ననేకు లనేక సహస్ర సంఖ్యా బలంబుల తోడం జను దెంచి రిట్లు గూడిన కపివీరులు వివిధాకారు. లపార బలశౌర్య సారు లతిఘోరంబుగా (శ్రేణి) నిగుడుచు, మగుడుచుం దాటుచుం బాటుచు. ఒరుగుచు, సురుగుచు, మలయుచు, బొలయుచు, మత్తిల్లి గిరి గుహా లయంబులందును, దరువనంబులందును, సరిదుపాంతంబులయందును, నానందంబున విహరించుచుండిరి. తదనంతరంబ." -40

ఇందు "నిగుడుచు మొదలుకొని పొలయుచు" వఱకు ఎనిమిది అచ్చ తెనుగు పదములు ప్రయోగింపబడినవి. వానరమూల యొక్క ఒక్కొక్క చంక్ర మణమునకు ఒక్కొక్క ప్రయోగమన్న మాట. ప్రతి శబ్దము చిత్రీయుతమై యెఱ్ఱనగారి పరిశీలనా పటిమకు, పదప్రయోగ దక్షతకు పరమోదాహరణముగ నున్నది. మాఱీచుడు మాయలేడియై చౌకళించినప్పుడు కూడ అందములైన ఇట్టి అచ్చతెనుగుల పోహళింపుతో నొక గొప్ప పద్యమును కట్టినాడెఱ్ఱన. "పఱచున్ దవ్వుల" అన్న ఆ పద్యము రెండుమాఱులు పూర్వోదాహృతమైనది. అందలి రామణీయకతకు "సర్వమార్గేచ్ఛా విధాతృడు" అన్న ప్రకరణమును చూడ వచ్చును. పునఃపునరుక్తి దోషమునకు వెఱచి యిట నుదాహరించుట లేదు.

## అక్షర రమ్యతలో శబ్దవైచిత్రి :

అక్షరరమ్యతయు శబ్దవైచిత్రియు సమన్వయింపబడిన వనదగిన యీ క్రింది రెండు పద్యములను తిలకింపుడు :

సీ॥ నానా సహస్ర సంఖ్యానంబులై సంత
తానంద విగత భయత్వ లీల
నక్కాననమున నే దిక్కు సూచిన నతి
సంకులంబుగఁగుంద శంఖ చంద్ర
హార నీహార డిండీర పటీర ము
క్తాహార హీర సంకాశములును
గాఢంబ కాలేయ కాదంబినీ నీల
జాల తమాలికా సన్నిభములు

తే॥ ప్రౌఢ బంధూక పల్లవ భాసితములు
వికచ కాంచన చంపక విస్ఫుటములు
నైన వర్ణంబులొప్ప నేత్రాభిరామ
భంగినలరారు గోకదంబంబులఁగనియె

—ఆ. 5-375

ఇది యెఱ్ఱన వర్ణనా కౌశలమునకు పరాకాష్ఠయనదగిన లోకోత్తర పద్యములలో నొకటి. ఘోషయాత్రా సందర్భమున దుర్యోధనుడు చూసిన గోకదంబ వర్ణనమిది. ఇందులో కొన్ని శబ్దములున్నవి. అవి విడిగా చూచినప్పుడు వేనికవి అందమైన శబ్దములే, కాని వైచిత్రి గోచరించదు. ఒకదానితో నొకటి కూర్చుట వలన ప్రతి శబ్దము వైచిత్రీభరితమై వింతకాంతి తళుకొత్తుచు శబ్దవైచిత్రిని మించిన గోకదంబ వైచిత్రియు, గోకదంబ వైచిత్రిని మించిన శబ్దవైచిత్రియు రంగులు చిమ్ముచు అసలివి పదములా పచ్చలపతకములా! అన్న భ్రమను గొలుపుచు పద్యమునకు పద్యమే వైచిత్రీ భరితమై సరస్వతీదేవికి మంగళ నీరాజనములు పట్టుచున్నది!

మ॥ వితతానేక మృగాకులంబును సదా విఖ్యాత నానాతరు
ప్రతతీ పుష్ప సుగంధ బంధుర శుభావాసంబు బ్రహ్మర్షి సం
శ్రిత పుణ్యాశ్రమమండలంబు నగుచుంశల్యొందు నక్కాననలో
ధృత పుణ్యుల్ విహరించి రేపురును గుంతీ పుత్రు లిచ్ఛాగతిన్

—ఆ.—142

వ్యాసముని ముఖోద్గతమైన వ్రీహి ద్రోణోపాఖ్యానమును విన్నపిమ్మట కుంతీ పుత్రులిచ్ఛాగతితో ఇట్టి యరణ్యమున విహరించిరట ! మఱి యెఱ్ఱన చేసిన దేమి ? వ్యాసముని ప్రణీత పరమార్థమును తెల్లము చేయుటలో నన్నయ తిక్కనలకు భాగస్వామియై తనదైన శబ్దవైచిత్రితో ఇచ్ఛాగతితో అరణ్యపర్వ శేషమున విహరించుట !



# సూక్తి వైచిత్రి

"పరిఢవింతు ప్రబంధ పరమేశ్వరుని శేవ సూక్తివైచిత్రి నొక్కొక్క మాటు"

ఇట్లు ఎఱ్ఱన కవితలో 'సూక్తి వైచిత్రి'ని కనిపెట్టి, దానిని తన కవితలో పరిఢవిల్ల జేసిన మహనీయుడు శ్రీనాథుడు. 'సూక్తివైచిత్రి' యనగా "అర్థగతమైన ప్రౌఢత" యని విజ్ఞులు భావించిన విధము పూర్వోక్తమైనది.

## నన్నయ నన్నిచోడుల 'సూక్తి' పద ప్రయోగములు :

తెలుగు కవులలో ఈ 'సూక్తి' పదమును తొలుత ప్రయోగించిన మహాత్ముడు ఆదికవి నన్నయ భట్టారకుడే :

"నానారుచిరార్థ సూక్తి నిధి నన్నయభట్టు"

—భారతావతారిక - 26

పిమ్మట నన్నెచోడుడు తన కుమార సంభవమునందిట్లు ప్రయోగించెను :

"అక్షరములు సూక్తులార్యులకుఁ గర్ణరసాయన లీల గ్రాలగాన్"

—ఆ. 1 - 35

"మృదురీతి సూక్తులింపొదవింప మే లెల్ల భావమ్ము నెలమి ప్రీత్యావహముగ" - 36.

"అక్కజమై మహార్థ నివహంబు సదుక్తులు మెచ్చఁజూచినన్" - 38

క॥ "చతురోక్తుల నుతపద బహు
గతుల నలంకార భావకాంతి రసార్థో
న్నతిఁ గృతి నతి రసికులు వర
సతిగతి నెఱిఁగింప వలదె సౌభాగ్యమునన్" - 39

ఇదీ 'సూక్తులు' 'సదుక్తులు' 'చతురోక్తులు' క్రమపాకములో నన్నెచోడుడు ప్రయోగించిన ఉక్తుల వరుస. సూక్తులనగా మంచి మాటలు, సుభాషితములని యర్థము. సదుక్తులనగా నిర్దుష్టమైన పదములని యర్థము. చతురోక్తులనగా అలంకార భావకాంతి రసార్థోన్నతి స్ఫోరకములగు పదములు, పద బంధములను అర్థమును భావింపవలయును.

మఱి నన్నయ ప్రయోగించిన "నానా రుచిరార్థ సూక్తి" యన్న మాట కర్థమేమి? సాధారణముగా మన విమర్శకులు ఈ మాటను సుభాషితార్థమున భావించుట కద్దు. నన్నయగారి కవితాలక్షణములలో "ప్రసన్నకథా కలితార్థయుక్తిని" కథా కథన శిల్పపరముగను, "అక్షర రమ్యత"ను భాషాపరముగను నిర్వచించుట పరిపాటి. ఇక, ఈ మూడవదగు లక్షణమును, కేవల సుభాషితార్థమున భావించుటకంటె భావపరముగ అర్థగతమగు ప్రౌఢతగా భావించుట లెస్స. లేనిచో అట్టి గుణము నన్నయ కవితలో లేకపోయిన కొఱత ఏర్పడును.

## నన్నయ 'సూక్తి' పదమునకు నన్నెచోడని వ్యాఖ్య:

నన్నెచోడుడు నన్నయ కవితను చూచియుండెనో లేదో తెలియదు. చూచియున్నచో కావలయుననిగాని, చూడకయున్నచో, కాకతాళీయముగ గాని యాతడు నన్నయగారి "నానారుచిరార్థ సూక్తి" యను మాటను వ్యాఖ్యానించుచున్న చందమున, ఇట్లు మూడువిధములగు ఉక్తులను విశేషించి చెప్పినట్లు భావింపవచ్చును. ప్రకృతమున నిక్కడ పేర్కొనబడిన నన్నెచోడని పద్యములలో "మృదురీతి సూక్తులిం పొదవింప" అను పద్యముచివర "రుచిర కావ్యరత్నవీథి" (పద్యం - 36.) అని 'రుచిర' శబ్దము ప్రయోగింపబడిన వైనము గమనార్హము. నన్నెచోడని యీ పద్యములన్నియు నన్నయగారి "నానారుచిరార్థ సూక్తి" యను వాక్యమునకు వ్యాఖ్యాన ప్రాయములన చెల్లును. వ్యాఖ్యానించుట మాత్రమే కాదు; వాటిని తాను స్వీకరించి మఱొక విధముగ పక్వమునకు తెచ్చుకొని తన కావ్య రచన చేసినాడనియు భావింపవలయును. ఇట్లు శబ్దశాసనుని "నానారుచిరార్థ సూక్తులు" "కవిరాజ శిఖామణి" కవితలో ఒకానొక క్రమపరిణతిలో చతురోక్తులైనవి. అవి మఱికొంత తళుకును సంతరించుకొని ప్రబంధ పరమేశ్వరుని సంక్రమించినవి. ఈతని కవితలో "చతురోక్తులే" కాదు; "మధురోక్తులు" గూడ నున్నవట! ఆ విషయము ఇట్లు చెప్పబడినది:

ఉ॥ ఉన్నత సంస్కృతాది చతురోక్తి పథంబుల కావ్యకర్తవై
నృసింహపురాణము—ఆ. 1 - 17

ఉ॥ నీ మధురోక్తి గుంఫన మనీషులు మెచ్చగ బ్రస్తుతింపు
—నృసింహపురాణము—ఆ - 1; 21

## "సూక్తివైచిత్రి" పదబంధమును శ్రీనాథుడు నిర్మించిన విధము:

ఎఱ్ఱన రాజరాజును విచిత్రాలంకారోజ్జ్వల కవితాలాప కలాప సంతతానంద మతీ! అనియు, "మహాకావ్యరస ప్రయోజనారూఢమతీ!" అనియు సంబోధించి యున్న విషయము పూర్వోక్తము. ఇది చూచిన జక్కన ఎఱ్ఱన కవితలో "శబ్ద వైచిత్రి"ని "చిత్ర కవిత్వ వాగ్వైభవ జృంభణము"ను కనిపెట్టి యుండునని వెనుక చెప్పికొనియుంటిమి. ఇదంతయు పరిశీలించిన పిమ్మట శ్రీనాథుడు నన్నయ నన్నెచోడుల నుండి 'సూక్తి' పదమును పరిగ్రహించి దానికి 'వైచిత్రి' యను మాటను చేర్చి ఎఱ్ఱన కవితను "సూక్తివైచిత్రి"యని పేర్కొనెను కావలయును. ఇంతటి సారగర్భిత మీ లక్షణము. శ్రీనాథుని వంటివాడు ఎఱ్ఱనకిచ్చిన యీ "కితాబు" మేలైనది. జక్కన చెప్పిన 'శబ్దవైచిత్రి'ని గూర్చియు "చిత్ర కవిత్వ వాగ్వైభవ జృంభణము"ను గూర్చియు ఎవరుగాని అంతగా పట్టించు కొన్నట్టు కానరాదు! ప్రతి వారును ఈ "సూక్తివైచిత్రి"ని నిర్వచించిరి, వివరించిరి, ప్రశంసించిరి.

## "సూక్తివైచిత్రి" నిర్వచన విచారచర్చ:

దీనిని నిర్వచించుటలో ప్రధానముగ రెండభిప్రాయములు కొస్పించు చున్నవి:

1. హితోక్తి లేక హితోపదేశము, సుభాషితము, తెలివైన మాటలు, జాతీయోక్తి.

2. అర్థగతమైన ప్రౌఢత.

ఈ రెండవదే సరియైన నిర్వచనము. కావ్యమున రసానందము ప్రధానము. ఉపదేశము గౌణము. అట్టియెడ కవిత్రయములో నొకడగు ప్రబంధ పరమేశ్వరుని కవిత, ప్రధానమైన రసాత్మకమే యగును గాని గౌణమైన ఉప

దేశాత్మకము కాజాలదు. ఉపదేశాత్మకమే యైనచో నట్టి కవితను తన కవితలో పరిఢవిల్ల జేసిన కవిసార్వభౌముని కవిత కూడ గౌణమైపోవును! అసలు వస్తుస్థితి యిదికాదు గదా?

నంది మల్లయ్య ఘంట సింగయ్యలు తమ "వరాహపురాణము" లో ఎఱ్ఱన్నను ఇట్లు స్తుతించిరి:

"కీర్తితములయిన శంభుదాసుని వాగ్విలాసములు నెమ్మనంబు లోపల నిలిపి" —ఆ. 1-18

గణపవరపు వేంకటకవి తన "శ్రీ ప్రబంధ రాజవేంకటేశ్వర విలాసము" లో నిట్లు స్తుతించెను:

"ప్రబంధ పరమేశు నెఱ్ఱప్రెగడను దలంతు సూక్తి ప్రౌఢిన్" (పీఠిక. ప. 15)

ఇచ్చట "వాగ్విలాసములు" "సూక్తి ప్రౌఢిన్" అను ప్రయోగములకు సుభాషితములు అను నర్థము చెప్పవచ్చునా? ఇదిట్లుండ;

రాజశేఖరుడు తన కావ్య మీమాంసలో చెప్పిన యీ క్రింది శ్లోకము నరయుడు:

"యా దుగ్ధాపి నదుగ్ధేవ కవిదోగ్ధృభి రన్వహమ్
హృది నః సన్నిధత్తాం సా సూక్తిధేనుః సరస్వతీ"
—తృతీయాధ్యాయము - కావ్యపురుషోత్పత్తి-8

"కవులనెడు దోగ్ధలు ప్రతిదినము పితుకుచున్నను, ఏది పితకనట్లే యున్నదో అట్టి సూక్తి కామధేనువు అగు సరస్వతి మా హృదయమునందు నివసించుగాక!"

ఇచ్చట 'సూక్తి' పదమున కర్థమేమో స్పష్టము!

భోజుడు చంపూరామాయణమున చెప్పిన యీ శ్లోకమునరయుడు:

గద్యానుబంధ రస మిశ్రిత పద్యసూక్తిః
హృద్యా హి వాద్యకలయా కలితేవగీతిః
—బాలకాండము - శ్లోకము-126

ఇట "రసమిశ్రిత పద్యసూక్తి" యననేమో వివరింపబనిలేదు. ఈ 'సూక్తి' పదము చుట్టు ఎంతటి అద్భుత రమణీయమైన సాహిత్య సంగీత తేజః పరివేషమును చుట్టినాడో!

ఈ భోజుడే 'ఉక్తిని' మూడు విధములుగా విభజించిన విధమిది :

వక్రోక్తిశ్చ రసోక్తిశ్చ స్వభావోక్తిశ్చ వాఙ్మయం
సర్వాసు గ్రాహిణీం తాసు రసోక్తిం ప్రతిజానతే
—సరస్వతీ కంఠాభరణం - 5-8

స్వభావోక్తిః - తత్రగుణ ప్రాధాన్యే స్వభావోక్తిః
వక్రోక్తిః - ఉపమాద్యలంకార ప్రాధాన్యే వక్రోక్తిః
రసోక్తిః - విభావానుభావ వ్యభిచారి సంయోగాద్రసోక్తిః

ఈతడు తన "శృంగార ప్రకాశము"లో కూడ నీ మూడు విధముల ఉక్తిని గూర్చి యిట్లు వాక్రుచ్చెను :

"త్రివిధః ఖల్వలంకారవర్గః- వక్రోక్తిః స్వభావోక్తిః రసోక్తిరితి" సరస్వతీ కంఠాభరణము, శృంగార ప్రకాశము - ఈ రెండును లక్షణగ్రంథములు. ఇట చెప్పిన ఈ 'ఉక్తి' యనుమాటనే తన లక్ష్యగ్రంథమగు చంపూ రామాయణమున "గద్యానుబంధ రసమిశ్రిత పద్యసూక్తి" అను శ్లోకపాదమున 'సూక్తి' యని మార్చి చెప్పుట గమనింపవలెను. అంతేగాదు; తాను పేర్కొన్న త్రివిధములగు సూక్తులలో "రసోక్తికే" ప్రాధాన్యమన్నట్లు "రసమిశ్రిత పద్యసూక్తి" అనుటయు గమనార్హము. తక్కిన రెండు విధములగు నుక్తులు 'రసోక్తి' యందతర్భాగములని సూచించినాడనియు భావింపవచ్చును. ఇదంతయు పరిశీలించి చూడగా మఱి యీ 'సూక్తి' యను పదమును సుభాషితార్థమున భావించుట యెట్లు!

## సూక్తివైచిత్రి - లక్షణ నిర్వచనః

'సూక్తి' యనునది రసభావాలంకార ధ్వని వర్ణనావైభవాది సర్వ కవితాలక్షణ సారసంగ్రహ సంకేతిత పారిభాషిక పదబంధమని భావించుట సమంజసము. ఇందలి విలక్షణమైన శిల్పమే "సూక్తివైచిత్రి". ఈ 'సూక్తి' యనునది సర్వాంధ్ర కవులలోనుండు కవితాలక్షణము కావచ్చును. అందలి వైచిత్రి

మాత్రము ఎఱ్ఱన కవితయందే యుండునట ! నన్నయగారి "నానారుచిరార్థసూక్తి" అను వాక్యములోని 'సూక్తి' పదమునకే, ఎఱ్ఱన వాడిన 'విచిత్ర' పదమును తగిలించి శ్రీనాథుడు 'సూక్తివైచిత్రి' అని చెప్పెనని వెనుక భావించితిమి. నన్నయ మనకు ఆదికవియేగాక ఆదర్శకవిగూడ. అందువలన మనకవులేది గ్రహించినను అతని నుండియే గ్రహింతురు. అందునను, ఎఱ్ఱన విషయము వచ్చినప్పుడు; ఆతనికి నన్నయ్యతో గల ఆత్మీయతను బట్టి యాతడు చెప్పిన 'సూక్తి' పదమునకే ఎఱ్ఱన 'విచిత్ర' పదమును శ్రీనాథుడు జోడించినాడని భావించుటలో విప్రతిపత్తి లేదు. డాక్టర్ యం. కులశేఖరరావుగారు "వచనవాఙ్మయ వికాసము" అను తమ సిద్ధాంత గ్రంథమున "ఎఱ్ఱాప్రగడ వచన రచనము" అన్న ప్రకరణమున "సూక్తి వైచిత్రి" ఎఱ్ఱన స్వతంత్రశిల్పము" అని వ్రాక్రుచ్చిరి. వీరు వాడిన యీ "శిల్పము" అను మాట శ్రీనాథుడు చెప్పిన 'వైచిత్రి' అను మాటకు రమ్యమైన వ్యాఖ్యానమని చెప్పవచ్చును.

ఇప్పటికి తేలిన సారాంశమిది : సూత్ర ఫక్కిలో చెప్పవలయునన్నం- సూక్తి యనునది రసభావాలంకార ధ్వని వర్ణనా వైభవాది సర్వకవితాలక్షణ సారసంగ్రహ సంకేతిత పారిభాషిక పదబంధము; ఆయా విషయములందలి విలక్షణమైన శిల్పమే సూక్తి వైచిత్రి :

రసము, భావము, అలంకారము, ధ్వని మొదలగు నంశములు కవితలో వర్ణన ద్వారా మాత్రమే వ్యక్తీకరింపబడుచుండును. అనగా కవితకు వర్ణన ప్రాతిపదికయినది. నన్నయ కథాకథన శిల్పమునకు, తిక్కన నాటకీయ శిల్పమునకు, ఎఱ్ఱన వర్ణనా శిల్పమునకు పీఠాధిపతులని పలుమారులు పూర్వోక్తము. ఎఱ్ఱన వర్ణనా వైభవము, తదంతర్గత విశేషాంశముల విరాట్ స్వరూపము ప్రథమాధ్యాయములో ప్రథమ ప్రకరణమున ప్రదర్శితము. తక్కిన తావులందు కూడ పలు విధముల ప్రకటితమైనవి. కావున నిట దిఙ్మాత్రముగ నుదాహరించి సమన్వయింతము.

## వక్రోక్తి వైచిత్రి :

రామలక్ష్మణులు పంపా సరోవరమును దర్శించిరి. అప్పటిన ఎఱ్ఱన ఆ సరస్సు నిట్లు వర్ణించెను-

సీ॥ కమనీయ కమలినీ కల్హార దళ కేస
రాన్విత జలముల నర్ఘ్య విధియుఁ
దరళ తరంగ హస్తములఁ బాద్యంబు, ను
న్మత్త చక్రసారస మధుప హంస
రుతులఁ బ్రియోక్తులు, రుచిరవానీర ని
వేశన చ్ఛాయల విశ్రమంబు
మంద సంచారిత మారుతంబుల నురు
తాపనోదనమును దగిలి యెపుడు

ఆ॥ నాచరించుచును సమంచితాతిథి జన
సేవనమునఁ దనదు జీవనంబు
ఫలమునొంద నొప్పు పంపా సరోవరం
బెదురఁ గాంచిరన్నరేంద్ర సుతులు

—ఆ. 6-364

ఇచట పంపాసరోవరమున అతిథి సేవ యందాసక్తియు ననురక్తియుగల స్త్రీ స్వభావమారోపింపబడినది. ఈ స్త్రీ స్వభావమెవ్వరిదై యుండును? తల్లక్ష్మిది కావలయును (సరోవరలక్ష్మి యనుట పరిపాటి) లక్ష్మి అనగానే సీత స్ఫురించును ఇది యిచటి వ్యంగ్యము. రామునకు ఆ సరోవరమునందాతిథేయురాలైన గృహిణి స్ఫురించెను. వెంటనే సీత స్మరణకు వచ్చెను. అతడు దుఃఖ పరవశుడయ్యెను. సహృదయుని చిత్తవృత్తి ఆనంద పరవశమయ్యెను! ప్రకృతి యందు మానవ ప్రకృతిని రూపించి, తద్వారా మఱల మానవ ప్రకృతిని- అటు నాయకుని యొక్కయు, ఇటు సహృదయుల యొక్కయు- అర్ద్రీభూతమొనర్చి రసప్రవణ మొనర్చగల నేర్పు ఎఱ్ఱనకున్నది. ఇదంతయు నిందలి 'జీవన' పదమును శ్లేషించుట వలనను, రూపకాలంకారమును సమస్త వస్తు విషయ సావయవముగ గాక, ఏకదేశవివర్తిగ జేయుట వలనను సాధింపబడినది. ఇట నలంకారము నిట్లు వాడుటయే ఉక్తివైచిత్రి!

సైంధవుని చేతం బాంచాలి చెఱవోయె శత్రువును దున్మి నెచ్చెలిని తెండు అని ధాత్రేయి పాండవులతో పలికి ద్రౌపదిని ఇట్లు వర్ణించును:

సీ॥ బూదిలో దొరఁగిన పూర్ణాహుతియుఁబోలెఁ
గుక్కతో త్రిత్తిలోఁగూరినట్టి
రాజిత కపిల గోరసధారయును బోలె
మసనంబులోఁబడ్డ మహిత పువ్వు
మాలికయును బోలె, మదిరాక్షి దుర్జను
కతమున దూషిత గాక మున్న
చనదయ్యె వేగంబ చనునె సన్మంత్ర వి
శ్రుత పురోడాశంబు శునకమునకుఁ?

తే॥ జనునె కమల సుగంధి కాసార కేళి
కలుష శవఖాదియైన సృగాలమునకుఁ?
జనునె తన్వంగి సౌందర్య చతుర భావ
శింగి యా దుష్ట చరితుని పాలు పడఁగ

—అ. 6-201

ఇందు ద్రౌపదికిని, సైంధవునకును వాడబడిన ఉపమానముల తారతమ్య ముఁను గమనింపవలెను. ద్రుపదుడు జన్నమొనర్చు వేళ వహ్నిలోన జనియించిన పవిత్రురాలు ద్రౌపది. కావున నీమెకు వాడబడిన ఉపమానములన్నియు యజ్ఞ సంబంధములు. మంగళమయమైన యజ్ఞమును అపవిత్రమొనర్చునవి కుక్కలు నక్కలు. కావున సైంధవునకు వాడబడిన వన్నియు తత్సంబంధములు. అసలీ పద్యమే ఒక యజ్ఞ వర్ణనా ఖండమనవలయును. ఎఱ్ఱన పాత్రల యొక్క స్వభా వమును బట్టియేగాక, వాటి పూర్వచరిత్రను బట్టిగాని మరేదైన తద్గత విశేష మును బట్టిగాని అలంకారములను వాడుచుండును కాబోలు! అలంకారములను వాడవలయును గాన వాడుచుండుట గాక అట్టి సౌభాగ్యము కావలసిన చోటనే వాడుచుండును! ఈ విషయమున నిదొక విలక్షణమైన శిల్పము. ఇది సూక్తి వైచిత్రీతత్త్వము నందొక యంశము.

## స్వభావోక్తి వైచిత్రి :

కట్టెలు కొట్టుచు అలసిపోయిన సత్యవంతుడు గొడ్డలి పుడమిపై వైచి సావిత్రితో నిట్లనును :

చ॥ ఒడలు వశంబుగాదు; భ్రమనొందిన యట్లు మనంబు దూలెడిం
గడఁగి శిరంబు శూల విశిఖ ప్రకరంబున నొంచినట్టి ద
య్యెడు; నిలువంగ నోర్వ; నొకయించుక సేపు శ్రమంబు దీఱ నీ
యొడఁ శయనింతు నావుడు సితేక్షణ మెత్తని సంభ్రమంబుతోన్

ఆ. 7-216

ఇందు చతుర్థ పాదమందలి 'నావుడు' అను మాట దాకా సత్యవంతునిలో జరుగు శారీరక మానసిక వికారస్థితి యొక్క క్రమదశలు ఒక్కొక్క మాటలో చిత్రముగ వ్యక్తము చేయబడినవి. ఆ తరువాతి ఒక్క వాక్యములో సావిత్రి యొక్క శారీరక మానసిక సంభ్రమము చెప్పబడినది. సత్యవంతుడు తనకేమి ముంచుకొని రానున్నదో తెలియడు. సావిత్రికి తెలియును. తెలిసిన సావిత్రికే ఉత్తలపాటు అధికముగ నుండును. కాని యామె నిబ్బరముగ నున్నదట! "మెత్తని సంభ్రమంబుతోన్" ఎంత చక్కని వాగ్వైఖరి యిది! సత్యవంతుని పక్షమున "భ్రమనొందినయట్లు మనంబు దూలెడిన్" అనియు, సావిత్రి పక్షమున "మెత్తని సంభ్రమంబుతోన్" అనియు ఒకే తీరుకట్టుబడి గల వాక్యములు సత్యవంతునిలో జరుగుచున్న మార్పులు సావిత్రిపై నెట్లు పనిచేయుచున్నవో తెలియజేయుటకే యని తలపవచ్చును. ఇందలంకారము ఉత్ప్రేక్షయా! స్వభావోక్తియా? ఉత్ప్రేక్షానుప్రాణితమైన స్వభావోక్తియనుట సమంజసము.

ముద్గలుడను ముని ఉంఛవృత్తిలో జీవితము గడుపుచుండును. దూర్వాసు డాతనికతిథియై వచ్చి ఆరు పర్వములు కుడుచుచు కూర్చుండును. ముద్గలుడు తాను పస్తులుండియు అతిథిని సంతృప్తుని చేయుచుండును. చివరికి దూర్వాసు డాతనిని మెచ్చుకొనుచు ఇట్లు పలుకును:

చ॥ చవులకుఁ బ్రేమ ముడించు ననిశంబును నాలుక; దాల్మి పెంపు, ధ
ర్మ్మవను, శమంబుఁ దెక్కొను సముద్ధతి నాకలి, వీని రెంట నుం
దవులవు; జీవితస్థితికిఁదావల మన్నము; నీవు జీవితే
చ్ఛ విడిచి తిప్పుదేమని ప్రశంస యొనర్తు నినుం దపోనిధీ

—ఆ. 6-123

ఒక మహర్షి మఱియొక మహర్షిని ప్రశంసించు నందమైన సన్నివేశ మిది. తిండికి వాయుట, ఆకలిబాధ, ఈ రెండింటిని అనుభవించుట వేఱు, ఆ

యనుభవమును రమణీయముగ వ్యక్తపఱచుట వేఱు. అందమైన సంస్కృ తాంధ్ర పదముల పోహళింపుతో అతిసహజముగ వ్రాసి నాడెఱ్ఱన. భావప్రకటనా విధానము మంచి పదునుగ నున్నది. స్వభావోక్తి వైచిత్రికి మంచి యుదాహరణ మీ పద్యము.

## రసోక్తి వైచిత్రి :

వ॥ ..................హనుమంతుడు జానకి హృదయంబు మూర్తిమంతంబైన పగిదినున్న యమ్మహామణి రాజచూడామణికి సమర్పించిన

ఆ॥ అమ్మనోజ్ఞ రత్నమక్కున గదియించి
పులకలెగయఁగొంత ప్రొద్దు విభుఁడు
జానకీ కుచాగ్ర సంగమ సుప్తుడై
నట్లయుండె ముకుళితాక్షుఁడగుచు —అ. 7 - 88

సందర్భము స్పష్టము. హనుమంతుడు సీత నుండి తెచ్చిన మణి జానకి హృదయంబు మూర్తిమంతంబైన పగిదినున్నదట ! దానిని అక్కున గదియించు కొనినాడు రాముడు. ఈ పద్యమునందలి మొదటిపాదము "అమ్మనోజ్ఞ" అని త్రికసంధిసహిత పదబంధముతో ప్రారంభమగుటలో నొక చమత్కారమున్నది. ఆ మణి చేతికందినదే తడవు రాముడు ఆత్రముగ అమాంతము గుండెలకు హత్తు కొన్న వైనము స్ఫురించుచున్నది ! మఱియు నా పాదమునందలి సంయుక్తాక్ష రములన్నియు ఒకపరి గాఢముగా నదుముకొన్నట్లును, మఱియొకసారి సడలించినట్లును, పర్యాయ క్రమమును సూచించుచున్నట్లున్నవి. ఈ వర్ణనమంతయు విభావాది సామగ్రీ సంయోగమున రసము నుల్లాసితము చేయుట. పద్యము ఆట వెలదిలో నుండుటయు కొంత చమత్కార హేతువగుచున్నదని భావింపవచ్చును.

పరీక్షితుడను రాజు తన ప్రేయసియగు సుశోభనను కమలాకర తీరమున నునిచి తాను కృతావగాహుడైనపిమ్మట జలవిహారార్థము ఆమెను కూడ రమ్మని పిలుచును.

క॥ "మేలై యున్నది జలము వి
శాలనయన ! చెమట వోవ జయ్యన దేహ
క్షాళన మొనరింపు" మనిన
నా లేమ దరస్మితాన నాంబుజ యగుచున్ —అ. 4 - 325

ఆ॥ మదుగుసొచ్చి.........

ఆననాంబుజము దరస్మితమైనదనుట ఉక్తివైచిత్రి. అట్లు దరస్మితాన నాంబుజ యగుచు మడుగుసొచ్చినదనుట వలన ఈ ఉక్తివైచిత్రి మఱికొంత లీవెలు సాగినది. ఈ పద్యమునకు ముందున్న వచనమునందు 'కమలాకరము' అని చెప్పబడినది. మడుగు అను మాటను కమలాకరమని భావింపవలెను) ఆననాం బుజము కమలాకరము నందలి కమలములతో సాదృశ్యము భజించినదన్న మాట ! అట్లు మడుగు సొచ్చిన సుశోభన మాయమై పోవునని పిమ్మటి కథాం శము. అలేమ దరస్మితాననాంబుజ యగుచు ననుట చక్కని యనుభావ వర్ణ నము.

గంగలో విడిచిపెట్టబడిన కర్ణుడు సూతుని చేతికి దొఱికెను. అతడా శిశు వును తెచ్చి తన భార్య రాధ చేతికిచ్చెనుం

క. అనిదాని చేతికిచ్చినఁ
గొని యురమునఁనదియు నదిమికొనియెఁ గొడుకు; న
వ్వనితకుఁ బాలెంత తెఱం
గున జన్నులు సేపెనపుడు కూరిమి పేర్మిన్

—ఆ. 7-358

ఇట చన్నులు సేపెననుట 'ముదము' అను చక్కని సంచారి భావాను వర్ణన.

## రసశిల్ప వైచిత్రి :

రసపోషణమున ప్రబంధ పరమేశ్వరునిదొక ప్రత్యేక భణితి :

ఉ. లాలిత యౌవనోజ్జ్వల విలాసములందులకించి, సుందరా
లీల విచేష్టితంబమర, భీమ మనోభవ సింహరేఖమై
వాలవె యింక నీ వెలమి వామ విలోచన లంగజన్మ లీ
లాలసలై, విపక్షులు భయాలసులై ధృతి యేది చూడగన్

—ఆ. 7-345

కుంతీదేవి కర్ణుని మందసములో పెట్టి అశ్వనదీ ప్రవాహమున విడిచిపెట్టి నప్పుడు రోదనము చేయుచు పలికిన మాటలివి. ఈ పద్యమునకు ముందటి దగు సీసపద్యమున ఆమె గుండెలు బాదుకొనుచు రోదించిన తీరును చూడగా ఎట్టిన ఎంత కఠోర చేతస్కుడైనా అనిపించును. అంత దుఃఖములో గూడ ఆమెకొక్క క్షణమొక మధురమైన ఊహ జనించినది. ఆ ఊహాచిత్రమే యీ పద్యము.

ఈ శిశువు పెరిగి పెద్దవాడై యువకుడైన రూపము నూహించినది. ఆ వయసులో నొకవైపున యౌవనోజ్జ్వల విలాస రేఖలతో నవమన్మథుడై యువతీ లలామలను ఆకర్షించునట! మఱొక వైపున వీరకేళీ విలాసములతో భయం కరుడై శత్రువులను కర్షించునట! వామ విలోచనలు అంగజన్మ లీలాలసలై ధృతియేది చూడగా వారిపై నీతడు వాలునట! విపక్షులు భయాలసులై ధృతి యేది చూడగా వారిపై వాలునట! ఈ రెండు దృశ్యములను ఒక్కసారి ఊహించుకొని మురిసిపోవుచున్నదా మాతృహృదయము!

అంత పెద్ద దుఃఖమునకు కూడ ఒక్క క్షణము కళ్లెము వేసి, మధుర మైన ఊహాలోకమునకు మళ్లించి, తేలియాడించి మరుక్షణమే మఱల దుఃఖమున బడవైచి రసపరీవాహ తరంగిమలను తరళిత మొనర్పగల రసశిల్పి ఎట్టి నార్యుడు! ఆ పదముల పొందిక, భావవీచికలు, రసశీకరములు, హృద్యపద్య గతి, ఆకట్టుబడి- ఈ సర్వము సూక్తివైచిత్రికి తార్కాణ. ప్రత్యేకించి చెప్ప వలయునన్న "ధృతి యేది చూడగన్" అనుట గొప్ప ఉక్తి వైచిత్రి!

పరిక్షితుడు సుశోభన యను కన్యను చూసి మోహితుడై ఆమె నిట్లు ప్రశ్నించి సమాధానమును పొందిన విధమిట్లున్నది:

ఉ॥ ఎవ్వరి దానవంబుజ దళేక్షణ! యేకతమిట్టు లేల నీ
వివ్వన భూమియందుఁ జరియించెదు? నావుడుఁదండ్రి పంపునం
దివ్వన భూమియందుఁ జరియించెద నవ్వరు గోరి; కన్య నే
నెవ్వరి దాన గావలయు? నేర్పడఁజెప్పుము రాజనందనా!

—ఆ 4-324

వ॥ అనిన దాని ప్రగల్భవచనంబులకు నధిక విలోలుండై భూపాలుండు తన యభిలాషంబెఱింగించిన నమ్మగువ........ నిన్ను వరియించెద ననెను

రసములు, భావములు వ్యంగ్యములుగానే యుండవలయును గాని వాచ్యములు కారాదు. అట్లయిన నందలి చమత్కారము సన్నగిల్లును. వాచ్యకత్వలో రసభావములను చమత్కరించుట కవియొక్క ఘటనాఘటన సామర్థ్యమును తెలుపును. ఇట్టి సామర్థ్యము ప్రబంధ పరమేశ్వరునిలో గలదు. దానికి పద్యమే ప్రధానమగు నుదాహరణము.

ఇందు నాయిక రసానుగుణమైన హావభావముల ప్రదర్శన గాని త్రపా భరితమైన దృక్కులు గాని లేకయే, నేను సద్వరుగోరు కన్యను, నేనెవ్వరి దాన గావలయు నేర్పడ చెప్పుము రాజనందనా! అని జవాబు చెప్పినది. ఇట్లు ప్రశ్న ముఖముగా నేను నీ దానను అని పల్కినది. ఇట్టి ప్రగల్భమైన వాక్కే నాయకుని యెక్కువగ నాకర్షించినది. ఇట్లు వాక్యార్థ శక్తితో రసస్ఫురణము నిర్వహించిన కవి ప్రబంధ పరమేశ్వరుడొక్కడే కనబడుచున్నాడు!

రసనిర్వహణమున ఎఱ్ఱనార్యుని యొక్క యిట్టి అద్వితీయమైన ప్రతిభను కనిపెట్టి వెల్లడించిన మహనీయులు శ్రీ కోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు[1] వారి యభిప్రాయమును మాత్రమే గాక, భాషను, సమన్వయ విధానమును గూడ స్వీకరించి యిట ప్రస్తుతించితిని. వ్యంగ్యరీతిలో రసస్ఫురణ మెట్లుండునో పోల్చి చూపుటకు వారు ఆదిపర్వములో శంతన మహారాజు సత్యవతిని మొట్టమొదట పలకరించిన సందర్భములోని "ఎందలి దానవంబుజ దళేక్షణ!" అను పద్యమును కూడ నుదాహరించి సమన్వయించి చూపిరి. విస్తరభీతిచే నేనా భాగమును విడిచిపెట్టి అక్కఱపడు మేఱకు నిది గ్రహించితిని.

## ధ్వని వైచిత్రి :

కావ్యమునకు ఆత్మ ధ్వనియని ఆలంకారికుల నిర్ణయము. వాచ్యార్థముకంటె భిన్నమయిన, రమణీయమైన అర్థాంతర స్ఫురణమే ధ్వని. ఇది సహృదయుల చిత్త పరిపాకమును బట్టి పలు విధముల రేకులు విప్పుచుండును. ఎఱ్ఱన కవితలో నటనట ఈ ధ్వని పురివిప్పిన పట్టులు గలవు.

1. నెల్లూరులో జరిగిన "ఎఱ్ఱన జయంతి" 1967, ఏప్రిల్ 22, శ్రీ కోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారి ఉపన్యాసము నుండి.

గంధర్వ వీరులచేత బంధితుడయిన దుర్యోధనుని విడిపించిన పిమ్మట ధర్మరాజు అతనికి హితవు చెప్పను :

ఉ॥ ఎన్నడు నిట్టి సాహసము లింక నొనర్పకు మయ్య దుర్జనుం
దన్నన సాహస క్రియల యందుఁగడంగి నశించుఁగావునం
గన్నన తమ్ములన్ దొరలఁగైకొని యిమ్ములఁబొమ్ము వీటికిన్
సన్నుత ! దీనికిం గొఱక విషాదముఁబొందకుమీ మనంబునన్

—అ. 5-484

దుర్యోధనుడు స్వాభిమాని. అంతకంటె దురభిమాని యనుట బాగు. అప్పుడు దెబ్బతిన్న పులి. తానెవరిని యవమానించుటకు వచ్చెనో వారి దయకు పాత్రుడు కావలసి వచ్చిన దుస్థితి యాతనిది. అట్టివానిని యెంత మెత్తగ చివాట్లు వేయుటకు వీలున్నదో అంత మెత్తగ చీవాట్లు పెట్టుచున్నాడు ధర్మరాజు. మొదట "సన్నుత !" అని సంబోధించినాడు. దీనికినిట నర్థమే మారిపోయినది. "దుర్జనుండన్నన సాహస క్రియలయందు గడంగి నశించు" అని ఎవరినో గూర్చి సామాన్య రీతిగా చెప్పిన దీని అర్థము దుర్యోధనుడు దుర్జనుడనుటయే గదా ! పిమ్మట "ఇమ్ముల బొమ్ము వీటికిన్" నాయనా ఇక చాలించి ఊరికి వెళ్లి పొమ్ము; అనుట ఇక నిక్కడ నీ పప్పులుడకవు: మీ ఊరిలో సాగునేమో గాని అన్న యెత్తిపొడుపు. "దీని కొంగొఱక విషాదము బొందకుమీ మనంబునన్" అని ఇంత తిట్టి చిమ్మిలి పెట్టుటయే గదా! ఇచ్చట దుర్యోధనుని యవస్థ యేమన అత్త కొట్టినందుకు గాదు; తోడికోడలు నవ్వినందుకు అన్నట్లు గంధర్వులు బంధించినందుకు గాదు; పాండవులు విడిపించినందుల కాతనికి తలవంపులైనది. ఇట్టి స్థితిలో నాతనిని సుతిమెత్తని మాటలతో కుళ్లబొడుచుట ధర్మరాజు యొక్క గడుగ్గాయి తనమును సూచించుచున్నది. ఇట్లు ధర్మరాజు వాడిన ప్రతి మాటకు వేఱొక యర్థము స్ఫురించుచునే యున్నది. పాత్రల మనస్తత్త్వమును బట్టి రచన చేయగల్గుట మహాకవి లక్షణము. ఎఱ్ఱన అట్టివాడు !

మహర్షులందరు ఇంద్రపదవి నధిష్ఠింపుమని కుమారస్వామిని కోరిరి. ఇంద్ర పదవి నుండు వారికెయ్యది కరణీయంబని కుమారుడు వారినడిగెను. వారు వివరించిరి అప్పుడింద్రు డిట్లనియె :

చ॥ అనునెడ నింద్రుడిట్లనియె నట్లయినం గడులెస్స; దేవ ! నీ
వనిమిష నాయకత్వమున యందభిషిక్తుడవై ముదంబుతో
ననుఁబని గొమ్ము నీదు కరుణన్ దొసగెల్లను దీఱి యుండెదన్
ఘనతర శౌర్యసారుడవు గావున నర్హుడ వింద్ర లక్ష్మికిన్
—ఆ. 5-226

ఇది యింద్రుడు ఇరకాటమున బడిన సన్నివేశము. పదవి వదలుకొనుట ఇష్టములేదు. వదలక తప్పదేమో అన్న పరిస్థితి దాపురించినది. దీనిని అధిగమించుట కాతడు చేసిన చమత్కారమేమన- ఋషులు ఇంద్రుని కర్తవ్యము లెవ్వియో చెప్పిన వెంటనే కుమారుడు మఱి మాటలాడుటకు వీలులేకుండ తనంతట తానే పదవిని వదలుకొనుటకు సిద్ధపడుట ! "అట్లయినన్ కడు లెస్స" అనుట వలన నీవు ఇంద్ర పదవిని చేపట్టుటకు సిద్ధపడుచున్నట్లున్నది. అయితే సరే, అను భావము వ్యక్తమగుచున్నది. ఇది యింద్రుడు ఇష్టము లేకుండ మాటలాడుచున్నట్లుండి యాతని మనోవ్యథను సూచించుచున్నది. 'నీదు కరుణన్ దొసగెల్లను తీఱియుండెదన్" అను మాట చాల కీలకమైనది. పదవి యందుండి నేను దోషము లాచరించిన వాడనైతిని, ఇప్పుడు వైదొలగి ఏ దోషములు చేయని వాడనగుదును, అనుట వలన నీవిప్పుడు పదవి నధిష్ఠించి దోషములు చేయక ఎట్టి నిర్వాకము చేసెదవో చూచెదగాక అన్న గూఢమైన సవాలు వ్యక్తమగుచున్నది. నీవు నాకంటె శౌర్యవంతుడవు కావున ఈ పదవికి నీవే తగుదువనుట పైపఱామరికయే గాని యాంతర్యమున నాతని అయిష్టతనే సూచించుచున్నది.

ఇంద్రుని యొక్క యీ మాటలను విన్న పిమ్మట "కుమారుండు నవ్వుచు ఇట్లనియె" (వచనం - 227). ఈ నవ్వు దేనిని సూచించుచున్నదనగా తాను ఇంద్రుని యొక్క అసలాంతర్యమును పసిగట్టితిని అను భావమును సూచించుచున్నది ! అసలిక్కడొక చమత్కారమున్నది; ఇంద్రుడు గనుక నేను పదవి నుండి దిగను; అని చెప్పియుండినచో కుమారునికి పట్టుదల పెరిగి పదవిని గుంజుకొనుటకు ప్రయత్నించును. అట్లుగాక పదవిని తానే వదలుకొనుటకు సిద్ధపడుచున్నాడు గనుక దానిపై కుమారునకు ఆకర్షణ లేదు- ఇది మానవ మనస్తత్త్వము. ఈ సర్వము ఇచ్చట 'ధ్వని' యగుచున్నది. ఈ పద్యమునిట్లు వ్రాయుట ఎఱ్ఱనార్యుని లోకజ్ఞతకు తార్కాణ !

## భావోక్తి వైచిత్రి :

6. ఎఱ్ఱనార్యుడు నిర్వహించిన సత్యాద్రౌపదీ సంవాద ఘట్టము కడు

రమ్యమైనది. ఏకాంతమునందు ఇరువురు స్త్రీలు తీరికగా కూర్చొని ముచ్చటలు చెప్పుకొను తీరెట్టుండునో కావ్య ముఖమున తెలిసికొనవలెనన్న యీ ఘట్టమును చదివి తీరవలసినదే! నీ భర్తలు నీ యదుపాజ్ఞలలో నుండుటకు నీవేమి వశీకరణ మంత్రమును వేసితివు? అని సత్య, ద్రౌపదని యడుగగా నామె ఇట్లనును:

చ॥ అలయక మంత్ర తంత్ర వివిధౌషధ భంగులఁజేసి యెంతయున్
వలతురు నాథులంట మగువా! కడు బేలతనంబు; దాన మున్
గలిగిన ప్రేమయుం బొలియుఁగాని యొకండును సిద్ధిఁబొంద ద
వ్వాలతుకతోడి మన్కి యహిపొత్తుగఁజూచు విభుండెఱింగినన్
—ఆ. 5-295

ఇందు రెండవ పాదమునందలి "మగువా!" అన్న సంబోధనాప్లుతము స్వరితమై కాకువును పట్టి గుంజుట రమ్యముగ నున్నది. పద్యమంతయు కమ్మని తలుగు నుడికారపు సొంపుతో ఉక్తివైచిత్రిని స్ఫురింపించుచున్నది.

సత్యవంతుడెట్టివాడైనను అతనిని దప్ప మఱియొకరిని వరింపనొల్లనని సావిత్రి చెప్పగా నశ్వపతి నారదుని దెస చూచుటయు నతడట్లనియె:

చ॥ గొనముల ప్రోక నీయనుఁగుఁగూతురు; దీని తలంపు మాన్పగా
మనకు నశక్య మింక ననుమానము లేల? నరేంద్ర! కూతుఁ జ
య్యన నృప సూతికిమ్ము; కమలానన చేసిన పుణ్య గౌరవం
బున నయినం బ్రియుండు పరిపూర్ణ చిరాయు రుపేతుఁడయ్యెడున్
—ఆ. 7-185

ఇందు చివరి రెండు పాదములందును చక్కని ఉక్తివైచిత్రి కుదురుకొన్నది. "కమలానన చేసిన పుణ్యగౌరవంబున నయినన్" అనుట మఱింత మధురమైన ఉక్తివైచిత్రి. ఆమె పుణ్యగౌరవము వలన సత్యవంతుడు పరిపూర్ణ చిరాయురుపేతుడగును. సావిత్రియు పరిపూర్ణ చిరాయురుపేతయై, దీర్ఘ సుమంగళియై తాను తరించి లోకముల కెల్ల నాదర్శ నారీమతల్లియై వెలుగొందును అన్న మంగళాశాసనము ఇట పరమ పవిత్రము. రమణీయము నైన భావము!

ఇది ప్రబంధ పరమేశ్వరుని సూక్తివైచిత్రి యొక్క రేఖామాత్ర చిత్రణ!

# చంపూ శిల్పవైచిత్రి

"గద్యపద్యాత్మకం కావ్యం చంపూరిత్యభిధీయతే"

శ్లో॥ గద్యానుబంధ రసమిశ్రిత పద్యసూక్తిః
హృద్యాహి వాద్యకలయా కలితేవ గీతిః
తస్మాద్దధాతు కవిమార్గ జుషాం సుఖాయ
చంపూ ప్రబంధ రచనాం రసనా మదీయా

—చంపూ రామాయణము, బాలకాండ-3

గద్యముతో కూడిన రసమిశ్రితమైన పద్యసూక్తి వాద్యకళతో నొప్పు గానవిద్య వలె హృద్యముగా నుండును! కావున కవితా రసాభిజ్ఞుల ఆనందము కొఱకు నా నాలుక చంపూ ప్రబంధరచనకు దొరకొనుగాక - అని భోజుడు చంపూ ప్రబంధ ప్రక్రియా ప్రాశస్త్యమును ఉగ్గడించినాడు.

నన్నయ భట్టారకుడు ఇట్టి చంపూ ప్రబంధ రచనా ప్రక్రియ తెలుగు భాషా స్వభావమునకు చక్కగా నప్పునని భావించి ఆంధ్ర మహాభారతమును గద్య పద్యాత్మకముగ సంతరించినాడు. నన్నయ ప్రారంభించిన యీ పద్ధతికి భిన్నముగ తిక్కన తొలుత నిర్వచనోత్తర రామాయణమును రచించి మలుత నన్నయ మార్గమే సరియైనదని భావించి "గద్యముల పద్యములన్ రచియించెదం గృతుల్" (విరాటము, అవతారిక-30) అని కంఠోక్తిగా ప్రకటించి తన భారతమును గద్య పద్యాత్మకముగ వ్రాసినాడు. "నన్నయభట్ట తిక్కకవినాథులు చూపిన త్రోవ పావనంబు" అని నమ్మిన యెఱ్ఱన తన ప్రబంధములన్నియు చంపూ మార్గముననే రచించి యీ మార్గమున కొక వన్నెయు వాసియు చేకూర్చి నాడు. అనంతర కవులకి కవిత్రయ మార్గమే శిరోధార్యమైనది.

సంస్కృతమున రామాయణ చంపువు; భారత చంపువు వంటి ఒకటి రెండు దక్క తక్కిన చంపువులన్నియు మూలబడినవి. ఆ భాషలో ఈ ప్రక్రియ విఫలమైనదని చెప్పవచ్చును. తెలుగులో సఫలమగుటకు ఈ భాషాతత్త్వమే కారణమని భావింపవలయును.

సంస్కృత చంపువులలో గద్యములు కొన్ని, పద్యములు మెండు. అదే పద్ధతి తెలుగు కావ్యములలో కూడ పాటింపబడినది. సంస్కృత చంపువులలో వరుసగా నొకటికంటె నెక్కువ పద్యములున్నట్టు, అటనట వరుసగా నొకటి కంటె నెక్కువ గద్యములు కూడ నుండును. ఆ పద్ధతి తెలుగు కావ్యములలో పరిహరింపబడినది. ఇది సంస్కృత చంపూ ప్రక్రియ మీద తెలుగు చంపూ ప్రక్రియ యొక్క క్రమపరిణతిని సూచించుచున్నది.

ఎఱ్ఱన గద్య పద్యములు వాద్యకలాకలితములైన గీతికల వలె హృద్యములుగా నుండును. వాలి వధానంతరము రాముడు సుగ్రీవునకు పట్టము గట్టును. ఆ పిమ్మట నెఱ్ఱన వ్రాసిన గద్యపద్యములివి :

వ॥ ఆ వనచరుండును రామునకు గృతాంజలియై "దేవా! యీ వర్ష సమయశేషంబును, ఘన సమయంబునుం గడపి మఱి సీతాన్వేషణంబునకు నుత్సహించుట లెస్స" యని యయ్యిర్వురకును మాల్యవత్కూటంబున నివాసంబు గావించి తానును గిష్కింధాపురంబున నుండెనంత, (అ. ౬-౪౮౭).

మ॥ ఉరుఘర్మౌఘ విఘాత సంవిహిత విశ్వోల్లాసమై సంచల
త్సరసాంభోద నినాద దూర్యరవమై, చంచత్బలాకాగరు
త్పర లీలా నవచామర స్ఫురణమై పర్జన్య సామ్రాజ్యమొ
ప్పె రమామందిరమై యుదగ్ర శిఖిసీ పింఛాత పత్రంబులన్
—౪౭౭

సీ॥ ఆ సమయంబున నక్కడ —౪౮౯

ఇట్టి పట్టములను చదివినప్పుడు ఎఱ్ఱన నాదబ్రహ్మోపాసన చతురుడైన వాగ్గేయకారుని వలె స్ఫురించును. తెలుగు కవులు కట్టు సంస్కృత సమాసముల సౌందర్యము సాక్షాత్కరించును !

అరణ్యపర్వశేషమున ఎఱ్ఱన రచించిన గద్యపద్యముల సంఖ్య మొత్తము ౧౫౭౫. వీనిలో గద్యములు ౪౭౬, పద్యములు ౧౦౯౯. ఈ గద్యపద్యములను ప్రతిపాద్య విషయమున కనుగుణముగ ఒక వరుసలో నమర్చి వ్రాయుటలో నితడు పాటించిన శిల్పము ప్రధానముగ నాలు విధములుగ నున్నది :

1. వరుసగా కొన్ని పద్యములను వ్రాసిన పిమ్మట నొక గద్యమును వ్రాసి మఱల కొన్ని పద్యములను వ్రాయుట.
2. వరుసగా కొన్ని పద్యములను వ్రాసిన పిమ్మట నొక గద్యమును వ్రాసి మఱల ఒక పద్యమును మాత్రము వ్రాయుట
3. మొదటనొక పద్యమును వ్రాసి పిమ్మట నొక గద్యమును వ్రాసి మఱల వరుసగా కొన్ని పద్యములను వ్రాయుట.
4. రెండు గద్యములనడుమ నొక పద్యమును బిగించుట.
5. రెండు పద్యముల నడుమ నొక గద్యమును బిగించుట.
6. గద్యపద్యములను ఒకటి వెంట నొకటిగ దొంతరలు కట్టుట.

ఈ ఆఱు విధముల శిల్పములలో నెటచూచినను ఏదో ఒక వైచిత్రి గోచరించును. రెండు ఉదాహరణములను చూతము :

1. వ॥ ఇట్లు వికలేంద్రియుండై వైశ్వానరుండమ్మునిపత్నుల యందు దగిలిన డెందంబు మగిడింప నేరక వారలం గదియ నప్పళించి గార్హపత్య కుండంబునం దావేశించి : —అ. 5-196

చ॥ అతివలు దన్ను జేరుటకు నాసపడుం బొరిఁజేరుచోట నా
యత విలసచ్ఛిఖాగ్రముల నల్లన వారలనంటుఁ గౌతుకం
బతిశయమై తదంగలత లాదటఁగౌగిటఁజేర్చఁగోరుఁ గం
పిత ధృతియై కలంగుఁగడుఁబెల్లగు రాగరసంబు ముంపగాన్
—అ. 5-197

వ॥ అంతనమ్మునీంద్రుల హోమ విధి సమాప్తంబగుటయు జాతవేదుండు మదన వేదనాభరంబు సహింపనోపక నిర్జనంబైన వనంబునకుం జని మునిపత్నీ సమాగమంబు దుర్లభంబుగా వగచి వెగడంది శరీరంబు దిగవిడువ సమకట్టు నెడ దదీయ వల్లభయైన స్వాహాదేవి తత్ప్రకారంబంతయు నెఱింగి యతనికిం బ్రియంబు సేయునదియై సప్తమునులలో నంగిరసు భార్య శివ యను దాని రూపంబు గైకొని చని యేకతంబ యున్న హుతాశనుం గనుంగొని యిట్లనియె. —అ. 5-198

ఈ పద్యమున గార్హపత్యకుండమును, అందు తన శృంగార చేష్టలను చూపుచున్న అగ్నిదేవుని రూపమును ఊహింపవచ్చును పద్యమునకు చుట్టును ఉన్న గద్య వలయమునందు ప్రదక్షిణలు చేయుచున్న మునిపత్నుల వలయే

మును భావింపవచ్చును. రెండు గద్యముల నడుమ నొక పద్యమును బిగించి ఎఱ్ఱన చేసిన శిల్పవైచిత్రి యిది !

2. క॥ ఆకులముగ శైబ్యుల ని
ఙ్వాకుల సైంధవులను ద్రిగర్తులనుం బో
నీక పొదివి రయమున న
స్తోక పరాక్రమము దునిమి తూటాడె వడిన్
—ఆ. 6-284

వ॥ అప్పుడు రణభూమి యంతయు శవమయంబయ్యె నంబరంబం తయు గబంధమయంబయ్యె జారు కేయూర వీరాంక విభూషితంబులైన బాహు చరణచ్ఛేదంబులును, గార్ముక తూణీరకాండ ఖండంబులు, నక్ష కూబర రథాంగ కేతన త్రివేణుక శకలంబులును, బుండరీక వ్యజనచామర భంగంబులుం గలవార పరిఘ శక్తి గదా ముసల పట్టిస ప్రాసవేశంబులు నక్కడజూచిన రాసులైయుండె గీలాల పూరంబును, మాంస పంకంబును, గేశ శైవాలంబునునైన యపూర్వ నదీ ప్రవాహంబునందు బహువిధ క్రవ్యాదగణంబు లవగాహంబు సేయుచు ప్రకట కోలాహల వ్యాకులంబగుచుండె; నవ్విధంబున. —285

క॥ గాండివ పవన ప్రేరిత
చండాంబక ఘోర శిఖల శతమఖతనయో
ద్దండ దహనుండొక మాత్రన
ఖండిత సౌవీర సైన్యకానన మేర్చెన్ —286

ఇది యర్జునుడు సైంధవ సైన్యమును తుత్తునియలు చేయు ఘట్టము. ఈ రెండు కంద పద్యములందును వర్ణింపబడిన వాడు అర్జునుడు. ఈ పద్యముల నిట్లు కందములలో వ్రాసి మధ్యలో నొక గద్యమును బిగించుటలో నున్నది ఎఱ్ఱనగారి చంపూ శిల్పవైచిత్రి ! ఈ గద్యమున వర్ణింపబడిన రణరంగమున ప్రవహించుచున్న శత్రువుల రక్తనదికి ఈ కందములు రెండును ఒడ్డుల వలె నున్నవని స్ఫురింపజేయుట మహాకవి చంపూశిల్ప వైచిత్రికి పరాకాష్ఠ !

ఇట్లే తక్కిన శిల్ప విధములను గూర్చి నరయవలెను.

# అనుక్రమణిక

# అనువాద కళాశిల్పము

జననుత! కృష్ణద్వైపా
యన ముని వృషభాభిహిత మహాభారత బ
ద్ధ నిరూపితార్థ మేర్పడ
దెనుఁగున రచియింపు మధిక ధీయుక్తిమెయిన్

—ఆదిపర్వము, అవతారిక, పద్యము-16

రాజరాజు తనతో పలికినట్లు నన్నయ చెప్పిన యీ పద్యము నన్నయగారి భారతాంధ్రీకరణ విధానమును గూర్చి సూచించుచున్నది. రాజరాజుగానీ, నన్నయ గాని భావించినది వ్యాస భారతబద్ధ నిరూపితార్థ మేర్పడునట్లు తెనుఁగున రచియింపవలయుననియే గాని మక్కికి మక్కి యనువాదమును గాదు. వ్యాస భారతమున కావ్యకళా దృష్టికంటె పౌరాణిక నైతిక దృష్టి యెక్కువ. సంస్కృతమున కాళిదాసుతో మాత్రమే కావ్యశైలి యేర్పాటయినది. తెలుగులో నన్నయగారి దగ్గఱ నుండి కావ్యశైలియే. "ఇక్కావ్యంబు రచియించెద" (అవతారిక, వచనము-20) అని నన్నయ చెప్పిన మాట అతనికి గల కావ్యకళా దృష్టిని ప్రకటించుచున్నది. తదనుగుణముగ నాతడు తన భారత భాగమును కేవల అనువాదప్రాయముగ గాక నొక స్వతంత్రమగు కావ్యమా! అన్నట్లు తెలుగున సంతరించినాడనుట సిద్ధాంతము

నన్నయతో ప్రారంభమైన యీ కావ్యకళాదృష్టి తిక్కన నాటికి మఱికొంత పండి పక్వమైనది. "అమ్మహాకావ్యంబు నర్థంబు సంగతంబు సేసెద" (విరాట పర్వము, అవతారిక, వచనము-37) అన్న తిక్కనగారి వాక్యములోని "అర్థము" "కావ్యము" అను మాటలు నన్నయగారి "మహాభారత బద్ధ నిరూపితార్థము" అను వాక్యములోని అర్థశబ్దమునకు. "ఇక్కావ్యంబు రచియించెద" అను దాని లోని కావ్యశబ్దమునకు ప్రతిధ్వనులే యగుచున్నవి. కాగా అనువాద విధానమున తిక్కన నన్నయ మార్గమునే చేపట్టినాడనుట సమంజసము.

ఎఱ్ఱన నాటికి యీ కావ్యకళా స్పృహ మఱింత తహతహలాడినది.

"నన్నయభట్ట తిక్కకవినాథులు చూపిన త్రోవ పావనంబు" (హరివంశావతారిక, పద్యము-42) అని త్రికరణశుద్ధిగ నమ్మిన ఘ్రాతని యందు కూడ నన్నయ తిక్కనల ధ్వని ప్రతిధ్వనులే మార్మోగుట అబ్బురము కాదు! "వ్యాసముని ప్రణీత పరమార్థము తెల్లఁగ జేసినట్టి యజ్ఞాసన కల్పులందఱకు నాద్యుల నన్నయ తిక్క నార్యులన్" (నృసింహ పురాణము, అవతారిక-9) "ప్రౌఢాంచిత శబ్దసారులు మహాకవులాద్యులు కావ్యశయ్య గిలించిన" (నృసింహ పురాణము-అవతారిక 14). ఇచ్చట 'పరమార్థము' "కావ్యశయ్య" అను ప్రయోగములు గమనార్హములు.

## కవిత్రయము వారి యనువాద పద్ధతి :

ఇట్లు ఒకరి వెంట నొకరుగ, చక్కని క్రమశిక్షణతో నడచిన కవిత్రయము వారి భారతాంధ్రీకరణ విధానములో నొక విధమగు నేకాత్మకత సాక్షాత్కరించును. వ్యాసముని ప్రణీత పరమార్థమును తెల్లము చేయుటకును, దీనిని కావ్యముగ రచించుటకును నన్నయ "అధిక ధీయుక్తి మెయిన్" కని పెట్టిన, అనువాద విధానము నందలి ప్రధాన మౌలికాంశము లివి: 1. మూల ప్రపంచనము, 2. మూలకుంచనము, 3. అన్యధా ప్రకల్పనము, 4. మూల త్యాగము, 5. అమూలకములు, 6. యథామూలము - అన్నవి. తక్కిన యిర్వురను వీనినే పాటించిరి. ఇందుమూలమున బంగారపు ముద్దగ పరిగణింపబడు వ్యాసభారతము కవిత్రయము వారి చేతిలో అందమగు నాభరణముగ రూపుదిద్దు కొన్నదనుటలో విప్రతిపత్తి లేదు.

కవిత్రయము వారి యనువాద పద్ధతికి ప్రధాన ప్రాతిపదిక ఒక్కటిగనే ఉన్నను ఈ ఆరు మౌలిక సూత్రములను పాటించుటలో ముప్వురి యందును కొంత తరతమ భేదము కాన్పించును. ఎఱ్ఱన అనువాదము తక్కిన యిరువురి దానికంటె మూలమునకు సన్నిహితతరముగా గోచరించునని విమర్శకులు నిర్ణయించిరి. ఈ విషయమును వివిధ దృక్పథములతో దిజ్మాత్రముగ పరామర్శించుట ప్రస్తుతాంశము. తొలుత గమనింపవలసిన ముఖ్య విషయము మూలానువాద గ్రంథముల పరిమాణ తారతమ్యము.

## అరణ్యపర్వ మూలానువాద గ్రంథ పరిమాణ తారతమ్యము :

వ్యాస భారతమున అరణ్యపర్వములో గల మొత్తము శ్లోకముల సంఖ్య

సుమారు 13700. ఇందులో నన్నయ 7000 శ్లోకములను 1800 గద్య పద్య ములలో ననువదించెను. వీనిలో గద్యములు 520. ఎఱ్ఱన తక్కిన 6700 శ్లోక ములను 1595 గద్యపద్యములలో ననువదించెను. వీనిలో గద్యములు 495. మూలమునందలి అనుష్టుప్ శ్లోకములకును, తెలుగునందలి గద్యపద్యములకును పరిమాణములో ఎక్కువ వ్యత్యాసముండుట వలన అసలు మొత్తము మూలము తెలుగులో కొంచెమించుమించుగా సగమైనదని భావింపవలయును స్థూలదృష్టికి నన్నయ రచిత భాగముకంటె ఎఱ్ఱన రచితభాగము మూలము కన్న కొంచె మెక్కువగా కాన్పించుచున్నను ఎఱ్ఱన గద్యముల కంటె నన్నయ గద్యములధి కముగా నుండుటను బట్టి యీ వ్యత్యాసము సర్దుబాటు కాగలదని భావించిన పక్షమున ఇరువురి భాగములు మూలమునకు సగముగనే యున్నవను నిర్ధారణకు రాగలము. గద్యభేదముతో కలుపుకొని యెఱ్ఱన వాడిన ఛందోభేదముల సంఖ్య 21. వివరములివి :

| | | | |
|---|---|---|---|
| కందము | 418 | తరువోజ | 2 |
| చంపకమాల | 185 | ఉత్సాహము | 2 |
| ఉత్పలమాల | 126 | స్రగ్ధర | 2 |
| తేటగీతి | 109 | మహాస్రగ్ధర | 2 |
| సీసము | 102 | మధురాక్కఱ | 2 |
| ఆటవెలది | 91 | మాలిని | 1 |
| మత్తేభము | 69 | వనమయూరము | 1 |
| శార్దూలము | 18 | లయగ్రాహి | 1 |
| మత్తకోకిల | 18 | మధ్యాక్కఱ | 1 |
| తరలము | 8 | స్రగ్విణి | 1 |

ఇందు కందము, తేటగీతి, సీసము, ఆటవెలది, తరువోజ, మధురాక్కఱ మధ్యాక్కఱలు దేశిచ్ఛందములు. ఈ పద్యములన్నియు కలిపి 720, తక్కినవి మార్గఛందములు; ఇవి 379. దీనినిబట్టి ఎఱ్ఱన సాధ్యమైనంత మేఱకు సర్వ విధముల అనువాద విధానమున దేశవాళీ తనమును తెచ్చుటకు ప్రయత్నించి నాడని తోచును. భాషా విషయమున, నన్నయ తిక్కనలకు వ్యతిరిక్తముగ సంస్కృతాంధ్ర పదములను సమానముగ పోషించి రచనలో నొక

సంతులనము తెచ్చినాడనుటయు నిక్కము. ఇవన్నియు నీతని యనువాద వివేచన మున గుర్తింపవలసిన ముఖ్యాంశములై యున్నవి.

## ఎఱ్ఱన అనువాద భణితి :

పాండవ హితార్థియైన శ్రీకృష్ణుడు మార్కండేయ మహర్షితో చెప్పిన ఈ పద్యము ఎఱ్ఱన కవితారీతిని వ్యక్తీకరించుచున్నదని భావింపవచ్చును :

> ఏనును, బాండునందనులు, నిమ్ముని ముఖ్యులు నిష్ఠ లోక స
> మ్మానిత వాక్య! నీదయిన మంజుల వాగమృత ప్రవాహమున్
> వీనుల దోయి నించుచును వేడుకఁ గ్రోలి కొనంగ నాత్మలం
> బూనెద మస్మదీప్సితము పూర్ణము సేయగ నర్హమెమ్మెయిన్
>
> —ఆ. 4 - పద్యం 166

దీనికి మూలము :

> శుశ్రూషవః పాండవాస్తే బ్రాహ్మణాశ్చ సమాగతాః
> ద్రౌపదీ సత్యభామా చ తథాఽహం పరమం వచః

అనువాదము నందలి మొదటి పాదమునకు మాత్రమే మూలమున నాధారము గలదు. తక్కిన మూడు పాదములు పూర్తిగా నమూలకములే. గ్రంథము యొక్క ప్రారంభమునందే, సరియైన తావున, చిక్కిన యవకాశమును చక్కగా నుపయోగించుకొని యీ పద్యమునిట్లు పెంచి వ్రాయుటలో గల ఎఱ్ఱనగారి యాంతర్యమును ఇట్టే పసిగట్టవచ్చును. "మంజుల వాగమృత ప్రవాహము" అన్న వాక్యము అతని మధుర రచనాప్రవాహమునకు సంకేతము. "వీనుల దోయి నించుచును వేడుకఁ గ్రోలి కొనంగ నాత్మలం బూనెదము" అన్న మాట "కవీంద్ర కర్ణపుటపేయముగాన్" అను వాక్యమును స్ఫురింపించును. "అస్మదీప్సితము పూర్ణము సేయగనర్హము" అనునది "సాధుజన హర్షసిద్ధిగోరి" అను వాక్యమును స్మరణకు తెచ్చును. ఎఱ్ఱన గుండె ఎంత లోతైనదో చెప్పతరము గాదు! ఇట్లు ప్రారంభమున కృష్ణునిచేత ధ్వనిప్రాయముగ చెప్పించిన విషయమునే గ్రంథాంతమున వాచ్యముగ ప్రకటించినాడు! అరణ్యపర్వ శేష రచనతో చిరంజీవిత్వమును సాధించిన యెఱ్ఱన మార్కండేయునకు సాటివచ్చు వాడు. అతనిలో తాను లీనమై యిందలి కథలను పాండవులకు రమ్యముగ వినిపించి

నాదని చమత్కరించినచో నందతిశయోక్తి లేదు. ఈవేఱకు నీతని యనువాద విధానమనుడు, రచనా సరళియనుడు సంపూర్ణముగ సఫలమైనదనుట నిక్కము.

## 1. మూల ప్రపంచనము :

1. పాండవులు కామ్యక వనమునందున్న సమయమున వారిని చూచుటకు సత్యభామా సమేతుడై శ్రీకృష్ణుడు వచ్చిన సందర్భమున మూలము నందిట్లున్నది :-

> శైబ్య సుగ్రీవ యుక్తేన రథేన రథినాం వరః
> మఘ వానివ పౌలోమ్యా సహితః సత్యభామయా
> ఉపాయాద్ దేవకీపుత్రో దిదృక్షుః కురుసత్తమాన్
>
> త్ర్యశీత్యధిక శతతమోఽధ్యాయము - శ్లో. 7

ఎఱ్ఱనగారి యనువాదము :-

> శైబ్య సుగ్రీవాది జవనాశ్వ యుక్తమై
> యాబద్ధ నూత్న రత్నాంశు పటల
> భాసితంబై చారుపతగ పతాకా వి
> భూషిత గగనమై పొలుపు మిగులు
> దివ్య రథంబున దేవకీ సుతుఁడు ప్రి
> యంబున సత్యభామాన్వితముగఁ
> దరళ సౌదామినీ దామ సముజ్జ్వల
> ధారాధరోత్సంగతలమునందు
> శశియుఁదాను వెలుఁగు శతమన్యుఁడును బోలె
> నరుగుదెంచె ఘన రథాంగనేమి
> విపుల ఘోష తాండవిత బర్హి శబ్ద శ
> బ్దాయమాన వన విభాగుఁడగుచు —4-152

మూలమున మూడు పంక్తులలో నున్న అనుష్టుప్పు అనువాదమున సీస పద్యమైనది. ఇందు రథమునకు వాడబడిన విశేషణములు రెండును, తరళ సౌదామినీ దామ - మొదలగు ఉపమానమును, రథ చక్రముల ధ్వనిని విని

మయూరములు "కేకలు"[1] వేయుచూ నృత్యము చేయుటయును, ఆ కోలాహల మునకు వన మధ్య భాగము మార్మోగుచున్నదనుటయు అమూలకాంశములే. ఇచ్చట ఆనంద కోలాహలముతో నర్తించునది నెమళ్ల మాత్రమే గాదు; శ్రీకృష్ణుని రాకతో ప్రాణములు లేచివచ్చిన పాండవులు కూడ నృత్యము చేయు దురు; అంతేకాదు ఎఱ్ఱన రచనాశిల్పమునకు ముగ్ధములైన భావుక హృదయములు కూడ నృత్యము సల్పును. ఇట్లు ఈ భ్రాంతి మదలంకారమునకు సర్వము భ్రాంతమగును!

2. అట్లు వచ్చిన కృష్ణుకు పాండవుల కష్టసుఖములను గూర్చి పలు విధముల పరామర్శించిన పిమ్మట ధర్మజునితో, "వీరు (నీ తమ్ములు) నీ యాదే శమును పాటించుచు నీవు నిలబడుమన్నచోట నిలబడుదురు గాక" యని పలు కును. దీనికి మూలమున గల వాక్యములివి :

ఏతే నిదేశం తవ పాలయంతః
తిష్ఠంతు యత్రేచ్ఛసి తత్ర రాజన్ -శ్లో. 32

ఎఱ్ఱనగారి కృష్ణుడిట్లనుచున్నాడు :

చ॥ వినుత భవన్నియోగమును వేల యలంఘ్యముగాన యిమ్మెయిన్
ఘన భుజవీచి విభ్రమ వికాసముఁజూపక నిల్చెఁగాక; స
జ్జనసుత ! చూడ నీ యనుజ సాగరముల్ దఱి తోడ విద్విష
జ్జనలయకారులై కడఁగి సర్వజగంబుల నాక్రమింపవే !
—4-159

ఇది సాలంకారమైన మూల ప్రపంచనము. మూలమునకు అనువాదము నకు హస్తిమశకాంతర భేదమున్నదనుట స్పష్టము.

3. ధర్మవ్యాధుడు కౌశికునకు అహింసా స్వరూపమును చెప్పు సంద ర్భమున కొన్ని యుదాహరణములను ప్రస్తుతించును. మూలమున ఒక్క శిబి చక్రవర్తి విషయము మాత్రమే ఉండగా ఎఱ్ఱన మఱికొన్నింటిని జోడించి విస్త రించిన ప్రసంగమును పరికింపుడు :

1. కేకా వాణీ మయూరస్య - అమరకోశము.

మూలము : ఆత్మ మాంస ప్రసాదేన శిబిరౌశీనరో నృపః
స్వర్గం సుదుర్గమం ప్రాప్తః క్షమావాన్ ద్విజసత్తమ.
—అష్టాధిక ద్విశతతమోధ్యాయము 7

అనువాదము : సీ॥ అనఘ! యౌశీనరుండగు శిబి నిజగాత్ర
హింస నింద్రాగ్నుల కిడడె మాంస?
మతనికి లేదయ్యె నయ్య యుత్తమ గతి?
రంతిదేవుఁడను రాజు తొల్లి
యనుదినంబును గోసహస్ర ద్వయంబుఁదా
వధియింపడే? వేయి వత్సరములు;
దురిత మమ్మహాత్ముఁ దొరరెనే? వేదార్థ
నిరతులై యత్యంత నియతులైన

తే॥ ధారణీసురముఖ్యు లధ్వరములందుఁ
బశువుల వధింపరే? తగఁబరమ పుణ్య
గతులు గలుగవె వారికి? గడఁగి యగ్ని
యధిక మాంసార్థుఁడని శ్రుతులందు వినమె?
—ఆ 5 - పద్యము 55

ధారుణీ సురముఖ్యులు అధ్వరములందు బశువుల వధింపరే? తగపరమ పుణ్య గతులు గలుగవె వారికి? అన్న ఆమూలక భావమును శంభుదాసు కాళిదాసు నుండి గ్రహించినాడా యన్న విచికిత్స బొడముచున్నది. శాకుంతలం, షష్ఠాంక ప్రారంభమున గల ప్రవేశకములో రక్షక భటాధికారితో ధీవరుడు (జాలరివాడు) చెప్పిన యీ క్రింది శ్లోకభావమును గమనింపుడు :

సహజం కిల యద్ వినిందితం నఖలు తద్ విసర్జనీయమ్
పశుమారణకర్మదారుణోఽనుకంపా మృదు రపి శ్రోత్రియః
—శ్లోకం 1

4. హనుమానుడు మొదలగు వానర ముఖ్యులు సీత జాడను తెలిసికొనివచ్చి మధువనమున విహరించి సుగ్రీవ దర్శనమునకు వచ్చిన ఘట్టము రమణీయముగ వర్ణింపబడి విస్తరింపబడినది.

మూలము : హనుమత్ప్రముఖాశ్చాపి విక్రాంతా స్తే ప్లవంగమాః
అభిజగ్ముర్హరీంద్రం తం రామలక్ష్మణ సన్నిధౌ
—ద్వ్యశీత్యధిక ద్విశత తమోఽధ్యాయము 81

అనువాదము : తేనెలు గ్రోలి క్రోలి కడుఁదియ్యని కమ్మని పండులింపు సొం
పొనగ నాని యాని, పరపందిన నీడలు మెచ్చి మెచ్చి మం
దానిల శైత్యసౌరభ సమగ్రతకుం గడుఁజొక్కి జొక్కియు
ద్యానము న ధు మారుత సుత ప్రముఖుల్ విహరించి తృప్తులై
—అ. 7 - పద్యము 11

ఇందలి "క్రోలిక్రోలి" "ఆనియాని" మొదలగు ద్విరుక్తపదములు వానరచేష్టల యందలి పౌనఃపున్యమును వ్యక్తము చేయుచూ హృద్యముగా నుండుటను గమనింపవచ్చును. ఈ పద్యము వ్యాసుని మూలమునకు పెంపు దలగా కాన్పించినను, వాల్మీకి మూలమునకు అనుసరణముగా నున్నదని గ్రహింప వలెను. (వాల్మీకి రామాయణము, సుందరకాండ, 62వ సర్గము).

6. ఎఱ్ఱన మూలమునకు పెంపుదల గావించిన సందర్భములందు పాటించిన పద్ధతి యొకటి గమనార్హము. మూలమునం దక్కడక్కడ చెల్లచెదు ఱుగ పడియున్న యంశములను పూసగ్రుచ్చినట్లొక చోట చేర్చి, దానికి మఱి కొంత అమూలకాంశమును జోడించి వ్రాయుట :-

సీ॥ శకుని కైతవము దుశ్శాసను చేసిన
దుష్కర్మమును, గర్ణు తులువతనము
దుర్యోధనుని దైన దుర్నయంబును జిత్త
మునఁ గిరిశల్యముల్ వోలె నలఁప;
దావాగ్ని తెఱగున దరికొని క్రోధంబు
వనవాసమనియెడి వాయుగతుల
నంతకంతకుఁబేర్చి యవయవంబుల నెల్ల
నుండంగ నెప్పుడు మధ్యముండు

ఆ॥ మొగము జేవురింప ముడివడు బొమలతో
నవుడుగఱచుచును భయంకరముగ
నున్న రూపు వాయకుండు నా మదిః వాడ
మిత్తినాదు పుత్రమిత్రతతికి

—ఆ. ౬ - పద్యము ౩౩౬

ధృతరాష్ట్రుడు పాండవుల వనవాస క్లేశమునకు దుఃఖించు ఘట్టములోని దీ పద్యము. సీస పద్యమంతయు పైన పేర్కొనబడిన చందమున దాదాపు మూలానుసారముగనే యున్నది. ఆటవెలది మాత్రము పెంచి వ్రాయబడినది. అయితే, మూలమున మఱొక శ్లోకమున గల "కరంకరేణాభి నిపీడ్య వీరః" (చేతులు పిసికికొనుచు, పిడికిళ్ళు బిగించుచు) అన్న వాక్యమును దృష్టియందుంచు కొని అనువాదమున నీ మూడు విశేషణములు వేయబడినట్లు కాన్పించును. ఇవి భీముని వలన ధృతరాష్ట్రునకు కలుగుచున్న భయభీతత్వమును చక్కగా వ్యక్తము చేయుచున్నవి.

## 2. మూల కుంచనము :

ఇట్లు మూల భావములను ఎడనెడ పెంచి వ్రాయుటయే గాక కొన్ని యెడల ఎఱ్ఱన మూలమును కుదించి వ్రాయుట కూడ కలదు. మూలము నందొక భావము అనవసరముగ విస్తరింపబడి పదే పదే చెప్పబడినట్లు భావించిన తఱి, సాధారణముగా నీతడీ కత్తిరింపులకు పూనుకొనునట్లు స్ఫురించును :

1. కామ్యక వనమునందున్న పాండవులను పరామర్శించుటకు సత్యభామాసమేతుడై వచ్చిన శ్రీకృష్ణుడు కొంత తడవు ధర్మరాజుతో ముచ్చటించిన పిదప, ద్రౌపదిని యోదార్చును. ఈ ఓదార్పు ఘట్టము మూలమున తొమ్మిది పెద్ద శ్లోకములలో గలదు. (23-31 శ్లోకములు). ఎఱ్ఱన దీనినంతయు సంగ్రహించి ఒక్క సీస పద్యములో నిముడ్చెను :

సీ॥ నీ పుత్రులేవురు నీరజలోచన
యదు కుమారులందారు ముదము తోడ
ననుపమ స్నేహ సమాహృత హృదయులై
కరి హయారోహణ పరతదగిలి

యాడుచు వివిధ శస్త్రాస్త్ర ప్రయోగముల్
గఱచుచు నొండెల్ల మఱచి యున్న
వారు; ప్రద్యుమ్నుండు వారికి దివ్యాస్త్ర
జాతంబులెల్లను బ్రీతి నొసఁగెఁ;

ఆ॥ దన్వి యా సుభద్ర తన పుత్రుకంటె నీ
తనయు లందుఁగూర్మిఁ దనరఁజేయు;
నూఱిల్లు మింక నుజ్జ్వలోన్నతుఁబెం
పారఁగాల మనతి దూరమయ్యె

—ఆ. 4 - పద్యము 162

2. మార్కండేయుడు ధర్మజునకు బ్రాహ్మణ ప్రభావమును గూర్చి చెప్పు ప్రకరణమున హైహయులు తార్క్ష్యుడను మునీంద్రునితో, మృతుడయిన రాకుమారుడు తిరిగి జీవించుట విస్మయముగ నున్నది. ఇట్టి మహిమ కలిమికి కారణమేమి యని యడుగగా తార్క్ష్యుడు చెప్పిన సమాధానము మూలమున సుమారు పదిహేను అంశములతో కూడి ఏడు శ్లోకములలో పొందుపఱచబడి యుండగా ననువాదమున ఏదంశములతో గూడి ఒక్క పద్యములో నిముడ్చ బడినది :

శా॥ ఆలస్యంబొక యింత లేదు; శుచి యాహారంబు; నిత్య క్రియా
జాలంబేమఱ! మర్చనీయులతిథుల్; సత్యంబ పల్కంబడున్
మేలౌ శాంతియు, బ్రహ్మ చర్యమును నెమ్మిందాల్తు; మిట్లొట నె
క్కాలంబుం బట్టు మృత్యు రోగ భయ శంకం బొందమే మెప్పుడున్

—ఆ. 4 - పద్యము 191

3. సరస్వతీగీతలో తార్క్ష్యమునికి సరస్వతీదేవి చెప్పిన గోదాన, వృషభదాన, వస్త్రదాన, సువర్ణదాన ఫల విషయము మూలమున పునరుక్తులతో కూడి ఏడు పెద్ద శ్లోకములలో నున్నది. (8-14 శ్లోకములు) దీని సారాంశ మును ఎఱ్ఱన ఒక్క సీస పద్యములో సంగ్రహించెను :

సీ॥ మేలగు క్రేపుతోఁబాలు సాలఁగఁగల్గి
లాలితంబగు తొలిచూలి మొదవుఁ

బాత్రభూతుండైన శ్రోత్రియునకు నిచ్చు
సదమల చరితుఁడమ్మొదవు మేన
నెన్ని రోమము లుండు నన్ని వేలేఁడ్లను
సుర లోక సౌఖ్య విస్ఫురణ నొందు
భారంబునకుఁజాలి భూరి సత్త్వాఢ్యమై
బిరుదైన యెద్దు భూసురన కిచ్చి

ఆ॥ నరుఁడు ధేను దశక మిర వొంద నిచ్చిన
ఫలము వడయు; మంచి వలువలొసగి
చంద్రలోకమున కతంద్రితుఁడై చనుఁ;
గనక మిచ్చి నాకమునకు నరుగు

— ఆ. 4 - పద్యము 212

4. మార్కండేయుడు ధర్మజునకు మధుకైటభుల చరితమును చెప్పు సందర్భమున - లోకమంతయు నేకార్ణవమై యుండ, హరి యోగనిద్రా పరవశుడైనప్పుడు, అతని నాభి కమలమునందున్న బ్రహ్మను మధుకైటభులు తన్నగా నాతడు ఆక్రోశించును. ఈ మాత్రపు కథాంశము మూలమున పన్నెండు అనుష్టుప్పులలో నిబంధింపబడెను. (1-12 శ్లోకములు) ఎఱ్ఱనగారి యనువాదమున నిది యొక సీస పద్యమునకు కుదింపబడినది :

సీ॥ అధిప ! తొల్లి జగత్త్రియంబు నేకార్ణవ
మై యుండగా, నప్డు హరియొకంత
భాసుర భోగీంద్ర పర్యంకమున భవ్య
యోగ నిద్రా సుఖయుక్తి నలరి
నతి దీర్ఘమగు కాల మరిగె; బదంపడి
దైత్యులిద్దఱు మహోదాత్తబలులు
మధుకైటభులు నాఁగ మధిత శాత్రవులేఁగు
దెంచి యప్పరమాత్ము దివ్యనాభి

ఆ॥ కమలమున వెలుంగు కమలాసనునిఁగని
దర్పదోష నిహతిఁదలరి త్రేయ

నతడు భీతినొంది యాక్రోశ మొనరించె
"నాది పురుష ! నన్ను నరయు" మనుచు

—ఆ. 4-392

5. సీతారావణ సంవాద ఘట్టమున రావణుడు సీతతో తనను వరింపు మని రెండు విధతలుగా కోరును. ఇది మూలమున తొలుత తొమ్మిది అనుష్టుప్పుల లోను, పిమ్మట రెండు అనుష్టుప్పులలోనూ చెప్పబడినది. సీత యాతనిని ప్రత్యా ఖ్యానము చేయుట మూడు నాలుగుసార్లు వివరింపబడినది ఎట్టిన రావణుడు చెప్ప దలచుకొన్నదంతయు నొక్కమాటే చెప్పినట్లును, పిమ్మట సీత వానికి తృణ మంతరముగా సమాధానము చెప్పినట్లను వ్రాసి మొత్తము మీద నీ సందర్భ మును కొంత సంగ్రహించను. రావణుని యుపన్యాసము యొక్క నిడివి మూలమునందెంత యున్నదో అనువాదమునందును అంతే యున్నదని చెప్ప వచ్చును గాని సీత సమాధానము మాత్రము ఒక్క సీస పద్యములోనికి తేబడి నది. ఆ పద్యమిది :

సీ॥ అకట ! పరాంగన నబల, పతివ్రతఁ
బరికింపగా మర్త్యభామ నేను;
రాక్షసుండవు నీవు; రాగంబు మదినించు
కయు లేనినాడు సంగమమునందుఁ
గలిగెడు నట్టి సౌఖ్యంబెంత ? యదియును
గాక యాద్యుండైన కమల గర్భు
పౌత్రుండనని, లోకపాలతుల్యుడనని
హర సఖుండైన ధనాధినాథు

ఆ॥ భ్రాతనని శివభక్తిభావంబు సెప్పితి;
విట్టి నీవు ధర్మ మెఱుఁగి, దురిత
వర్తనంబు విడువ వలదె? సిగ్గేది యి
ట్లుగిదిఁ బల్లదములు పలుకఁదగునె?

—ఆ. 6 - పద్యము 408

## 3. అన్యథా ప్రకల్పనము :

కొన్నియెడల మూలము నందలి విషయమున నౌచిత్యము లోపించినదని

తోచిన తావులందు గాని, లేదా మఱింత ఔచిత్యమును తెచ్చిపెట్టుటకు గాని ఎఱ్ఱన దానిని మార్చి ఔచిత్య శోభితముగా తీర్చిదిద్దెను.

1. ధృతరాష్ట్రుడు పాండవుల వనవాస క్లేశమునకు దుఃఖించు సందర్భమున, ధర్మజుడెట్టి కష్టము లనుభవించుచున్నాడో తలంచికొని వాపోయిన పట్టున మూలము నందిట్లున్నది :

ప్రబోధ్యతే మాగధ సూత పూగై
ర్నిత్యం స్తువద్భిః స్వయమింద్ర కల్పః
పతత్త్రి సంఘైః సఙఘన్య రాత్రే
ప్రబోధ్యతే నూన మిడా తలస్థః

—ఘోషయాత్రా పర్వము - శ్లోకం 10

ఎఱ్ఱనగారి యనువాదము :

అమల నివాత సౌధముల యందు, మనోజ్ఞమరాళతూల త
ల్పముల శయించి, రేపులు శుభస్థితి మాగధ సూత గీత నా
దముల(ప్రబోధముం బొరయు ధర్మ సుతుండు కఠోర భూమి భా
గమున శయించి మేల్కను సృగాల నినాద వికీర్ణ కర్ణుడై

—ఆ. 5 - పద్యము 829

మూలమున "పతిత్త్రి సంఘైః" (పక్షుల సమూహములచేత) మేల్కొలుపబడుచున్నాడు అని యుండగా, అనువాదమున "సృగాల నినాద వికీర్ణ కర్ణుడై" అను విధముగా నన్యధా ప్రకల్పనము గావించినాడెఱ్ఱన. మూలమున ఔచిత్యము లేకపోవుట యన్నది లేదుగాని అనువాదమున మఱికొంత ఔచిత్య శోభను కూర్చినాడనుట సమంజసము. అనువాదమున కాన్పించు నీ మార్పునకు మూలము మహాకవి భారవి కృత కిరాతార్జునీయము నందు కాన్పించుచున్నది. ఇందలి ప్రథమ సర్గలో ద్రౌపది ధర్మజునితో నిష్ఠురమాలాడు సందర్భమునగల యీ క్రింది శ్లోకము నారయుడు :

పురాధి రూఢః శయనం మహా ధనం
విబోధ్యసేయః స్తుతిగీతి మంగళైః

అదభ్రదర్భా మధిశయ్య స స్థలీం
జహాసి నిద్రామశివైః శివారుతైః

—శ్లోకం - 38

ఇందలి "అశివైః శివారుతైః" అను మాటలు "సృగాల నినాద వికీర్ణ" అన్నట్లు రూపాంతరము నొందినవి. కవిత్రయము వారు కొన్ని యెడల సంస్కృత మహాకావ్యములందున్న భావములను పరిగ్రహించి సందర్భోచితముగ తమ కావ్య భాగములలో జొప్పించి యుండిరని విమర్శకులు కనిపెట్టి యుండిరి. అందుకిదొక చక్కని తార్కాణము. ఇక మూలమునందలి "ఇంద్రకల్పః" అను దళమును అనువాదమున నెట్టిన విడిచివేయుటకు కారణము మృగ్యము.

2. రామోపాఖ్యానమున ధూమ్రాక్షుడు హనుమంతునితో చేసిన యుద్ధ ఘట్టమునందలి యొక శ్లోకమిట్లున్నది:

తయోర్యుద్ధ మభూత్ ఘోరం హరి రాక్షస వీరయోః
జిగీషతో ర్యుధాన్యోన్య మింద్ర ప్రహ్లాదయోరివ

షడశీత్యధిక ద్విశతతమోధ్యాయము - శ్లోకం 12

అనువాదము: ప్రధనమయ్యెద్దఱకు నృగ భంగి నమర
పతికి వృత్రునకుం బోలెం బ్రకటమయ్యె

—ఆ. 7 - పద్యము 88

మూలమున ఇంద్ర ప్రహ్లాదుల యుద్ధమువలె నున్నదని యుండగా ననువాదమున ఇంద్రవృత్రులకు జరిగిన యుద్ధమువలె నున్నదని మార్చి చెప్పబడినది. ప్రహ్లాదుడు రాక్షస వంశ సంజాతుడయ్యును గొప్ప భక్తుడు. పైపెచ్చు ఇంద్ర ప్రహ్లాదులయుద్ధ మంత ప్రసిద్ధము గాదు. ఏ దృష్టితో చూచినను ఇంద్ర వృత్రుల యుద్ధము వలెనున్నదనుటయే ఔచిత్య శోభితముగా గోచరించును. అయితే కొన్ని ముద్రిత ప్రతులలో యథామూలముగ "అమరపతికి ప్రహ్లాదునకు బోలె బ్రకటమయ్యె" అను రీతిగనే యనువదింపబడినట్లు పాఠాంతరము కాన్పించుచున్నది. ఈ రెండింటిలో నేది యెట్టిన యనువాదమై యుండును? అను ప్రశ్నకు సమాధానము పాఠకుల నిర్ణయ ప్రతిభకే వదలి వేయబడుచున్నది.

3. అశోక వనమందున్న సీతను చూచుటకు పోవునప్పుడు రావణు డలంకృతుడైన విధము మూలమునం దిట్లున్నది :

దివ్యాంబర ధరః శ్రీమాన్ సుమృష్ట మణికుణ్డలః
విచిత్ర మాల్యముకుటో వసంత ఇవ మూర్తిమాన్
—శ్లోకం 4

సకల్పవృక్ష సదృశో యత్నాదపి విభూషితః
స్మశాన చైత్యద్రుమవత్ భూషితోఽపి భయంకరః
ఏకాశీత్యధిక ద్విశతతమోఽధ్యాయము - శ్లోకం 5

అనువాదము- "దివ్యమాల్యాంబరాభరణ భూషితుండై సంచార శీలంబైన కల్పపాదపంబుంబోలె నొప్పియుం దన యొప్పుంబితృవనంబునందలి వట భూరుహంబు సొంపునుంబోలె నతి భీషణంబగుచుండ నశోక వనమధ్యంబు సొత్తెంచి"
—ఆ. 6 - వచనము 408

మూలమునందలి "వసంత ఇవ మూర్తిమాన్" అన్నది యనువాదమునకు రాలేదు. ఈ వర్ణనము వసంత సదృశత్వమును సూచింపక పోవుట కారణము కావచ్చునని యూహింపవచ్చును. "కల్పవృక్ష సదృశః" అన్నది "సంచారశీలంబైన కల్ప పాదపంబుంబోలె" అనురీతిగ ననువదింపబడి మూలమును మించిన శోభతో నొప్పుచున్నది. "స్మశాన చైత్యద్రుమవత్" అనునది "స్మశానము నందలి కాష్ఠద్రుమము వలె" అని యనువదింపవలసి యుండగా నట్లుగాక "పితృవనంబునందలి వట భూరుహంబు సొంపునుంబోలె నతి భీషణంబగుచుండ" అని వటవృక్షముతో పోల్చి, అన్యథా ప్రకల్పింపబడినది. మఱ్ఱిచెట్టు ఔన్నత్యమునకు, వైశాల్యమునకును, భీకరత్వమునకు పెట్టినది పేరుగాన నిందు మూలమున రావణుని భీషణరూపమును రూపుగట్టించుట ఎఱ్ఱనగారి కభిప్రేతము. ఇట్టిది యెఱ్ఱనార్యుని ప్రతిభా విలాసము !

---

4. సావిత్రి యమధర్మరాజుతో నీవు భూతములను యమింతువు గాన నిన్ను యముడందురు. కల్మషములనెల్ల శమియింతువు గాన శమనుడవందురు. అని ప్రశంసించినప్పుడు అతడు సంతసించి సావిత్రితో పలికిన మాటలు మూలమునం దిట్లున్నవి :

పిపాసితస్యేవ భవేద్ యథా పయ
స్తథా త్వయా వాక్యమిదం సమీరితమ్
సప్తనవత్యధిక ద్విశతతమోఽధ్యాయము - శ్లోకం - 37

అనువాదము : తృషితుఁడగు వానిఁబరిలఘు
తుషారతోయములు మోఁదునిఁజేయుగతిన్
హృషితాంగుఁజేసె ననుఁగ
ల్మష హరణములైన నీ సమంజస ఫణితుల్
—ఆ. 7 - పద్యం - 288

మూలమునందలి 'పయ' శబ్దము అనువాదమున తుషార తోయములుగా నన్యథా కరింపబడినది. దప్పితీరుటకు నీరు త్రాగుట ప్రకృతి సహజమగు లోక సామాన్యవిషయముగాని తుషారతోయములు త్రాగుటకాదు. అయితే సావిత్రి యమునితో సాగించిన సంభాషణ తీరు, వ్యక్తపఱచిన యభిప్రాయములు లోకము నందలి సామాన్యస్త్రీల కతీతమైనవి. ఈ విశేషాంశమును సూచించుటకు లోక సామాన్యరీతికి భిన్నముగ, ఎట్టిన తుషారతోయములు అని ప్రయోగించినాడు. మామూలు నీటికంటె మంచునీరు మఱింత చల్లగనుండునుగదా! "హృషితాంగున్" అనుటకంటె "హృషితాత్మున్" అనుట సమంజసము. సావిత్రి మాటలవలన చల్లబడునది యముని యాత్మగాని శరీరము కాదు గదా ? మూలమున రెండు పంక్తులలోనున్న భావము అనువాదమున వ్యాఖ్యానప్రాయమగుచు నాల్గు పంక్తు లయినది. "పరిలఘు" వంటి దళముల ప్రయోజనమును పరిశీలించినచో మూల ముకంటె అనువాదమెంత రమ్యతరముగనున్నదో గ్రహింపవచ్చును.

5. పంచమాశ్వాస ప్రారంభమున ధర్మజుడు మార్కండేయుని, తల్లి దండ్రులిరువురి యందును పుత్రుని నిమిత్తమైన యాయాసమెవ్వరికెక్కుడు ? అని ప్రశ్నించును. దీనికి సమాధానవాక్యము మూలమునందిట్లున్నది :

కుక్షిణా దశమాసాంశ్చ గర్భం సంధారయంతి యాః
—పంచాధిక ద్విశత తమోధ్యాయము - శ్లోకం - 10

అనువాదమందిట్లు మార్చబడినది :

జఠవంబు మిగుల మాసములు తొమ్మిది యుద
రంబునం గరము భరంబు తోడ
—ఆ. 5 - పద్యము - 5

యుగధర్మమునుబట్టి కాలముయొక్క శక్తి క్రమముగా క్షీణించునుకాబోలు! వ్యాసుని యుగమున గర్భమును మోయుకాలము 'పదినెలలుకాగా ఎఱ్ఱన యుగము నాటికి తొమ్మిది నెలలైనది! ఔచిత్యపూర్ణమైన అన్యథా ప్రకల్పనకిది చక్కని తార్కాణము.

## 4. మూలత్యాగము :

ఎఱ్ఱనగారి యనువాద విధానములో "మూలత్యాగము" అన్నది మఱొక ముఖ్యాంశము. ఇందుకు కొన్ని యుదాహరణములను చూతముగాక.

1. శ్రీకృష్ణుడు సత్యభామాసమేతుడై కామ్యకవనమునందున్న పాండవులను పరామర్శించుటకు వచ్చినప్పుడు వరుసగా నొకరితరువాత మఱియొకరిని పలుకరించుచు నర్జునునితోచేరి పరామర్శించు పట్టున మూలమునందిట్లున్నది :

> కృష్ణస్తుపార్థేన సమేత్య విద్వాన్
> ధనంజయే నాసుర తర్జనేన
> బభౌయథా భూతపతి ర్మహాత్మా
> సమేత్య సాక్షాత్ భగవాన్ గుహేన
>
> త్ర్యశీత్యధిక శతతమోఽధ్యాయము - శ్లోకం - 18

అనువాద మీ విధముగ నున్నది :

"అప్పుడు కృష్ణుండు ధనంజయుం దన చేయునునిచికొని చిరకాల దర్శ నోల్లాసితంబులైన యా లోకనంబుల నతని యాకారంబత్యాదరంబున నభినందించుచు ధర్మరాజునకిట్లనియె"

—ఆ. 4 - వచనము - 158

అర్జునునితో కూడిన కృష్ణుడు కుమారస్వామితో కూడిన శివుని వలె నుండెను; అన్న మూలమునందలి భావము అనువాదమున వదలివేయబడినది. కుమారస్వామి యవతార ఘట్టమున కొన్ని యమూలకాంశములను చేర్చుటద్వారా ఎఱ్ఱన తన శంభుదాస లక్షణాభిధేయమును సార్థకమొనరించుకొనెను; అని వెనుక వివరింపబడినది. అట్టియెడ తనకిష్టమైన యీ మూలకాంశమును వదలివేయుటకు గల కారణము మృగ్యము!

2. ఘోషయాత్రా ప్రకరణమున గంధర్వుల చేతికి చిక్కిన దుర్యోధనుని విడిపింపవలసినదని ధర్మజుడు భీముని యాదేశించగా నందుఃకాతడు నిరాకరించును. అప్పుడాతనిని ఒప్పించుటకు ధర్మజుడు చేసిన ప్రయత్నము మూలము నందిట్లున్నది :

భవంతి భేదాః జ్ఞాతీనాం కలహాశ్చ వృకోదర !
ప్రసక్తాని చ వైరాణి కులధర్మో న నశ్యతి

—2

యదాతు కశ్చిత్ జ్ఞాతీనాం బాహ్యః పోథయతే కులమ్
న మర్షయంతి తత్ సంతో బాహ్యేనాభి ప్రధర్షణమ్

—3

పరైః పరిభవే ప్రాప్తే వయం పంచోత్తరం శతమ్
పరస్పర విరోధేతు వయం పంచ శతం తు తే
త్రిచత్వారింశదధిక ద్విశతతమోఽధ్యాయము — 4

అనువాదము : వ॥ ఏకాన్వయ జాతులైనవారికి నర్థనిమిత్తంబైన భేదం బొక్కొక మాటు వర్తిల్లు; నంతనజేసి సహజ స్నేహంబు దప్పనేరదు; జ్ఞాతి జనంబులు దమలో నెట్టివారైన నొప్పంగాని యన్యుల వలనం బరిభవంబు దొదరినప్పుడు దానోడోరుల జేకొనకునికి లోక నింద్యంబు........ ఇత్యాది.

"పరుల వలన పరాభవము ప్రాప్తించినప్పుడు మనము నూటఅయిదుగురము. మనలో మనము కలహించుకొనునప్పుడు మనము అయిదుగురము; వారు నూఱుగురు" అన్న చివరి శ్లోకము నందలి భావము అనువాదమున సూటిగా రాలేదు. అసలే రాలేదని చెప్పినను తప్పుగాదు. "వయం పంచోత్తరం శతమ్" "వయం-పంచ, శతంతు తే" ఎంత చక్కని ప్రయోగములివి! అనువాదమున వ్యాస హృదయము సరిగా నావిష్కరింపబడకపోవుటకు కారణమూహింప రాకున్నది!

3. గంధర్వుల బారినుండి పాండవులచేత విడిపింపబడిన దుర్యోధనుడు అవమానమును భరింపలేక ప్రాయోపవేశమునకు పూనుకొనును. అదిచూసిన పాతాళవాసులగు దానవులు దుర్యోధనుడు నశించినచో తమ పక్షము క్షీణించునని భావించి, అతనిని కాపాడుటకు నిశ్చయించుకొని, మంత్ర పూర్వకముగా

హోమము చేయించి, హోమగుండము నుండి 'కృత్య'ను పుట్టించి (మాయా రూప ధారిణియగు నొక దేవత) ఆమె ద్వారా దుర్యోధనుని పాతాళమునకు పిలిపింతురు. ఇచ్చట మూలమునందు హోమకార్య ప్రక్రియా విధానము వివరముగ వర్ణింపబడి యుండగా అనువాదమున ఒక్క ముక్కలో తేల్చి వేయబడినది. మూల శ్లోకము లివి :

ఆహ్వానాయ తదాచక్రుః కర్మ వైతాన సంభృతమ్
బృహస్పత్యుశనోక్తైశ్చ మంత్రైర్మంత్ర విశారదాః —23

అథర్వవేద ప్రోక్తైశ్చ యాశ్చోపనిషది క్రియాః
మంత్ర జప్య సమాయుక్తాస్తాస్తదా సమవర్తయన్ —24

జుహ్వత్యగ్నౌ హవిః క్షీరం మంత్రవత్ సుసమాహితాః
బ్రాహ్మణా వేదవేదాంగ పారగాః సుదృఢ వ్రతాః —25

కర్మసిద్ధౌ తదా తత్ర జృంభమాణా మహాద్భుతా
కృత్యా సముద్ధితా రాజన్ ! కింకరోమీతి చాబ్రవీత్ —26

పంచాశదధిక ద్విశతతమోఽధ్యాయము

అనువాదము : సీ॥ ఆతని పిలిపింపనప్పుడు శుక్రాదు
లైన భూసుర సమూహముల చేత
వేల్మి పెట్టించిన వేగంబ యొక కృత్య
వెలువడి భీషణ వికృతమూర్తి

ఆ॥ యేమిపనులు గలిగె ? నెఱిగింపుమనిన....

— ఆ. 6 - పద్యము 41

మూలమున బృహస్పతి, శుక్రాచార్యులిరువురు చెప్పబడగా ననువాదమున బృహస్పతి విడువబడి శుక్రుడు మాత్రమే పేర్కొనబడినాడు. ఇది రాక్షసులు చేయు జన్నము. కావున రాక్షస గురువగు శుక్రునకే యిచ్చట పని యుండును. దేవతల గురువగు బృహస్పతి యొక్క ప్రసక్తి యిక్కడ అనవసరము; అని భావించి కవి ఎఱ్ఱన బృహస్పతిని వదలినాడు. ఇంతవఱకు నిది సమంజసమే. కాని మూలమునందలి "అథర్వవేద ప్రోక్తైః" అన్న మాటను వదలివేయుటలో నౌచిత్యము కానరాదు. రాక్షసులు నిర్వహించు నీ హోమము తాంత్రికమైనది.

అందుండి యుద్ధోల్లిన కృత్య కూడ తాంత్రిక శక్తియే. అథర్వవేదము తంత్ర విషయ ప్రధానమైనది. గావున సందర్భమునకు సరిపడునట్లు మూలమున ప్రసక్తమైనది. అది యనువాదమున కూడ దిగియుండినచో బాగుండెడిది. ప్రకరణము నందలి ప్రధానాంశములు జారిపోరాదు గదా?

4. ఘోషయాత్రా సందర్భమున దుర్యోధనుడు అక్కడ ననేక క్రీడా మంటపములను సిద్ధముచేయుదని పరివారమునకు ఆజ్ఞయిచ్చెను. ఆ ప్రయత్నమును గంధర్వులడ్డగించిరి. దుర్యోధనుని సైనికులు గంధర్వులతో "దుర్యోధన మహారాజు ఇక్కడ విహరించుటకు సకుటుంబముగా వచ్చితిరి గాన మీరిక్కడ నుండి తొలగిపొండని హెచ్చరించిరి. ఆ హెచ్చరికను విని గంధర్వులు నవ్వి మందబుద్ధియగు మీ రాజు వైశ్యుల నాజ్ఞాపించినట్లు దేవలోకవాసులైన మమ్ము కూడ నాదేశించుచున్నాడే యని పలికిరి. ఇప్పట్టున మూలమును గమనింపుడు :

న చేతయతి వో రాజా మందబుద్ధిః సుయోధనః
యోఽస్మానాజ్ఞాపయత్యేవం వైశ్యానివ దివౌకసః —28
చత్వారింశదధిక ద్విశతతమోఽధ్యాయము

అనువాదమున గంధర్వులు పలికిన మాటలివి :

క॥ ఎదిరిం దన్ను నెఱుంగఁడు
మదమునఁ బ్రాణంబుఁదనదు మానముఁగోల్పో
మదిఁ దలచినాఁడు మీ నృపుఁ;
డిదియేటికిఁజెనటి చెయ్వులిన్నియు నిచటన్

వ॥ బుద్ధిమంతుడై యూరక చనుట లెస్స........
—ఆ. 5 - పద్యములు 385, 386

మూలమునందలి "వైశ్య" కుల ప్రసక్తి అనువాదమున పరిహరింపబడినది. అరణ్యపర్వ శేషమునందలి కథలలో నొక వైవిధ్యమున్నది. కొన్ని కథలు బ్రాహ్మణ ప్రభావమును ప్రతిపాదించును. అత్రిగౌతమ సంవాద ఘట్టమున క్షత్రియ మాహాత్మ్య కథనమున్నది. ధర్మవ్యాధోపాఖ్యానమున కులాతీతమగు నొక చక్కని ధార్మిక వ్యవస్థ ప్రతిపాదింపబడినది. ఈ కథలనన్నింటిని యీ దృష్టితో విశ్లేషణాత్మకముగ పరిశీలించి చూడగా నొక విషయము స్ఫురించును; వ్యాసునికి వర్ణవ్యవస్థ కావలయునేగాని వర్ణవిభేదము పనికిరాదు అని.

వ్యాసుని యొక్క యీ తత్త్వమును చక్కగ నాత్మీయము చేసుకొన్నవా డెఱ్ఱన. ఈతడు ఆయా కథలను నిర్వహించుటలో మతిత భావాత్మక దృష్టిని (Positive outlook) అవలంబించినాడని భావింపవచ్చును. మూలమునందలి వైశ్యుల పిఱికితనమును సూచించు నీ వాక్యమును అనువాదమున రాకుండజేయుటను దీని కొక తార్కాణముగ గ్రహింపవచ్చును.

5. ఘోషయాత్రా పట్టమున దుర్యోధనుడు వేటాడిన యనంతరము ద్వైత వనమునందలి సరోవరమును చేరను. ఆ సరస్సీరము నందే ధర్మరాజు సోదరులతోను, భార్యతోను రాజర్షి యజ్ఞమును చేయుటకు సిద్ధమగుచుండెను. ఈ సందర్భమున ధర్మజుని వర్ణనా శ్లోకము మూలమునందిట్లున్నది :

బుద్ధ్యాపరమయా యుక్తో మహేంద్ర ఇవ వజ్రభృత్
యదృచ్ఛయాచ తత్రస్థో ధర్మ పుత్రో యుదిష్ఠిరః
చత్వారింశదధిక ద్విశతతమోఽధ్యాయము - 15

అనువాదము : "అంతనట ధర్మనందనుండు తత్సమీపంబున మునిజన సహాయుండై వన్యంబులగు ఫల మూల విశేషంబులు సాధనంబులుగా సద్య స్కందంబను యజ్ఞంబు సేయుచుండె" ఆ. 5 - వచనము 380

మూలమునందలి ధర్మజునకు వాడబడిన "మహేంద్ర ఇవ వజ్రభృత్" అన్న విశేషణము అనువాదమున విడువబడినది. ఈ విశేషణమును వేయుటలో మూలకర్త యాశించిన ప్రయోజనమేమిటో సూటిగా స్ఫురించుట లేదు. ముందు జరుగబోవు కథలో దుర్యోధనుని దుస్తంత్రమును పటాపంచలు చేసి పాండవులకు సహాయ మొనర్పదలచి యింద్రుండు గంధర్వులను రంగము మీదికి తోలును. ఈ విషయమును భంగ్యంతరముగ సూచించుట కాయన్న విచికిత్స కలుగును. "మహేంద్ర ఇవ" అని మాత్రమేగాక ఆ మహేంద్రునకు "వజ్రభృత్" అన్న విశేషణమును తగిలించుట వలన ఇట్టి జిజ్ఞాస కలుగుట సహజము. ఎఱ్ఱన దీనిని విడిచిపెట్టుటకు గల కారణ మమూహ్యము. ఇట్లు అనువాదమున మూల భాగ ములు కొన్ని యెడల కాన్పించును.

## 5. అమూలకములు :

ఎఱ్ఱనార్యుని యనువాదమున కొన్ని యమూలకములయిన పద్యములు

గోచరించును. మూలమున సూచనామాత్రముగనున్న యంశములను పెంచి వ్రాసిన సందర్భములు కొన్ని వెనుక చూపింపబడినవి. అట్లుగాక, అసలు మూలమున బొత్తిగా లేని యంశములు, స్వకపోల కల్పితముగ వ్రాసినవి అక్కడ తక్కడ కాన్పించుచున్నవి. శరదృర్ణనలోని "అతిగాంభీర్య విభూతి" సరస్వతీ గీతలోని "అంబ నవాంబుజోజ్జ్వల కరాంబుజ" మొదలగునవి ఇందులకు ఉదాహరణగ పేర్కొనవచ్చును. ఈ పద్యములు వేఱొక సందర్భమున వెనుక గతార్థములయినవి ఇప్పుడు ఒకటి రెండుదాహరణములను చూతము :

1. పంచమాశ్వాసమున, కేశి యను దానవుడు దేవసేనను చెఱగొని పోవునపుడు ఇంద్రుడామెను రక్షించి యామె వృత్తాంతమును గూర్చి ప్రశ్నించగా దేవసేన జరిగిన విషయమును వివరించును. ఆ దానవుడు తనను, తన అక్క దైత్యసేనను వలలో వేసుకొనుటకు ప్రతిరోజు ఎట్లు ప్రయత్నించినదియు వర్ణించి చెప్పిన యీ క్రింది పద్యము అమూలకము :

క॥ పలుమాఱు వచ్చి తన దు
ర్విలసితములు మాకుఁ జూపు వేడుక దోఁపన్;
బలుకును మేలమునఁ జెనకఁ
దలయుఁగద్దియు మదన కదన దళిత హృదయుఁడై

—పద్యము 183

ఇది యెఱ్ఱనగారి లోకజ్ఞతను సూచించు పద్యము. కాముకులు అమాయికలగు కన్యలను లోగొనుటకు "బూతులు" మాట్లాడుట, "మర్మావయవములను" ప్రదర్శించుట మొదలగు పనుల ద్వారా వారిని రెచ్చగొట్టుటకు ప్రయత్నించుట గలదని వినుచుందుము. ఈ విషయమును "తనదుర్విలసితములు మాకుఁజూపు" వంటి సున్నితములైన మాటల ద్వారా చక్కగా వ్యక్తముచేసినా డెఱ్ఱన. అట్లు వ్యవహరించిన దానవుడు దైత్యసేనను చేజిక్కించుకొన గలిగెను. దేవసేనను చిక్కించుకొనలేకపోయెను. ఈ విషయమిట్లు చెప్పబడినది :

తే॥ వాని చేష్టలన్నియు దైత్యసేన కభిమ
తములై యుండు; నాకుఁ నెంతయును దుస్స
హములః వినవె యమ్మెయిన యక్కమల నయనఁ
గోరి దానవుఁడేల యుంచుకొంచుఁజనియె —184

తే॥ అంతఁ జోక వెండియు వచ్చి యింత సేసె
దుర్దురాత్ముఁడు నన్ను........ —185

ఈ రెండు పద్యముల భావము మూలమునందున్నది. అయితే నిర్వ హణలో భేదమున్నది. పై యమూలక పద్యమున కనుకూలముగ నుండునట్లు నిర్వహణలో ఈ భేదమును పాటించినాఁ డెఱ్ఱన. ఇట్టిది యెఱ్ఱనగారి లోకజ్ఞత!

2. రామోపాఖ్యానమున ప్రహస్త ధూమ్రాక్షుల మరణ వార్తను విని ప్రకట బాష్ప నిశ్వాస వివర్ణవదనుండగుచు రావణుడు వితర్కించిన ఈ క్రింది పద్యము అమూలకము :

క॥ "కలవారెల్లను మడిసిరి
కలిగియు లేఁడయ్యెఁగుంభకర్ణుఁడు; వీనిం
దెలుపుదునా? యేనుఁ గొడుకుం
బల మెడపక రిపులతోడ సరిఁబెనఁగుదునో?"
—ఆ. 7 - పద్యము 93

మూలమునందీ విషయమిట్లున్నది :

శ్లో॥ సుదీర్ఘమివ నిఃశ్వస్య సముత్పత్య వరాఽసనాత్
ఉవాచ, కుంభకర్ణస్య కర్మ కాలోఽయ మాగతః —19

ఇత్యేవ ముక్త్వా వివిధై ర్వాదిత్రైః సుమహాస్వనైః
శయాన మతి నిద్రాలుం కుంభకర్ణ మబోధయత్ —20

ఈ రెండు శ్లోకములకు ఎఱ్ఱనగారి యనువాద మీరీతిగ నున్నది :

"....ప్రకట బాష్ప నిశ్వాస వివర్ణ వదనుండగుచుఁ బంక్తివదనుండు"
—ఆ. 7 - వచనము 92

"అని వితర్కించి అప్పుడికిఁగుంభకర్ణ ప్రబోధంబు గార్యంబుగా నిశ్చయించి తదీయ శయ్యాగృహంబునకుం జని, వానిం దెలుపం బరిజనంబుల బరిచిన"
—వచనము 94

ఈ రెండు వచనములకు నడుమ పై యమూలక పద్యమును వ్రాసినా డెఱ్ఱన. సూచనామాత్రసారముగనైనను మూలమున లేని యీ యమూలక వితర్కమును వ్రాయుటలో ఎఱ్ఱన యొక్క మానవ మనస్తత్వ నిరూపణము వ్యక్తమగుచున్నది. కుంభకర్ణుడు తమ్ముడు, ఇంద్రజిత్తు కొడుకు; యుద్ధమునకు పోయినవారు విజయమే పొందుదురో వీరస్వర్గమే యలంకరింతురో చెప్పలేము. అట్టి తఱి ముందుగా నెవ్వరిని పంపి బలిపెట్టవలయును? అన్నది రావణుని పీడించుచున్న విచికిత్స. చివరికి కొడుకును పంపలేక తమ్ముని బంపుటకే నిశ్చయించుకొని తన పుత్రవ్యామోహమును వ్యక్తము చేసినాడు రావణుడు. ఇది ఎఱ్ఱన యొక్క పాత్రపోషణ విధాన చాతుర్యము!

8. ఇంద్రజిత్తు యొక్క మాయామయ యుద్ధము విఫలమైనది. అతడు రణరంగమును విడిచివెళ్లి మఱల రణము చేయుటకు వచ్చెను. ఈ సందర్భమును ఎఱ్ఱన వ్యాసుని మూలము ననుసరించి గాక వాల్మీకి రామాయణము ననుసరించి తీర్చిదిద్దెను. ఇక్కడ వ్యాసుని మూలమిది :

> ఇంద్రజిత్ కృతకర్మాచ పిత్రే కర్మ తదాత్మనః
> నివేద్య పునరాగచ్ఛత్ త్వరయాఽఽజి శిరః ప్రతి.
>
> —ఏకోననవత్యధిక ద్విశతతమోధ్యాయము-16

ఎఱ్ఱనార్యుని యనువాదము :

వ॥ "ఆ రక్కసుండునుం దనచేసిన పౌరుషంబు ప్రతిహతంబగుటకు విస్మయంబంది, మగిడి హోమ కార్యంబును దొడంగ బోయిన నెఱింగి, విభీషణుడు లక్ష్మణుం జూచి "యిన్నిచునకు హోమ సమాప్తి యయ్యెనేని నెవ్వరికిం గెలువ నశక్యంబు; వీని వెన్నడిం దెగటార్పు మనిన నతండు"

—అ. 7 - వచనము 180

ఇది యమూలకమైన యనువాదము. వాల్మీకమునుండి తెచ్చుకొన్న యెఱుపు సొమ్ము. అందీ సందర్భమున ఇంద్రజిత్తు నికుంభి యాగము చేయుటకు పోవును. వాల్మీకి మూలశ్లోకము లివి :

> "చైత్యం నికుంభిలా మద్య ప్రాప్య హోమం కరిష్యతి
> హుతవా న్నుపయాతో హి దేవైరపి సవాసవైః

దురాధర్షో భవత్యేష సంగ్రామే రావణాత్మజః
తేన మోహయతా నూన మేషా మాయా ప్రయోజితా"
—యుద్ధకాండము-84 సర్గ, 14, 15 శ్లోకములు

4. రావణ వధానంతరము రాముడు సీతను పరిగ్రహించుటకు శంకించి నపుడు సీత అగ్ని ప్రవేశము చేయుట వాల్మీకము నందున్నది వ్యాస భారతము నందలి రామోపాఖ్యానమున లేదు. వాల్మీకి ననుసరించి యెఱ్ఱన సీతచేత "నేనన లంబుఁజొచ్చి వెడలెద" అని యనిపించి పిమ్మట వ్యాసుని యనుసరించి అగ్ని ప్రవేశము లేకుండగ దాటవేయించెను. ఇట్టి ఘట్టమున వ్యాస వాల్మీకులను సమన్వయించి చెప్పుట ఎఱ్ఱన చేసిన విశేషము!

5. ఎఱ్ఱన అమూలకాంశములను పొందుపఱచుటలో నవలంబించిన తీరు ఒక్కొక్కచో నొక్కొక విధముగా నుండును. యక్ష ప్రశ్నల ఘట్టములో విష జలమును త్రాగి మూర్ఛబోయిన తమ్ములను చూచి ధర్మజుడు విలపించిన పట్టున వ్రాసిన యీ క్రింది యమూ క పద్యము జీవుని వేదనను చక్కగా వ్యక్తము చేయుచున్నది :

సీ॥ పుత్రులు దుఃఖార్తిఁబొగులుట కనికరంబుఁ
బొక్కుచు నున్న యప్పుణ్య చరిత
మా తల్లి పాండుని మహిషి, నాకెదురుగా
వచ్చి, కౌగిటఁజేర్చి "వత్స, నాఁడు
దమ్ముగుఱ్ఱలు నీవుఁ దగ విపినంబున
కరిగితి; రప్పుడయ్యనుజు లెందు
జనిరి? నీ వొక్కరుండ చనుదెంచి తిదియేమి?
యనిన నాయమతోడ నకట! యేమి

ఆ॥ యనగనేర్చువాఁడ? నాచార్య విదుర శారి
తనయ కృపులు నను ముదంబు తోడ
గుశల మడిగిరేనిఁ గుశల మేమనువాఁడ?
దలుగఁరాని యెడరు దగిలె నాకు

## 6. యథామూలము :

ఎఱ్ఱయగారి యనువాదమునందు మూల విధేయత మిక్కిలిగా కాన్పించును. ధర్మనీతి వేదాంతాది విషయములను ప్రతిపాదించునప్పుడు "వ్యాసముని ప్రణీత పరమార్థము తెల్లము" చేయవలసిన బాధ్యతను గుర్తెరిగినవాడు గాన ఇట్టి ఘట్టములందీ మూల విధేయతను ప్రదర్శించినట్లు గమనింపవచ్చును. ఇది స్థూలముగా ననుకొనవలసిన మాట.

1. చతుర్థాశ్వాస ప్రారంభమున ధర్మజుడు మార్కండేయునితో మేము ధర్మమార్గమున ప్రవర్తించుచున్నప్పటికిని కష్టముల పాలగుటయు, పాప మార్గమున బోవుచున్న ధార్తరాష్ట్రులు సుఖముగా నుండుటకును కారణమేమి? యని కర్మఫలమును గూర్చిన ప్రశ్నలువేయును, దానికి మార్కండేయుడు ఏ విధముగనైనను మానవుడు తన చేసిన సుకృతదుష్కృతముల ఫలము ననుభవింపక తప్పదు. తనువు నశించినను కర్మతతి నశించదు; అని సమాధానము చెప్పుచు మనుష్యులను నాలుగు విధములుగా విభజించిన మూల శ్లోకమిది :

ఇహైవైకస్య నాముత్ర అముత్రైకస్య నో ఇహ
ఇహ చాముత్ర చైకస్య నాముత్రైకస్య నో ఇహ
—త్ర్యశీత్యధిక శతతమోఽధ్యాయము-శ్లోకము 77

అనువాదము : కం॥ ఈ లోకమ యగుఁగొందఱ
కాలోకమ కొందఱకు, నిహంబును బరమున్
మేలగుఁగొందఱ; కధిపా!
యేలోకము లేదు సూవె యిలఁగొందఱకున్
—అ. 4 - పద్యము 174

కొన్నాళ్ల క్రిందట అభినవ తిక్కన, మహాకవి శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారిని కలుసుకొన్నప్పుడు ఎఱ్ఱన కవితావిషయమును గూర్చి ప్రస్తావింపగా వారి నోటనుండి వెలువడిన తొలిపద్యమిది : "కమ్మని పలుకుబడి, ప్రసన్నమైన శైలి. పూజ్యులగు కవిత్రయము వారిలో నొకడు గదా!" అని సెలవిచ్చిరి. అసలు వ్యాసుని మూలమే విచిత్రమైన రచనా శిల్పముతో బుక్కవలె భాసించుచున్నది. దానికేమాత్రము తీసిపోని అనువాదమిది!

2. గంధర్వ రాజగు చిత్రసేనుడు ధర్మరాజునొద్దకు వచ్చి దుర్యోధనుని విడిచిపెట్టిపోవును. అప్పుడు ధర్మజు డాతనికి బుద్ధి చెప్పి పీడ్కొలుపును. ఇందులకు వ్యాసుని మూలము :

మాస్మ తాత ! పునఃకార్షీః ఈదృశం సాహసం క్వచిత్
నహి సాహస కర్తారః సుఖమేధంతి భారత !
స్వస్తిమాన్ సహితః సర్వై ర్భ్రాతృభిః కురునందన !
గృహాన్ వ్రజ యథాకామం వైమనస్యంచ మాకృథాః
—షట్ చత్వారింశ దధిక ద్విశతతమోధ్యాయము-22, 23 శ్లోకములు

అనువాదము :

ఉ॥ ఎన్నడుఁ నిట్టి సాహసము లింక నొనర్పకు మయ్య; దుర్జనుం
డన్నన సాహస క్రియల యందుఁ గడంగి నశించుఁ; గావునన్
గ్రన్నన తమ్ములన్ దొరల గైకొని యిమ్ములఁ బొమ్ము వీటికిన్
సన్నుత ! దీని కొండొక విషాదముఁ బొందకు మీ మనంబునన్
—ఆ. 5 - పద్యము 184

3. వ్యాస మహర్షి, అనవరత వనవాసాయాస కృశదేహులను, అధిక దుఃఖాయమాన హృదయులను తన మనుమలను చూచి వగచి ధర్మజుని యోదార్చి తపో లక్షణములను వివరించిన మూలమిది :

నాసాధ్యం తపసః కించిత్ ఇతి బుద్ధస్వ భారత !
సత్యమార్జవ మక్రోధః సంవిభాగో దమః శమః
అనసూయా విహింసాచ శౌచమింద్రియ సంయమః
పావనాని మహారాజ ! నరాణాం పుణ్య కర్మణామ్
—ఏకోనషష్ట్యధిక ద్విశతతమోఽధ్యాయము-17, 18

అనువాదము : కం॥ క్షమయు, నహింసయు, సత్యము,
సమతయు, నింద్రియజయంబు, శమము, బరిత్యా
గమును దపో లక్షణములు;
గ్రమమున నిన్నియును నూర్ధ్వగతి కారణముల్
—ఆ. 6 - పద్యము 108

"ఊర్ధ్వగతి కారణముల్" అన్న వాక్యము వ్యాస హృదయావిష్కరణ సూచకముగ చేయబడిన చక్కని సమన్వయము.

4. కుంభకర్ణ విభీషణుల తపశ్చర్యను వర్ణించిన వ్యాసుని మూలము :

అథధర్మ్యాయీకుంభ కర్ణోయతాహారో యతవ్రతః
విభీషణః శీర్ణపర్ణ మేకమభ్యవహారయన్
ఉపవాసరతి ర్ధీమాన్ సదా జప్య పరాయణః
తమేవ కాలమాతిష్ఠత్ తీవ్రం తప ఉదారధీః

—పంచసప్తత్యధిక ద్విశత తమోఽధ్యాయము-17, 18

అనువాదము : నియతాహారుఁడు సర్జితేంద్రియుడునై నిష్కంపవృత్తిన్ మహీ
శయనుఁడై వ్రతముల్ చరించెనధికేచ్ఛన్ గుంభకర్ణుండు; ధై
ర్యయుతుండై ఘను డవ్విభీషణుడు పర్ణాహారవృత్తిన్ జపా
ధ్యయనాసక్తిఁదపంబు సేసె మదినత్యంతంబు సంశుద్ధితోన్

—అ. 6 - పద్యము 278

5. సత్యవంతుడు సావిత్రీ సహితుడై వనమునకు పోయిన పట్టున వ్యాసుని మూలము :

ఉభాభ్యా మభ్యనుజ్ఞాతా సా జగామ యశస్వినీ
సహ భర్త్రా హసంతీవ హృదయేన విదూయతా -29

పావనాని విచిత్రాణి రమణీయాని సర్వశః
మయూరగణజుష్టాని దదర్శ విపులేక్షణా -30

నదీః పుణ్యవహాశ్చైవ పుష్పితాంశ్చ నగోత్తమాన్
సత్యవానాహ పశ్యేతి సావిత్రీం మధురం వచః -31

నిరీక్షమాణా భర్తారం సర్వావస్థ మనిందితా
మృతమేవహి భర్తారం కాలే మునివచః స్మరన్ -32

అనువ్రజన్తీ భర్తారం జగామ మృదు గామినీ
ద్విధేవ హృదయం కృత్వా తంచ కాలమవైక్షతీ -33

—షణ్ణవత్యధిక ద్విశతతమోఽధ్యాయము

ప్రబంధ పరమేశ్వరుని యనువాదము :

వ॥ ...... అనుమతించిన నయ్యిరువుర (అత్తమామల) యడుగులంబడి వీడ్కొని. -210

కం॥ చిత్తంబునఁ బైకొనియెడు
నుత్తాల మదఁచుచును, ముఖ పయోరుహమునఁద
ళ్కొత్తెడు వెడనవ్వునఁ బ్రియు
చిత్తంబిగురొత్తఁజనియె జెలువ యడవికిన్ -211

వ॥ ఇట్లు దంపతులు మంద గమనంబున నరిగి పరిసరారణ్యంబు దఱి యం జొచ్చినప్పుడు. -212

సీ॥ కమనీయ కమలినీ కల్లోల వీథులఁ
గదలు రాయంచల గతుల యొప్పు
బహుపుష్ప పల్లవ ప్రకర చిత్రితములై
తనరారు తరు లతాతతుల సొంపు
మకరంద రసపాన మద విలోలంబులై
క్రాలెడి యెల దేఁటి గముల యులివుఁ
బరిపక్వ మంజుల ఫలరసోద్ధతములై
పలుకు రాచిలుకల పటురవంబు

ఆ॥ బ్రియుడు వేఱు వేఱఁ బ్రీతిమైఁజూపుచుఁ
జెప్పుచును జనంగఁజిరురుఁబోడి
గనుచు వినుచు నిర్వికార సల్లాప మిం
పార నతని తెఱగు నరయు చుండె -213

యథామూలముగ చేయబడిన అందమైన యనువాదము. "చిత్తంబున బైకొనియెడు" అన్న కంద పద్యమునందు "హసంతీవ హృదయేన విదూయతా" "ద్విధేవ హృదయం కృత్వా" అన్న వ్యాస వాక్యములందలి భావము చక్కగ ప్రతిబింబించుచున్నది. సీస పద్యమునకు తగిలించిన ఆటవెలది యందలి "నిర్వికార సల్లాపమింపార" అను ఎఱ్ఱనగారి ప్రయోగము, సావిత్రీ హృదయమునందు వలె పాఠకుని హృదయమునందును ఇంపు గలిగించుచు కవి ప్రతిభ

కెత్తిన పతాకవలెనున్నది. పటియలను పూడ్చుట, వంకలు తీర్చుట, బంగలు మెత్తుట వంటి కొద్దిపాటి పనితనముతో మూలమునకు లోబడి యద్భుతమైన పద్యమును సృష్టించినా డెఱ్ఱన!

## శ్రీనాథుని అనుసరణము :

ఇట్లు ఆఱు విధములుగా సాగినది శంభుదాసుని యనువాదము. ఎన్ని విధములు పాటించినను అలను కొలనులో గలగలమన్నట్లు ఒక పరిధికి లోబడిన చిఱుత పొంగులతోను, లోలోన తిరుగుడు పడు సుడులతోను ఒప్పుచుండునే గాని, పడిలేచే కడలి తరంగములవంటి యనువాదము కాదీతనిది. అది తిక్కన గారి పద్ధతి. ఈ విషయమున నీతడు తిక్కనకు కొంతదూరము. నన్నయకు కొంత దగ్గర. వ్యాసునకు మఱింత దగ్గర. నన్నయ తిక్కనలతో పోల్చుకొన్నప్పుడు తన స్థానమేదియో గుర్తెఱింగిన వాడెఱ్ఱన. ఆ పరిజ్ఞానముతో ఒద్దికగా వ్యవహరించునాడనుట సమంజసము. అనంతర కవులలో అనువాద విషయమున ఎఱ్ఱన మార్గమును త్రొక్కిన తొలికవి శ్రీనాథుడు. ఈతనితో కావ్యానువాద యుగము ప్రారంభమైనది. ఈ యుగమున తలమానికమైనది శృంగార నైషధము. ఇందు శ్రీనాథుడు సూచించిన తన యనువాద సూత్రములు ఎఱ్ఱయనుండి గ్రహించినవనుటలో విప్రతిపత్తిలేదు. వ్యాసభారతము వంటి పురాణ ఫక్కికి చెందిన గ్రంథమును కావ్యముగ సంతరింపదలచిన కవిత్రయము వారిలో నొక పరిణామక్రమములో ఎఱ్ఱయ కడగల మూలమునకు సన్నిహితముగ నుండుట, కావ్య లక్షణములు మిక్కిలిగా నుండుట యన్న రెండంశములు కావ్యానువాదమునకు పూనుకొన్న శ్రీనాథునకు ఒజ్జబంతులుగా నుండుట తప్పనిసరి. ఇట్లు ఎఱ్ఱనగారి యనువాద విధానము తెలుగు సాహిత్యమున నొక మలుపులో నున్నది. ఇది యాతని యనువాద కళాశిల్పము.

# ఎఱ్ఱన హరిహరతత్త్వము

కు॥ గిరిశ పదభక్తి రస త
త్పర భావము కలిమి శంభుదాసుండన గాఁ
బరగియు గోవింద గుణా
దర సంభృత సౌమనస్య ధన్యుఁడవెందున్
—నృసింహ పురాణము - అవతారిక 18

తాత ఎఱపోతసూరి ఎఱ్ఱన్నను ప్రశంసించిన పద్యమిది; దీనిని బట్టి యెఱ్ఱన హరిహరాద్వైత భక్తి గలవాడనుట స్పష్టము.

ఎఱ్ఱన హరిహరనాథభక్తి హరివంశమున కొంత పురివిప్పుకొన్నది. శివుడు సపరివారుడై శ్రీకృష్ణుని గానవచ్చును. అప్పుడు సన్నిహితులై యున్న హరిహరులను చూపరులు చూసిన విధమును ఎఱ్ఱన మనోజ్ఞముగా వర్ణించెను :

కు॥ హరిఁజూతురు హరుఁజూతురు
హరిఁజూతురు గ్రమ్మరంగ హరుఁజూతురు ని
ర్జరులను మునులను నిమ్మెయి
హరిహరతత్త్వయుగ విస్మితాలోకనులై
—ఉత్తర - ఆ. 6-39

వ॥ అందఱు నయ్యిరువురకుం బ్రణామంబులు సేసి యంజలి పుటంబులు ఘటియించి :

సీ॥ యజ్ఞరక్షకుఁడును యజ్ఞ విధ్వంసియు
నై లోక నుతుల బెంపారు వారు
కందర్ప జనకుండు గందర్ప దర్పైక
దమనుండు నై లీల దనరు వారు
భువన సంభర్తయు భువన సంహర్తయు
నన నాత్మగుణ కృత్యులైన వారు

భూధరోద్ధారియు భూధరా వాసియు
నగుట నిత్య ప్రీతి నెగడు వారు

తే॥ విషధి జాతంబులగు రత్నవిషము లురము
గప్పు కంఠంబు గై సేయనొప్పు వారు
భుజగ శయనుండు భుజగ విభూషణుండు
నెపుడు గరుణతో వరదులయ్యెదరు మాకు -41

క॥ ఈ రెండు మూర్తులును నిం
పారగ నిటు గదిసియుండ నంతఃకరణం
బారాధింపం గనియెడు,
ప్రారంభములెల్ల ప్రాప్త ఫలముల మాకున్ -42

## వేంకటనాథుడే తిక్కన హరిహరనాథుడు :

తిక్కనగారు ప్రతిపాదించి ప్రచారమునకు తెచ్చిన యీ హరిహర తత్త్వము ఎఱ్ఱన, నాచన సోమన, ఖైచరాజు వేంకటనాథుడు, దూబగుంట నారాయణకవి, కొఱవి గోపరాజు మొదలగు నెందరో కవులను ఆకర్షించినది. ఎఱ్ఱన దప్ప దాదాపు ఈ తక్కిన కవులందరూ తమ తమ గ్రంథములను హరిహర నాథాంకితము చేసినవారే. ఇంత మంది కవులను తనవైపు నాకర్షించుకొనిన యీ తిక్కనగారి హరిహర నాథుడెవరు? అన్నది విచికిత్స. కొందఱు నెల్లూరులో నొక హరిహర నాథాలయముండెననియు నా దేవునకే తిక్కన తన భారతము నంకితమిచ్చెననియు భావించిరి. మఱికొందఱు నెల్లూరులో నట్టి దేవాలయము లేదనియు అట్టి దేవుని. "అంతస్సన్నిధిం గలిగించుకొని" భారతమును రచించి తదంకితము చేసెననియు నభిప్రాయపడిరి. పరిశోధించి చూడగా నీ రెండును సరిగాదనియు తిరుమల వేంకటనాథుడే తిక్కనగారి హరిహరనాథుడనియు తేలుచున్నది. ఈ పరిశోధనా సారాంశము సంగ్రహముగ నిట పొందుపఱుపబడుచున్నది :

"తిక్కన తన భారతమును అంకితమిచ్చిన హరిహరనాథుడు తిరుమల వేంకటనాథుడే! అప్పటికి నెల్లూరులో హరిహరనాథాలయము లేదు. 7వ శతాబ్దిలో పేయళ్వారులు ఒక పాశురములో వేంకటనాథుని హరిహరమూర్తిగా

వర్ణించిరి ;[1] అంతకుముందు స్వామి స్వరూపమెట్లుండెనో తెలియరాదు. 8వ శతాబ్దిలో శ్రీ శంకరులు స్తుతించిన ఒక పాఠాంతర శ్లోకమును బట్టి వేంకటేశ్వరుడు శివస్వరూపుడు! ఇట్లుండ, అసలామూర్తి 'బాలా' అను స్త్రీ బింబమని కొందరు, కుమారస్వామియని మరికొందఱు భావించుచుండిరి. 11 వ శతాబ్దమున శివుడా, విష్ణువా అన్న తగాదా మఱింత ప్రబలినది. భగవద్రామానుజులు రాజప్రాబల్యముతో స్వామిని విష్ణువుగా మార్పించినట్లు కొంతంత సాక్ష్యము గ్రంథస్థమై యున్నది. తిక్కన "శ్రీయన గౌరినాబరగు" అన్న పద్యములో స్వామి పూర్వ చరిత్రను పుక్కిటబట్టెను.

నృసింహ పురాణములో "వేంకటాచలము" యొక్క ప్రసిద్ధి పేర్కొనబడినది. కాగా తిక్కన నాటికిది సుప్రసిద్ధ క్షేత్రమనుట స్పష్టము. మనుమసిద్ధి తండ్రి తాతలు పాలించిన కాలమున తిరుమల నెల్లూరు తెలుగుచోళ రాజ్యములో నుండి నట్లూహింపబడుచున్నది. తిక్కన తిరుమల స్వామిని పలుమాఱులు సేవించినాడనుట నిక్కము.

తిక్కనగారి "కిమస్థిమాలాం" శ్లోకము పేయాళ్వారుల వేంకటనాథ పాశురమునకు ప్రతిబింబముగ నున్నది. కావుననిది వేంకటనాథుని సంబోధించి చెప్పినదే కావలయును. స్వామిపై పదిమంది యాళ్వారులు కలిపి చెప్పిన 200 పైచిలుకు వేంకటనాథ పాశురములకు, తిక్కనగారి 200 హరిహరనాథ పద్యములకు ఎన్నో పోలికలున్నవి. అందలి భావములే కొన్ని యిందున్నవి. ఆళ్వారుల వర్ణనలలో స్వామి చక్రమున కిచ్చిన ప్రాధాన్యమును శంఖమున కిచ్చినట్లు కానరాదు. తిక్కన చక్రమునే గాని శంఖమును బొత్తిగా వర్ణించలేదు ఆళ్వారుల "దివ్యప్రబంధములను" దృష్టియందుంచుకొని తిక్కన "పుణ్యప్రబంధములు" అని ప్రయోగించెను. ద్రోణ పర్వమునందలి యర్జున స్వప్న వృత్తాంతమే అచ్చు విరాట పర్వమునందలి తిక్కన స్వప్నవృత్తాంతము. తిక్కనకు కలలో కాన్పించినది వేంకటనాథుడే. కరుడుగట్టిన వేంకటేశ్వరభక్తుడగు బైచరాజు

---

1. "తాయశడైయుమ్ పీణ్ముడియు మొణ్మయవుమ్ శక్కరముమ్। శూయరవు మొన్నాణున్తోన్నుమాల్ - శూయ! తిరణ్డరవిపాయుమ్ తిరుమలై మేలెన్దైక్కు। ఇరణ్డురువు మొన్డాయిశైన్దు"-పాశురము - 63. మూణ్డాం తిరువన్దాది. మూధవ ఆయిరం, నాలాయిర ప్రబంధము.

వేంకటనాథుడే తన పంచతంత్రమును హరిహరనాథాంకితము చేసెననగా వేంకట నాథాంకితము చేసెననియే యర్థము. ఇంకెన్నియో ఉపపత్తులను బట్టి తిరుమల వేంకటనాథుడే తిక్కనగారి హరిహరనాథుడనుట నిష్కర్ష."

## వేంకటనాథతత్త్వమే ఎఱ్ఱన హరిహరనాథ తత్త్వము:

ఈ రహస్యము తెలిసినవారు, ఎఱ్ఱన, సోమన, వేంకటనాథుడు. ఈ ముగ్గురు మాత్రమే! వీరు వ్రాసిన కొన్ని పద్యముల ధోరణిని బట్టి యీ నిర్ణయ మునకు రావచ్చును. తక్కిన కవులకు బొత్తిగా తెలియదు. కాని గతానుగతిక ముగా తమ తమ గ్రంథములను హరిహరనాథున కంకితమిచ్చిరి. ఎఱ్ఱనకు తన ప్రబంధములను అంకితమిచ్చుటకు నవకాశము చిక్కలేదు.

తెలుగు సాహిత్యమున వేంకటేశ్వరులను కంఠోక్తిగ ప్రశంసించిన తొలి గ్రంథము ఎఱ్ఱన నృసింహపురాణమే. ప్రథమాశ్వాసమున గాలవ మహర్షి చేసిన తీర్థయాత్రలో "వేంకటాచల స్థాయి గొలిచె" (పద్యము-11). అని వేంకటా చలముగూడ చేర్చబడినది. ఈ పద్యము క్రిందనే "ఇట్లు పరిపాటిం బ్రసిద్ధంబులగు తీర్థంబులాడుచు మఱియు" (వచనము-12) అని వ్రాయబడినది. ఇది తిక్కన గారి హరిహరనాథుని దృష్టిలో పెట్టుకొని వ్రాసినదేయని భావింపవలయును. నృసింహ పురాణములోని "గిరిశ పదభక్తి" అను పద్యమునందలి "గిరిశ" శబ్దమునకు గిరియందు నివసించువాడు. (శివుడు) అనగా ఎగువ తిరుపతి యందు నివశించు వేంకటేశ్వరుడనియు, "గోవింద" శబ్దమునకు దిగువ తిరుపతియందు వేంచేసియున్న గోవిందరాజస్వామి యనియు నర్థము చెప్పనొప్పను. ఎఱ్ఱన ఈ యర్థమునే భావించినాడనుట నిక్కము. ఎఱ్ఱన్న నాటికి వేంకటనాథుడు విష్ణుస్వరూ పుడై యున్నను తిరుమలేశుని యొక్క పూర్వచరిత్రను బట్టి యీ యర్థమును చెప్పుటలో విప్రతిపత్తి యుండరాదు. ఇట్లు పరిశోధించి చూడగా తిరుమల వేంకటనాథుడే తిక్కనగారి హరిహరనాథుడని తేలుచున్నది. ఈ రహస్యము ఎఱ్ఱన్నకు తెలియును. కావున ఎఱ్ఱన హరిహరనాథ తత్త్వము కూడ వేంకటనాథ తత్త్వమేయని భావించుట లెస్స!

## గమనిక :

తిక్కన ఎఱ్ఱనలు అర్చించిన తిరుమల వేంకటనాథ నిష్ఠమగు ఈ హరి హరనాథ తత్త్వమును గూర్చి కూలంకషముగ అధ్యయనము చేయగోరు జిజ్ఞాసువులు ఈ గ్రంథ రచయిత డా॥ ఓగేటి అచ్యుతరామశాస్త్రి వ్రాసిన "ఓగేటి వ్యాసపీఠి" అను గ్రంథమును చదువుదురుగాక. ఇది 1986 డిసెంబరులో ప్రచురింపబడిన గ్రంథము. ఇందులో మొత్తము వ్యాసములు 24 గలవు. వీనిలో హరిహరనాథ తత్త్వమును గూర్చి 8 శీర్షికల క్రింద విభజింపబడిన 108 పుటల ప్రత్యేక వ్యాసములు గలవు. ఆ వివరములివి :-

1. తిరుపతి వేంకటేశ్వరుడే తిక్కనగారి హరిహరనాథుడా ! 2. తిరుమల వేంకటనాథుడే తిక్కనగారి హరిహరనాథుడు !, 3. వేంకటేశ్వర తత్త్వమే తిక్కన హరిహరనాథతత్త్వము, 4. తమిళ తెలుగు వాఙ్మయములు - సప్తగిరి హరిహరనాథుడు, 5. ఆళ్వారులు - తిక్కన వర్ణించిన సప్తగిరి హరిహరనాథ సౌందర్యలహరి, 6. నిర్వచనోత్తర పీఠిక - తిక్కన తిరుపతుల సమకాలీన చరిత్ర, 7. తిక్కన ఉభయకవి మిత్రత్వము - హరిహరనాథ పద్యములు, 8. విదేశ, దేశ, ఆంధ్రప్రదేశ, హైదరాబాదు నగరములలో హరిహరనాథాలయములు.

ఈ వ్యాసములన్నియు 1978-1986 మధ్య, ఈ ఎనిమిదేండ్లలో వివిధ సాహిత్య పత్రికలలో ప్రచురింపబడినవి కొన్ని, విద్వద్గోష్ఠులలో చదువబడినవి కొన్ని గలవు. పిమ్మట "ఓగేటి వ్యాసపీఠి" రూపమున వెలువరింపబడినవి. ఈ వ్యాసములన్నింటి యొక్క సారసంగ్రహ రూపమే దిఙ్మాత్రముగ నిట ప్రస్తుతింపబడినది. ఈ తత్త్వము యొక్క విరాట్స్వరూపమును సాక్షాత్కరింపజేసికొనుటకు "ఓగేటి వ్యాసపీఠిని" తప్పక చదువగలరని మనవి చేయటమైనది.



# ఎఱ్ఱన మహా వ్యక్తిత్వము

ప్రాచీనాంధ్ర మహాకవులలోకెల్ల మిక్కిలి యదృష్టవంతు డెఱ్ఱనార్యుడు. అరణ్య పర్వ శేష హరివంశ రచనలతో నాంధ్ర మహాభారతమునకును, పూర్వ రామాయణ రచనతో తిక్కన నిర్వచనోత్తర రామాయణమునకును సమగ్రతను సమకూర్చుటయేగాక, నృసింహపురాణ రచనతో ప్రబంధ ప్రక్రియకు శ్రీకారము చుట్టి తెలుగు సాహిత్యమున కొక పరిపూర్ణతను, క్రొత్త మలుపును సంతరించిన మహనీయు డాతడు!

ఎఱ్ఱన పేరును తలచినంతనే ఆతని చుట్టును మహాకవు లనేకులు కాన్పింతురు. అరణ్యపర్వ శేష పూరణ సంబంధమువలన నన్నయ తిక్కనలు, హరి వంశ రచనా సంబంధమున నాచన సోమన, నృసింహ హరి వంశములను తన భాగవతములో ననుసరించుట వలన పోతన, నృసింహ పురాణ విషయక ప్రబంధ ప్రక్రియా విచార చర్చలో నన్నెచోడ పెద్దన్నలు, రెడ్డిరాజుల యాస్థాన కవిగా తనకు వారసుడైన శ్రీనాథుడు - ఇది వరుస! తెలుగు కవులలో నిట్లు తనకు ప్రాచీనులతోను, అర్వాచీనులతోను, విడదీయరాని విచిత్ర సంబంధము గల మహాకవి ఎఱ్ఱనార్యుడొక్కడే కనబడుచున్నాడు! ఆంధ్ర సాహిత్య రంగమున జరిగిన నాలుగు స్తంభముల యాటలో ఈ మహాకవులందరు తలకొక దిక్కున నిలుచుండ, రంగ మధ్యమున నెఱ్ఱన మేటియాట గాని వలె మెఱయుచున్న సుందరమైన దృశ్యము కండ్లకు గట్టును!

## ఆంధ్రదేశ చరిత్రలో ఎఱ్ఱన నిర్వహించిన పాత్ర :

ఆంధ్రదేశ చరిత్రలో నెఱ్ఱన నిర్వహించిన పాత్ర సాటిలేనిది. నన్నయ నాటికి దేశము శాంతముగ నున్నదని చెప్పవచ్చును. తిక్కన నాటికి శైవవైష్ణవ మత విద్వేషములు చెలరేగినవి. వానిని హరిహరాద్వైత తత్త్వ ప్రతిపాదనతో ప్రసన్నము గావించిన మహనీయుడు తిక్కన. ఎఱ్ఱన నాటి పరిస్థితి దీనికి పూర్తిగా భిన్నమైనది; భీకరమైనది! క్రీ. శ. 1323 ప్రాంతమున ఢిల్లీ సుల్తానగు ఘియాసుద్దీన్ నాయకత్వమున తురుష్క సేనలు ఆంధ్రదేశము నాక్రమించి

ప్రళయమును సృష్టించినవి. దాని నరికట్టుటకు విప్లవ యజ్ఞముచేసిన తెలుగు పీరులు ముసునూరి ప్రోలయ నాయకుడు, కాపయ నాయకుడు వేమారెడ్డి ఈతని సహోదరుడు మల్లారెడ్డి ప్రభృతులు. వేమారెడ్డి అద్దంకి రాజధానిగ తెలుగు రాజ్యమును స్థాపించి దేశమును ధర్మమును కాపాడిన మహనీయుడు. ఈతని ఆస్థానకవియే మన మహాకవి. ఆనాడు జరిగిన విధ్వంసకాండను కండ్లార చూసినవాడెఱ్ఱన. అది యాతని హృదయముపై చెఱగని ముద్ర వేసినది. అప్పటికాతని వయస్సు ఇరువదియైదేండ్లుండును. ఒకవైపున ప్రభువులు ఖడ్గశక్తితో దేశమును రక్షించుచుండ మఱియొకవైపున గంటము చేతబూని వాఙ్మయ మహాధ్వరము గావించి ధర్మమును ప్రతిష్ఠించుటలో ప్రభువులకు బాసటగా నిలిచినవాడెఱ్ఱన. తొలుత కలిధ్వంసకమగు రామాయణమును రచించెను. పిమ్మట అరణ్యపర్వమును పూరించెను. తరువాతి ప్రబంధములు నృసింహ హరివంశములు. అరణ్యపర్వ శేషమునందును, హరివంశము నందును వచ్చు కలియుగ ధర్మములను వర్ణించునప్పుడు అతడు వ్రాసిన కొన్ని పద్యములు ఆనాటి దేశపరిస్థితులకు నద్దము పట్టుచు అతని హృదయావేదనను ఆవిష్కరించుచున్నవి. ఈ పద్యమునుచూడుడు :

> వివిధ వ్యాఘ్ర మృగోరగాకులములై విస్తీర్ణ శూన్యాటవీ
> నివహాభీలములై యరాజకములై నిర్మూల ధర్మంబులై
> ద్రవిళాభీర తురుష్క బర్బర పుళింద వ్యాప్తి దుష్టంబులై
> భువిలో నెల్లెడ బొదగున్ జనపదంబుల్ దస్యుగాంతంబునన్.

(అ - 4 పద్యం 290)

ఇందలి తురుష్క శబ్దము వ్యాస భారతమునలేదు; ఉండుటకు వీలులేదు. ఎఱ్ఱన దీనిని ప్రయోగించి ఆనాటి భీషణ పరిస్థితులను కండ్లకు కట్టించుచున్నాడన్నమాట. అప్పటి విలసశాసనమున వర్ణింపబడిన భీకర పరిస్థితులకు ఈ పద్యము ప్రతిబింబమని చెప్పవలెను. ఈ విషయమును గూర్చి ఈ గ్రంథమునందలి 35వ పుటలో గూడ కొంత ప్రస్తావింపబడినది; చూడగలరు. ఎఱ్ఱన సామాజిక స్పృహ గలిగిన ఆధ్యాత్మిక జాతీయ మహాకవి !

## ఎఱ్ఱన సుగుణ సంపద :

ఎఱ్ఱన ప్రబంధములలో నాతని సుగుణ సంపదను స్తుతించు పద్యములు కొన్ని గలవు. రెండు మూడు ఉదాహరింపబడుచున్నవి :

ఎఱ్ఱన తపసు గూర్చి తాను చెప్పికొన్న పద్యము -

సీ॥ గుడ్డూరు నెలవుగ గుణ గరిష్ఠత నొప్పు
ధన్యుడు ధర్మైక తత్పరాత్ము
డెఱ్ఱనార్యుండు .... .... .... ....

—అరణ్య. ఆ - 7 - 469

తాత ఎఱపోత సూరి మనుమని ప్రశంసించిన పద్యము -

క॥ గురుభజన పరాయణుడవు
సరస బహు పురాణ ధర్మశాస్త్ర కథా వి
స్తర వేదవి వినయోదయ
భరితు డవతులానుభావ భవ్యుడవెందున్

—నృసింహ పురాణము - ఆ 1-19

వేమారెడ్డి ఎఱ్ఱన్నను కీర్తించిన పద్యము -

తే॥ సకల భాషాకవిత్వ విశారదుడవు
సాధు సమ్మతుడవు నిత్య సౌమ్యమతివి
భవ్యుడవు గాన నీ మీద బరగ బక్ష
మేను గలిగియుండుదు నెప్పు డెఱ్ఱనార్య

—హరి - అవతారిక - 39

## ఎఱ్ఱన జీవన విధానము :

అరణ్యపర్వ శేషము నందలి కొన్ని ఘట్టములలో కథా సందర్భమును బట్టి వ్రాయబడిన ఆయా పద్యములు ఎఱ్ఱనార్యుని వ్యక్తిత్వ గరిమకు సూచకము లుగ నున్నట్లు భావింపవచ్చును.

ధుంధుడను రాకుమారుని చేత మృతుడైన బాలకుడు తార్క్ష్యమహాముని ప్రభావముచేత పునరుజ్జీవితుడగును అది చూచి ఆశ్చర్యచకితులైన హైహయులు ఈ ప్రభావమునకు కారణమేమని ప్రశ్నింప నాముని ఇట్లు చెప్పెను :

శా॥ ఆలస్యంబొక యింత లేదు. శుచి యాహారంబు నిత్యక్రియా
జాలం బేమఱ మర్చనీయు లతిథుల్ సత్యంబ పల్కంబడున్

మేలౌ శాంతియు బ్రహ్మచర్యమును నెమ్మిం దాల్చి మిట్లొటనె
క్కాలంబుం బట్టు మృత్యురోగ భయ శంకంబొంద మేమెప్పుడున్
—అరణ్య. ఆ. 4-191

ఇది యెఱ్ఱనార్యుని నిత్యసత్య పవిత్ర నిర్భయ జీవన విధానమును స్ఫురింపించుచున్నదని భావింపవచ్చును.

## ఎఱ్ఱనార్యుని సాత్త్వికత :

ధర్మవ్యాధుడు కౌశికునకు త్రిగుణ స్వరూపముల నిట్లు చెప్పును :

క॥ అతి నిందితము తమోగుణ
మతి మోహభయంబు, సత్త్వమనయంబు బ్రకా
శత నొప్పు, నుభయ గుణ మి
శ్రత బరగు రజోగుణంబు సన్నుత చరితా!
—ఆ. 5-96

సాత్త్వికుని యొక్క వర్తనమును గూర్చి యిట్లు వక్కాణించును :

చ॥ అనఘుఁడు సాత్త్వికుండగు మహాత్ముఁడు బోధ నిరూఢి సర్వముం
గను గొని లోక వృత్తములుగావని రోసి, సమస్త సంగ భం
గ నిరతుడై తొఱంగు మమకార వికార మహం క్రియాచ్యుతిం
బను పడి సంయమ ప్రకట భావన నుత్తమ శాంతిగైకొనున్
—ఆ. 5-98

సత్త్వగుణమునకు సంయమ ప్రకట భావన ముఖ్యమట, అది కలవైనచో-

తే॥ ఇంద్రియంబులు దివిచిన యెడక పాఱు
చుండు మనసెప్డుఁ దద్వేగముడుప కున్న
నెడలి చెడిపోవు బుద్ధి యుదీర్ణ పవన
హతి బయోధి లోఁగల మవియునట్లు —ఆ. 5-98

అని వివరించెను.

కి. శే కాటూరి వేంకటేశ్వరరావుగారు ఈ పద్యముల నుదాహరించి యివి శంభుదాసుని సాత్త్వికతను స్ఫుటీకరించుచున్నవనియు, అతని కవితయు

సంయమ ప్రధానమైనదనియు, ఇందుల కాతని యావద్గ్రంథము సాక్ష్యమిచ్చు చున్నదనియు నుడివిరి.[1]

## విజ్ఞానానంద దీక్షానామము :

శ్రీ. శే. నోరి నరసింహశాస్త్రిగారు "స్ఫురదరుణాంశు రాగరుచి" అను అరణ్యపర్వ శేషము నందలి తొలి పద్యములోని "అరుణ" శబ్దమును గూర్చి యిట్లు సెలవిచ్చిరి :

"అరుణం అంటే ఎఱుపు. ఎఱ్ఱయగారీ పద్యంలో తమ పేరును, తాము తలపెట్టిన పనిని స్ఫురింపజేస్తున్నారు.[2]

వారు మఱియు నిట్లు చెప్పిరి :

"ఎఱ్ఱయ విజ్ఞాన శబ్దం ఎక్కువగా ప్రయోగిస్తాడు. "విజ్ఞానా నంద" "ఆతని" దీక్షానామం కావచ్చు."[3]

ఈ దీక్షానామము సన్యాసము స్వీకరించువారు పెట్టుకొను పేరు వలె స్ఫురించుచున్నది దీనినిబట్టి యెఱ్ఱయ సన్యాసమును స్వీకరించి అరణ్యపర్వ శేషమును పూరించి యుండునా! అను నూహ బొడముచున్నది! ఈ ఊహ సరియైన దైనచో నెఱ్ఱన్నను బోలిన మహనీయుడు తెలుగు కవులలో మఱొకడు లేడని నిష్కర్షగా చెప్పవచ్చును.

ఇప్పటికి చెప్పిన విషయములన్నియు సమన్వయించి యెఱ్ఱన వ్యక్తిత్వము నిట్లు దర్శింపవచ్చును :

బాల సూర్య ప్రభాకలితమై యొప్పు దేహకాంతి గలవాడు. సమవిభ క్తాంగుడు. ఆకార సదృశమైన ప్రజ్ఞ, ప్రజ్ఞతో సదృశమైన ఆగమము గలవాడు.

---

1. "సాహిత్య దర్శనము - వ్యాసావళి" ప్రచురణ 1967
2. "విజ్ఞాన సర్వస్వము" 3వ సంపుటము, పుట. 785
3. "తెలుగు చరిత్రకు కావ్యత్వం కల్పించిన నవలాశిల్పి నరసింహశాస్త్రి" "ముఖాముఖి" సంభాషణ వ్యాసము, రచయిత ఓగేటి అచ్యుతరామశాస్త్రి ఆంధ్రప్రభ, దినపత్రిక, నవంబరు 3, గురువారం-1977.

నిత్యసత్య పవిత్ర జీవనుడు. సత్త్వగుణ సంపన్నుడు. యోగి పుంగవుడు. ఆధ్యాత్మిక జాతీయ మహాకవి !

## కవిత్రయము వారి భావసమైక్యత :

మూర్తిత్రయము స్థూలదృష్టికి భిన్న రూపులుగ గోచరించినను సూక్ష్మ దృష్టికి వారి తత్త్వ మొక్కటే యని వెదాంతవిదుల నిరూపణ. అట్లే కవిత్రయము వారు భిన్నులుగ కాన్పించినను వారి కవితాత్మ తత్త్వ మొక్కటే యని కవితా తత్త్వవిదుల నిష్కర్ష. ఈ విషయ నిరూపణకు ఎన్నియో ఉదాహరణలను పేర్కొనవచ్చును. ఒక్కటి మాత్రము ప్రస్తుతింతము :

నన్నయ పద్యము :

క॥ మనమునకు బ్రియంబును హిత
మును బథ్యము తథ్యమును నమోఘము మధురం
బును బరిమితమును నగు పలు
కొన రగ బలుకునది ధర్మయుతముగ సభలన్

—ఆదిపర్వము - ఆ. 3-205

యయాతి ఇంద్రుల సంభాషణ ఘట్టమిది. నీ కొడుకు పూరుని రాజ్యాభిషిక్తుని చేసినప్పుడు అతనికి నీవు బోధించినదేమి యని ఇంద్రుడు యయాతిని ప్రశ్నించెను. యయాతి తాను బోధించిన నీతులివియని చెప్పెను. వానిలో నొక పద్యమిది !

తిక్కన పద్యము :

క॥ శ్రోతకు దనకుం బ్రియమగు
నేతెఱువున నట్టి మెయి సమీరితమైనం
జో తగు వాక్యంబది నృప
సూతీ ! పెఱపలుకు బాలిశుం చొప్పరయన్

—శాంతిపర్వము - ఆ. 3-190

భీష్ముడు ధర్మరాజునకు చెప్పిన జనకసులభా సంవాద ఘట్టమిది. జనకుడు సులభను సరకుసేయక పలికిన వాక్యవైదగ్ధ్యమునకు మెచ్చుకొని ఆమె

జనకునితో పలుకు పద్యమిది !

ఎఱ్ఱన పద్యము :

ఆ॥ కలయ నరలు వచ్చి తల తెల్లనై నంత
జేసి యెట్లు నీకు జేరు నెఱుక?
జ్ఞాన వృద్ధు డైన వాని మాటలు గదా
సభల జెల్లు నార్యజనుల కెక్క

—అరణ్యపర్వ శేషము - ఆ. 4-201

మార్కండేయుడు ధర్మరాజునకు చెప్పిన అత్రి గౌతమ సంవాద ఘట్ట మిది. అత్రి, వైన్యుని అదే పనిగ పొగడుచుండెను ఒక మానవుని అట్లు పొగడుట తగదని గౌతముడు ఆతనిని మందలించెను. అత్రి తన చర్యను సమర్థించు కొనుచు గౌతముని యాక్షేపించెను. గౌతముడు అత్రిని ప్రతియాక్షేపణ చేయుచు పలికిన పద్యమిది !

నన్నయ తిక్కనల పద్యములు కందములు. ఇచ్చటి కథా సందర్భము లను బట్టి ప్రశాంతముగ సాగిపోవు ఆయా పాత్రల సంభాషణలకు తగినట్లు కందములు సరిపడినవి. ఎఱ్ఱన పద్యము ఆటవెలది. ఇట గౌతముడు కొంత కోపముతో చిందులు త్రొక్కుచు అత్రిని యాక్షేపించును. దానికనుగుణముగ నిది యాటవెలదిలో నుండుట సమర్థనీయము. ఇట్లు ఆయా కథల సందర్భము లను బట్టి యీ మూడు పద్యములలో కొంత భేదమున్నను "సభలో నెట్లు పలుక వలెను" అను ప్రశ్నకు వీనినుండి సమాధానము లభించుచున్నది.

అదొక సభలో నుపన్యాసము కావచ్చును; ఇరువురి సంభాషణ క్రమము కావచ్చును. పండితుల వాక్కలహమే కావచ్చును. దానిని నిర్వహించు తీరొక టుండును. ఒక్క మాటలాడుటకే గాదు; వ్రాయు తీరునకు గూడ నిది సంకేత ముగ గ్రహింపవచ్చును. అట్టి తీరుతెన్నులకు మార్గ నిర్దేశక సూత్రములీ పద్య ములు. మనకు శిరోధార్యములు.

ఒకరి వెంట నొకరుగ చక్కని క్రమశిక్షణతో ప్రయనించిన కవిత్రయము వారు అట్లు పలికిరి; అట్లు వ్రాసిరి! ఈ భాషా సంస్కృతుల కొక ఘంటాపథమును నిర్మించిరి! మన యదృష్టమును పండించిరి! ఏకాత్మలగు నా మహనీయులకు, అందు చిన్నవాడైనను చెన్నుమీఱిన "స్ఫురదరుణునకు" మంగళ నీరాజనములు!

ఉ॥ భారత కావ్యహారమొక భాగము నన్నయ భట్టొనర్చె ము
క్తా రమణీయ వాక్యములఁ దక్కిన భాగము సోమయాజి సొం
పారనొనర్చె, రెండుఁగలయన్ శివదాసుఁడు మధ్య నాయక
శ్రీ రచియించె శారద ధరింపఁ గవిత్రయ కీర్తి మించగన్



# ఉపసంహృతి

ఎఱ్ఱనార్యుని ప్రతిభా ప్రభా నిష్యందమైన రసధుని అరణ్యపర్వ శేషము. ఆ స్ఫురదరుణుడు జాలు వార్చిన రాగరుచుల వేడి సుధలు తెలుగుతల్లి నభిషే కించి ధ్వన్యత్వమొందినవి!

ఎఱ్ఱయ నిజ, సామాజిక, సాహిత్య, ఆధ్యాత్మిక జీవనతత్త్వము లభిన్న ములు. ఏక రసరంజితమైన విచిత్ర దివ్యశక్తి సంపుటీకరణ మది. దానిని దర్శించుట మహాప్రతిభావంతునకుగాని సాధ్యము కాని విషయము. అట్లయ్యును ఆ బాల్యము ఆతని కవితాప్రాణ సారముతో హృదయమును తడుపుకొనుచున్న నేను "కతిపయాక్షర పరిగ్రహ జనిత నైసర్గిక చాపలము కతమున" ఈ ప్రయ త్నమునకు సాహసించితిని!

అరణ్యపర్వ శేష రచనకు సంబంధించి యిప్పటివఱకు అపరిష్కృత ములై యున్న యంశములకు పరిష్కారము సూచించితిని. ఆతనికి గల బిరు దములన్నియు అరణ్యపర్వ శేష రచనములో నెట్లు సార్థకమైనవో నూతన దృక్పథముతో స్థాపించుటకు ప్రయత్నించితిని. అనువాదములో వ్యాసముని ప్రణీత పరమార్థమును ఆతడు తెల్లము జేసిన విధమును వెలార్చితిని. ఆతని హరి హరతత్త్వమేదో కనిపెట్టితిని. ఇదంతయు నొక యెత్తు!

అగాధమైన ఆతని కవితాతత్త్వమున గుప్తమైయున్న చిత్రకవిత్వ వాగ్వి భవము, శబ్దవైచిత్రి, సూక్తి వైచిత్రి, చంపూశిల్ప వైచిత్రీ విశేషములను క్రొత్తగా నన్వేషించి యథాశక్తి వెల్లడించుటకు ప్రయత్నించితిని, యిదొక యెత్తు!

ఈ రెండు విధముల ప్రయత్నము యొక్క సామంజస్యమునకు సాఫల్య మునకు రసజ్ఞులైన విద్వాంసులే ప్రమాణము!



# ఉపయుక్త గ్రంథసూచి

## తెలుగు పద్యకావ్యములు :


| | | |
|---|---|---|
| 1. | ఆంధ్ర మహాభారతము<br>సంపుటము-2<br>సంశోధిత ముద్రణము | ఉస్మానియా విశ్వవిద్యాలయము, 1969 |
| 2. | ఆది సభా పర్వములు | వావిళ్ల ప్రతి 1962 |
| 3. | ఆరణ్య పర్వము | ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి,<br>హైదరాబాదు, జనవరి, 1971 |
| 4. | ఎఱ్ఱాప్రెగడ రామాయణము | హరివంశము, వావిళ్ల ప్రతి, 1967<br>ఇందు పొందుపఱుపబడిన పద్యములివి. |
| 5. | కాశీఖండము | శ్రీనాథుడు, వావిళ్ల ప్రతి, 1962 |
| 6. | కుమార సంభవము | నన్నెచోడుడు,<br>ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, 1978 |
| 7. | తారకబ్రహ్మ రాజీయము | చింతలపూడి యెల్లనార్యుడు<br>(రాధామాధవ కవి) |
| 8. | నృసింహ పురాణము | ఎఱ్ఱన,<br>ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి,<br>డిసెంబరు, 1967 |
| 9. | ప్రబంధ రత్నావళి | సంపాదకులు :<br>వేటూరి ప్రభాకరశాస్త్రిగారు |
| 10. | మనుచరిత్రము | పెద్దన,<br>వావిళ్ల ప్రతి, 1969 |
| 11. | మార్కండేయ పురాణము | మారన,<br>వావిళ్ల ప్రతి, 1955 |

12. రామాయణ కల్పవృక్షము - బాలకాండము — విశ్వనాథ సత్యనారాయణగారు
ప్రచురణ - 1976,
వర్లీ పబ్లికేషన్సు,
మారుతీనగర్, విజయవాడ-2

13. వరాహపురాణము — నంది మల్లయ, ఘంట సింగయ,
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, 1978

14. విక్రమార్క చరిత్ర — జక్కన,
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, 1968

15. విప్రనారాయణ చరిత్ర — చదలువాడ మల్లయ

16. విరాటోద్యోగ పర్వములు — తిక్కన,
వావిళ్ల ప్రతి, 1962

17. శాంతి పర్వము — తిక్కన,
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, 1977

18. శృంగార శాకుంతలము — పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి
ముద్రణ - 1967,
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

19. శ్రీ ప్రబంధ రాజ వేంకటేశ్వర విజయ విలాసము — గణపవరపు వేంకటకవి
ముద్రణ - 1978,
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

20. హరివంశము — ఎఱ్ఱన,
వావిళ్ల ప్రతి, 1967

21. హరివంశము - సంక్షేప ప్రతి — ఎఱ్ఱన,
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
పూర్వభాగము 1968
ఉత్తరభాగము 1969

**లక్షణ గ్రంథములు :**

| | |
|---|---|
| 1. అప్పకవీయము | అప్పకవి,<br>వావిళ్ల ప్రతి, 1951 |
| 2. బాల వ్యాకరణము | చిన్నయసూరి,<br>వావిళ్ల ప్రతి, 1947 |
| 3. ప్రౌఢ వ్యాకరణము | బహుజనపల్లి సీతారామాచార్యులుగారు,<br>వావిళ్ల ప్రతి, 1966 |
| 4. శబ్ద రత్నాకరము | బహుజనపల్లి సీతారామాచార్యులుగారు,<br>పరిష్కర్త-<br>నిడుదవోలు వేంకటరావుగారు,<br>చెన్నపట్టణపు దేశభాషాగ్రంథకరణ సభ,<br>ప్రచురణ - 1969 |

**విమర్శనా గ్రంథములు :**

| | |
|---|---|
| 1. ఆంధ్రకవి తరంగిణి<br>సంపుటము - 4 | చాగంటి శేషయ్యగారు, 1948 |
| 2. ఆంధ్ర మహాభారతోపన్యాసములు | ఆంధ్ర సారస్వత పరిషత్తు,<br>హైదరాబాదు<br>పంచమ ముద్రణ, సెప్టెంబరు, 1981 |
| 3. ఆంధ్ర సాహిత్య చరిత్ర | పింగళి లక్ష్మీకాంతం,<br>ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, 1974 |
| 4. ఎఱ్ఱాప్రెగడ<br>(ఆంధ్రకవి నక్షత్రమాలిక-2) | డాక్టర్ శ్రీమతి పి. యశోదారెడ్డిగారు,<br>ఉస్మానియా విశ్వవిద్యాలయము,<br>తెలుగు శాఖ, ప్రచురణ-1972 |
| 5. ఎఱ్ఱన జయంతి | నెల్లూరివారి ముద్రణ |
| 6. కవుల చరిత్ర | కందుకూరి వీరేశలింగముగారు |
| 7. రాడ్డిరాజ్య చరిత్ర | మల్లంపల్లి సోమశేఖరశర్మగారు |

8. రెడ్డి సంచిక

9. విజ్ఞాన సర్వస్వము సంపుటము - 3. — తెలుగు భాషా సమితి, మద్రాసు, 1959

10. శారదా మంజీరము — గోలి ఈశ్వరయ్య వ్యాపార సంస్థ రజతోత్సవ వ్యాస సంపుటి, ప్రచురణ - మార్చి, 1971 గోలి ఈశ్వరయ్య పేపర్ మర్చంట్స్ అండ్ స్టేషనర్స్, సికింద్రాబాదు

11. సమగ్ర ఆంధ్ర సాహిత్యము మూడవ సంపుటము పద్మనాయక యుగము — ఆరుద్ర, యం. శేషాచలం అండ్ కో, సికింద్రాబాదు, 1965

12. సాహిత్యదర్శనము - వ్యాసావళి-కాటూరి వేంకటేశ్వరరావుగారు, కాటూరి కవితాలత ప్రచురణ, ప్రథమ ముద్రణ - ఆగస్ట్, 1967 దుర్గా అగ్రహారం, విజయవాడ-2

13. సాహితీ మంజూష సారస్వత వ్యాస సంపుటి — "కళాస్రవంతి" ప్రచురణ, అక్టోబరు, 1973 2-2-1129, న్యూ నల్లకుంట, హైదరాబాదు.

14. సాహిత్య ప్రబోధము — "సాహితీ సదస్సు" ప్రచురణ, 1972 40-371, విద్యానగరు, కర్నూలు-1

15. సింహపురి మండలము సర్వస్వము — నల్లపరెడ్డి చంద్రశేఖరరెడ్డి, 1963

16. 'యెఱ్ఱయ కవిత' - వ్యాసము; సారస్వత వ్యాసములు-ప్రథమ సంపుటి — ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ప్రచురణ, సంపాదకులు : డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం

## సిద్ధాంత వ్యాసములు :

1. నన్నయ భారతము — ఆచార్య
డా॥ దివాకర్ల వేంకటావధానిగారు

2. ఆధునికాంధ్ర కవిత్వము సంప్రదాయములు-ప్రయోగములు — ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డిగారు
ప్రథమ ముద్రణ - 1967
ద్వితీయ ముద్రణ - 1977

3. తిక్కన కావ్యశిల్పము — ఆచార్య
డా॥ కేతవరపు రామకోటిశాస్త్రిగారు
ప్రథమ ముద్రణ - 1973
విద్యారణ్యపురి, వరంగల్-1
క్వాలిటీ పబ్లిషర్స్,
అరండల్‌పేట, విజయవాడ

4. తెలుగులో హరివంశములు — డాక్టర్ శ్రీమతి పి. యశోదారెడ్డిగారు
ప్రథమ ముద్రణ - 1973
సుధర్మ పబ్లికేషన్సు,
3-4-574, నారాయణగూడ,
హైదరాబాదు-500 029

5. నన్నయ కవిత్వము - అక్షరరమ్యత — డాక్టర్ వి యల్. నరసింహారావుగారు
ప్రచురణ - 1977.
శ్రీ విశ్వేశ్వరా పబ్లికేషన్స్,
గవర్నర్‌పేట, విజయవాడ-2

6. ప్రబంధ వాఙ్మయ వికాసము రాయల యుగము, సంపుటము-1 — డాక్టర్ పల్లా దుర్గయ్యగారు
ప్రథమ ముద్రణ - ఏప్రిల్ 1978
3-5-1027, నారాయణగూడ,
హైదరాబాదు-500 029

7. భారత ధ్వనిదర్శనము — డాక్టర్ శలాక రఘునాథశర్మగారు
ప్రథమ ముద్రణ - అక్టోబరు 1979
ఆనందవల్లీ గ్రంథమాల, అనంతపురం

8. వచన వాఙ్మయ వికాసము — ఆచార్య డాక్టర్ ఎం. కులశేఖరరావుగారు
ప్రథమ ముద్రణ - 1971
విజ్ఞానపురి, హైదరాబాదు

9. ప్రథమాంధ్ర మహాపురాణము — ఆచార్య
డాక్టర్ జి వి. సుబ్రహ్మణ్యంగారు
'శ్రీవాణి' 1-8-702/105,
నల్లకుంట, హైదరాబాదు-44

10. ఆంధ్ర మహాభారతము - ఛందఃశిల్పము — డాక్టర్ పాటిబండ మాధవశర్మగారు
1-8-87/ఎ, చిక్కడపల్లి,
హైదరాబాదు-20

11. ఆంధ్ర విమర్శ - వాఙ్మయోత్పత్తి పరిణామములు — డా॥ యస్. వి. రామారావుగారు
తెలుగుశాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాదు

12. కవిత్రయమువారి యొక్కయు, నాచనసోమనాథుని యొక్కయు, కవితాశయాభ్యాసములు — డా॥ మాదిరాజు రంగారావుగారు
తెలుగు శాఖ,
కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్లు

## వ్యాసములు - పత్రికలు :

1. "అరివర్ణ చక్రోద్ధారము" — కొండముది నరసింహముగారు
భారతి, జూలై, 1927

2. "ఎఱ్ఱాప్రెగడ హరివంశ రచనాకాలము" — నిడుదవోలు వేంకటరావుగారు
'పరిశోధన', ఫిబ్రవరి/మార్చి, 1956

3. "చందవోలు రాజధానిగా నున్నప్పుడు" — మల్లంపల్లి సోమశేఖరశర్మగారు
భారతి - జూలై, 1944

4. తెలుగు చరిత్రకు కావ్యత్వం కల్పించిన నవలాశిల్పి నరసింహశాస్త్రి — ఓగేటి అచ్యుతరామశాస్త్రి
'ఆంధ్రప్రభ' దినపత్రిక,
నవంబరు 3, గురువారం, 1977

5. "నృసింహపురాణ పాఠపరిశోధన" రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు
'ఆంధ్రపత్రిక' (వారపత్రిక),
1969-70, సౌమ్య సంవత్సరాది
సంచిక, ఏబది తొమ్మిదవ సంచిక

6. "పూర్వాంధ్ర సాహిత్యము" విశ్వనాథ సత్యనారాయణగారు
'ఆంధ్రప్రదేశ్' ప్రభుత్వ మాసపత్రిక,
ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర 20వ వార్షికోత్సవ
ప్రత్యేక సంచిక, నవంబరు-1976

7. తిరుపతి వేంకటేశ్వరుడే ఓగేటి అచ్యుతరామశాస్త్రి
తిక్కనగారి హరిహరనాథుడా! 'స్రవంతి' తెలుగు మాసపత్రిక,
1978 మే, జూన్ నెలల సంచికలు,
దక్షిణ భారత హిందీ ప్రచార సభ
ప్రచురణ, హైదరాబాదు

## సంస్కృత గ్రంథములు :

1. అభిజ్ఞాన శాకుంతలము కాళిదాసు,
ది పాప్యులర్ బుక్ స్టోర్సు,
టవర్ రోడ్, సూరత్.
1951

2. అమరకోశము అమరసింహుడు

3. కావ్యమీమాంస రాజశేఖరుడు,
డాక్టర్ పుల్లెల శ్రీరామచంద్రుడుగారి
బాలనన్దినీ ఆంధ్ర భాషావ్యాఖ్యా
సమేతము,
ప్రథమ ముద్రణము - 1979
ఆర్-33, ఉస్మానియా
యూనివర్సిటీ కాంపస్,
హైదరాబాదు-500 007

4. కిరాతార్జునీయము — భారవి,
మోతీలాల్ బనారసీదాస్, వారణాసి.
1977

5. చంపూ రామాయణము — భోజుడు, లక్ష్మణసూరి,
వావిళ్ల ప్రతి - 1941

6. ధ్వన్యాలోకము — ఆనందవర్ధనుడు

7 రఘువంశము — కాళిదాసు,
నిర్ణయసాగర్ ప్రెస్,
బొంబే, 1948

8. వాల్మీకి రామాయణము — వావిళ్ల ప్రతి - 1956

9. శృంగార ప్రకాశ — భోజుడు

10. శిశుపాల వధ — మాఘుడు,
నిర్ణయసాగర్ ప్రెస్, బొంబే,
1957

11. శ్రీమన్మహాభారతము — వ్యాసుడు,
గీతా ప్రెస్,
గోరఖ్‌పూర్, విక్రం-2018

12. సరస్వతీ కంఠాభరణము — భోజుడు,
పబ్లికేషన్స్ బోర్డు,
అస్సాం, గౌహతి-3
1967



# డా॥ ఓగేటి అచ్యుతరామశాస్త్రి సాహిత్యము

1. **శంకరాచార్య** - పద్యకృతి, 1958.

2. **బందాబైరాగి** - చారిత్రక రూపకము, 1959.

3. **సంస్కృత నాటక ప్రయోగరంగము** - పరిశోధన గ్రంథము. 1975 ప్రచురణ: సంస్కృత థియేటరు, హైదరాబాదు. డెమ్మీసైజు పుటలు: 182, వెల: రూ. 10-00. క్రీ శ. 1874-1975 మధ్య ఆంధ్రప్రదేశములో ప్రవర్తిల్లిన ఈ వంద సంవత్సరముల సంస్కృత నాటక ప్రదర్శనలు, నటుల చరిత్రలు ఇందు పొందుపరుపబడినవి. అప్పటి రాష్ట్ర విద్యామంత్రి శ్రీ భాట్టం శ్రీరామమూర్తిగారి పీఠికయు. పుంభావ సరస్వతి శ్రీ గుండేరావు హర్కారేగారి యభిప్రాయము ఈ గ్రంథమున కలంకారములు.

4. **స్నేహబంధనమ్** - సంస్కృత సాంఘిక ఏకాంకరూపకము. విజయదశమి, 11 అక్టోబరు, 1979. ప్రచురణ: సంస్కృత థియేటరు, హైదరాబాదు. క్రౌన్‌సైజు పుటలు: 36. వెల: రూ. 2-00. ఇందు మొత్తము ఐదు ప్రేక్షణకములు ఉన్నవి. నాల్గు పురుషపాత్రలు గలవు. ఐదవ పాత్రయగు కథానాయకుడు అసలు రంగస్థలమున కనిపించడు. అతనిచుట్టూ నాటకము తిరుగును. స్త్రీ పాత్రలేదు. ఎన్ని అపార్థములు వచ్చినను నిజమైన స్నేహమునకు చదలంటదని నిరూపించు నితివృత్తము. పాత్రలన్నియు హీనిహీనిగ జీవితమును గడుపు మధ్యతరగతి కుటుంబములకు చెందినవే. ఇతివృత్తపరముగను, "ప్రయోగవిజ్ఞాన"పరముగను ఇదొక **Experimental Play** అని ప్రశంసల నందుకొన్నది. ఈ రచయితకు అన్నయు, సంస్కృతాంధ్ర మహాకవియునైన పండిత శ్రీ ఓగేటి పరీక్షిత్‌శర్మగారు "మమ అనుజః" అన్న శీర్షికతోను, హార్థి సోద

కులలో నొకరైన శ్రీ లక్ష్మీనరసింహశర్మగారు "శ్రీయాదచ్యుతరామః" అన్న శీర్షికతో నిచ్చిన సంస్కృత శ్లోకముల ఆశీస్సులు, ఉస్మానియా విశ్వవిద్యాలయ భూతపూర్వ సంస్కృత శాఖాధ్యక్షులు ఆచార్య డా॥ వి ఆర్. శాస్త్రిగారు "ప్రస్తుతిః" పేరుతో వ్రాసిన పీఠికయు దీనికి వెలలేని యాభరణములు,

* ఈ రూపకమునందలి రెండవ ప్రేక్షణకము ఆంధ్రప్రదేశములోని ఓరియంటల్ హైస్కూళ్ళయందు విద్యనభ్యసించు 10వ తరగతి విద్యార్థులకు 1988-89 విద్యాసంవత్సరము నుండి ప్రారంభమైన "అమరభారతీ" అను సంస్కృత ప్రధాన భాషా పాఠ్యగ్రంథమున చేర్చబడినది.

5. **హిమకిరీటిని** - తెలుగు స్వీయ కవితా సంపుటి. 2 ఆగస్ట్, 1981. ప్రచురణ: పావని పబ్లికేషన్సు, హైదరాబాదు. క్రౌను సైజు పుటలు : 68 వెల : రూ. 8-00. 1960-1980 మధ్యకాలమున వివిధ పత్రికలలో ప్రకటింపబడిన గేయ పద్య వచన కవితా ఖండికల సంకలనమిది. జాతీయ సాహిత్య పరిషదధ్యక్షులు శ్రీ భండారు సదాశివరావుగారు సంతరించిన "భూమిక"యు, మహాకవి డా॥ గడియారం వేంకటశేషశాస్త్రిగారు, సరస్వతీపుత్ర, డా॥ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు సెలవిచ్చిన ఆశీఃప్రశంసలు దీనికి అమూల్యాలంకారములు.

* హిమకిరీటిని - వ్యవస్థీకృత పునర్ముద్రణ. 2 ఆగస్ట్, 1988. క్రౌన్ సైజు పుటలు : 68. వెల : రూ. 5-00. ఇదొక ఆధ్యాత్మిక జాతీయ మహాకావ్యమని ప్రశంసింపబడుచున్న కృతి.

6. **భారతీయ చరిత్ర సత్యాన్వేషణ** - జూలై 1983. ప్రచురణ: శ్రీ బాబాసాహెబ్ ఆప్టే స్మారక సమితి, భారతీయ ఇతిహాస సంకలన యోజన. హైదరాబాదు. డెమ్మీ సైజు పుటలు : 40. వెల : రూ. 2-50. ఉజ్జయినీకి చెందిన ప్రముఖ పురాతత్త్వశాస్త్ర పరిశోధకులు పద్మశ్రీ డా॥ వాకణ్కర్‌గారును, అయోధ్యకు చెందిన చరిత్ర పరిశోధకులు శ్రీ వినోద్ మిశ్రాగారును వ్రాసిన హిందీ వ్యాసములకు ఈ రచయిత చేసిన ఆంధ్రానువాదమిది. విదేశీయులు వక్రగతిని పట్టించిన మన దేశ యధార్థ

చరిత్రను మఱల మనము తిరుగ వ్రాసుకొనవలసియున్నదను విషయము సోదాహరణముగ, మేథావంతముగ నిరూపింపబడిన పుస్తకమిది.

7. **స్వామీ వివేకానంద కవితావైభవం** - అపూర్వ సాహిత్య విమర్శ. 9 డిసెంబరు 1988, ప్రచురణ : యువభారతి, సికిందరాబాదు. డెమ్మీ సైజు పుటలు 48. వెల : రూ. 4-00. ఇందు మూడు భాగములుగలవు. ఒకటి: ఈ రచయిత వివేకానందుని గూర్చి అపూర్వ విశేషములతో వ్రాసిన భూమిక. రెండు : వివేకుడు అంబాస్తోత్రం, శివస్తోత్రం, శ్రీరామకృష్ణ స్తోత్రం అను శీర్షికల క్రింద వ్రాసిన 26 సంస్కృత శ్లోకములకు అద్భుతమైన సమగ్ర వ్యాఖ్య. మూడు : ఆయన వ్రాసిన 12 ఆంగ్ల కవితలకు వ్రాసిన విశ్లేషణాత్మక వివరణ. వివేకానందుని కవిత్వమును గూర్చి తెలుగువారికి పరిచయము చేసిన తొలి పుస్తకమని కీర్తింపబడుచున్న గ్రంథమిది! యువభారతి అధ్యక్షులు డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారు సంతరించిన పీఠిక దీనికొక చక్కని యలంకారము.

8. **హైదరాబాదు నగర తెలుగు భాషాసాహిత్య వికాస చరిత్ర** - 12 అక్టోబరు 1985. ప్రచురణ: శ్రీ బాబాసాహెబ్ ఆప్టే స్మారక సమితి- ఇతిహాస సంకలన సమితి, హైదరాబాదు డెమ్మీసైజు పుటలు 160. వెల: రూ. 25-00. క్రీ శ. 1518 గోల్కొండ కుతుబ్షాల కాలము నుండి క్రీ శ. 1956లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన నాటి వఱకు- ఈ 450 సం॥ కాలములో హైదరాబాదు నగరములో మాత్రమే ప్రవర్తిల్లి క్రమవికాసము గాంచిన తెలుగుభాషా సాహిత్య చరిత్ర సర్వతోముఖముగ చర్చింపబడినది. ఆంధ్రప్రదేశ్ ఆస్థానకవి కళాప్రపూర్ణ డా॥ దాశరథి డి లిట్. గారు "భాగ్యనగర భారతి" పేరుతో సంతరించిన పీఠికయు, సిటీ గ్రంథాలయ సంస్థ అధ్యక్షులు మాన్యులు శ్రీ మామిడి భోజిరెడ్డిగారు, తెలంగాణ వైతాళికులలో నొకరగు మాన్యులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు సెలవిచ్చిన ఆశీస్సులు, అభిప్రాయములు దీనికి శ్రీరామరక్ష.

9. **ఓగేటి వ్యాసపీఠి** - అపూర్వములైన వివిధ పరిశోధనా సాహిత్య వ్యాసముల సంపుటి. డిసెంబరు 1986. ప్రచురణ : సాహిత్యసభ, హైదరా

బాదు. డెమ్మీ సైజు పుటలు 226. వెల : రూ. 40-00. 1956-1986 మధ్య కాలములో వ్రాసి ఆయా పత్రికలలో ప్రచురించిన 24 వ్యాసముల సంకలనమిది. తిరుమల వేంకటేశ్వరుడు తొలుత వస్తుతః హరిహర స్వరూపుడనియు, తిక్కన తన భారతమును అంకితమిచ్చిన హరిహరనాథుడు వేంకటనాథుడేయనియు ప్రామాణికముగ నిరూపించుచు 8 శీర్షికల క్రింద విభజింపబడిన 108 పుటల ప్రత్యేక విషయము ఇందు ప్రధానమైనది. ఇట్లే తక్కిన వ్యాసములన్నియు అపూర్వ విషయ ప్రతిపాదకములు. ఇదొక విశిష్టమైన గ్రంథముగ ప్రశంసింపబడుచున్నది. దీనిని గూర్చిన మఱికొన్ని వివరములకు ఈ గ్రంథమునందలి 207 పుట చూడగలరు. డా॥ పి.యస్ ఆర్. అప్పారావుగారు అనతిచ్చిన "పరిచయం", డా॥ నండూరి రామకృష్ణమాచార్యగారు ప్రసాదించిన "అభినందన చందనం", శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావుగారు అనుగ్రహించిన "పురోణి", డా॥ ముక్కామల రాధాకృష్ణశర్మగారు సెలవిచ్చిన "అభిప్రాయము" ఈ గ్రంథమునకు అమూల్యాలంకారములు.

10. **హైదరాబాదు నగర బిర్లామందిర వేంకటేశ్వర శతకము** - ఆగస్టు 2, 1987. ప్రచురణ : సాహిత్యసభ, హైదరాబాదు. క్రౌన్ సైజు పుటలు 40. వెల : రూ. 5-00. నూటపదహారు తేటగీతుల శతకమిది. ఇందు వేంకటేశ్వరుడు హరిహరస్వరూపుడుగ వర్ణింపబడుట, హైదరాబాదు నగరమునకు సంబంధించిన కొన్ని అద్భుత చరిత్రాంశములు సందర్భోచితముగ సమన్వయింపబడుట విశేషములు.

11. **అచ్యుతగీత** - వివిధ పత్రికలలో ప్రకటింపబడిన స్వీయ సంస్కృత గేయ సంపుటి.

12. **ఎఱ్ఱన అరణ్యపర్వ శేషము** - ప్రస్తుత గ్రంథము.

## ప్రచురణోన్ముఖ గ్రంథములు :

**హరిహరనాథ ద్విశతి** - తిక్కన భారతములోని ఆశ్వాసాద్యంత హరిహరనాథ పద్యములకు ఈ రచయిత చేసిన సంస్కృతానువాదము.

**Lady of the Lake** - ఇంగ్లీషులో వ్రాసి వివిధ పత్రికలలో ప్రకటించిన తెలుగు జానపద కథల సంపుటి.